కవికోకిల గ్రంథావళి — ౫

# గులాబితోట

సాదీమహాకవి "గులిస్తాన్"
అను పారసీ కావ్యమునకు
అనువాదము

"కవికోకిల"
దువ్వూరి రామిరెడ్డి

# అవతారిక

మహోన్నత ప్రభావ భాసురుండగు భగవంతుని స్తుతించుటయు ఆయనయెడ శ్రద్ధాభక్తులు కలిగియుండుటయు ఆత్మానుభవమునకు హేతువగును; కృతజ్ఞతాభివందనములు అనుగ్రహాభివృద్ధికి మూలమగును. మనము లోనికి పీల్చుకొను ప్రతియూపిరియు జీవితమును పొడుగించును. వెలికూర్చునప్పుడు హృదయోల్లాసము కలుగును. కావున, ప్రతియూపిరికిని రెండు లాభములు చేకూరుచున్నవి. ప్రతి లాభమునకును మనము దేవునికి కృతజ్ఞులమై యుండుట ఆవశ్యకము.

ఎవనిచేతులు నాల్క యీశ్వరు దయకు
దగినట్లు నెరవేర్చ దమ కృతజ్ఞతను?

"దావీదు సంతానములార, కృతజ్ఞత నభ్యసింపుడు. నా సేవకులలో కృతజ్ఞులు కొద్దిమందియే యున్నారు"

దానుంచు దైవసన్నిధి
దీనములందెల్పి ప్రణతితోడను వేడన్
వాని; యిటుగాక యెవ్వడు
వినక పోకుండ దైవవిధులనొనర్పన్.

సర్వేశ్వరుని యనంత కరుణాప్రవాహ రసము అన్నిచోట్ల వర్షించును. ధారాళమైన ఆయన అనుగ్రహసంతర్పణము ఎల్లయెడల వెలయుచుండును. పాపాత్ములైనను తన సేవకుల గౌరవమునకనుచింపి వారిని విసర్జింపడు; తప్పు లొనరించినను వారి దీనభక్తిని నిరాకరింపడు.

ధర్మబాహ్యుల కగ్నిమత్తనులకును
గుప్త భాండారమున నుండి కురువ నిడుదు,

వాదరింతువు శత్రుల నైన గరుణ;
నిక నెటు బహిష్కరింతువు హితుల నీవ?

భగవంతుడు గృహపరిచారకుడైన ప్రభాతవాయువును, పచ్చల రత్నకంబళమును పరచుట కాజ్ఞాపించెను. దాదియైన వాసంత జలదమును ఓషధీ కుమారికల ధరా డోలిక యందుంచి పోషింప నియమించెను. తరులతలకు ఉగాది కానుకలుగా పచ్చని యంగీల ప్రసాదించెను. వసంత సమాగమనోత్సవ సమయమున కొమ్మకొమ్మలు తలను ధరింప కుసుమగుచ్ఛ కిరీటముల నొసంగెను. చెఱకుగడ రసమును తన శక్తిచేత ఉత్తమ మకరందముగ మార్చెను. ఖర్జూర బీజము తన శిక్షణమువలన ఉన్నత తరువగు నటులొనర్చెను.

జలదము వాయువున్ శశియు సారసమిత్రుడు నంబరంబు నీ
విల దినభుక్తిగాంచ లభియించిన భోజనముం గృతజ్ఞతా
కలితుడవై భుజింప, నిజకార్యనిబద్ధములై తొలంగ వా
జ్ఞలు; మరి నీకు మాత్రమది న్యాయమె యాజ్ఞ నతిక్రమింపగన్.

ప్రాణికోటులకు నాయకుండును, సృష్టికిం గల శ్రేష్ఠుండును, లోకములకు కరుణాప్రదాతయును, మానవజాతులకు నిష్కళంక హృదయుండును, కాలచక్ర పరిభ్రమణమునకు పగమానవాధినాయకుండునగు మహమ్మదు ముస్తఫాను (దైవానుగ్రహము, శాంతి ఆయనపై నెలకొనును గాక !) గురించి హదీసున చెప్పబడియున్నది.

మతతత్పరులను గోడకు
సతతము మీవంటి యూతనసంకురియుండగ
వెతలేల? నోహు నావికు
పతియైనన్ క్షుభిత జలధి భయుపడనేలా?

హదీసు :— దురదృష్టవంతుడగు పాపియొకడు నొక సేవకుడు పశ్చాత్తప్తుడయి, మన్నన గోరుచున్న యాసతో చేతులెత్తు నేని

మహోన్నతుడగు భగవంతుడు వానిని కన్నెత్తియైన చూడడు మరల ఆతడు ప్రార్థించును. దేవుడుని రాకరించును. తరువాత దీనతతో వేదనాభరితుడయి ఆతడు వేడికొనును. అంతట దేవుడు "వాని ప్రార్థన మంగీకరించితిని. ఏలయన. ఆ దాసుని నిరంతర ప్రార్థనముననుసు పందేవనముననుసు నేను సిగ్గుపడితి" నని సెలవిచ్చును.

భగవంతుని యౌదార్యము
అగణిత కారుణ్యమెంతొ యరయుము, దాసుం
డెగబడి తప్పులొనర్చిన
యుగడునకుం దానె పొందు నార్తిని సిగ్గున్.

దేవుని కీర్తి గగనములకు చిహ్నమైన 'బాబా' యొద్ద నిరంతరము నివసించు భక్తులు తమ పూజాలోపములను ఒప్పుకొని "మిమ్ము పూజింపవలసిన విధమున పూజింపకుంటి" మని విన్నవింతురు, ఆయన రూపసౌందర్యము నభివర్ణించువారు ఆనంద తన్మయత్వమున "మిమ్ము తెలిసికొనవలసిన రీతిగా తెలిసికొనమైతి" మని వచింతురు.

భగవంతుని వర్ణింపుమ
తగినట్టులని యొకడున్న దమిగొని వేడన్
జగదీశు నిరుపమేయుని
విగత హృదంతరుడ నెట్లు వివరింపగలన్?

ప్రియురాలి బలిపిరి ప్రేమనుల్ మృతులు;
పలుకేడియున్ రాదు వారిగొంతుకల.

ఒక మహనీయుడు ఆలోచనా నిమగ్నుడయి తలవంచుకొని భావదృశ్య పయోధియందు మునిగియుండెను. ఆ స్థితినుండి బయటికి వచ్చిన పిమ్మట "మీరు పచారు చేయుచుండిన యుద్యాన వనమునుండి యేమి వింత కానుక మాకు తెచ్చితి" రని యొక మిత్రుడడిగెను.

"గులాబిపొద దగ్గరకు పోయినప్పుడు, నా చొక్కాయి చెంగునిండ పువ్వులు కోసుకొని మిత్రులకు కానుకగా సమర్పింప వలయునని నేను తలంచితిని. కాని అచ్చటికి పోయినప్పుడు గులాబిపూవుల సౌరభ్యమునకు మత్తుడనయి చేతికొంగు జారవిడిచితిని" అని ఆయన చెప్పెను.

ఓసి బుల్బులి, శలభము నొద్దనీవు
అలవరుచుకొమ్ము ప్రణయ పారాంతరమ్ము;
దీపశిఖబడి యది కడతేరుగాని
బయటికే రావము౽ వినబడకయుండు.

దేవుని గనఁగొంటి మటం
చేవో వర్ణించువార లెరుగనివారల్;
దేవునిగాంచిన తన్మయ
భావుల వృత్తాంత మెట్లు వచ్చును మనకుఁ?

భావోహాతీతుడవగు
దేవా, నిను పండితుల్ నుతించెడు కంటె౯
నే విని చదివినకంటె ఏ
నీవత్యధికుండవంచు నేవలపోతు౯.

కడదాకె గ్రంథరాజము
కడచెను నాజీవితంబు గాంచుచు నుండ౯.
విడువక మున్నటివలె నే
గడపెద నీవర్ణనమున కాలము నీశా.

## ఇస్లాం మహాప్రభువు వర్ణనము

సాదీని గురించిన చక్కని ప్రశంసలు ప్రజా సామాన్యము నోట వెలువడు చుండెను. అతని వచనముల ప్రఖ్యాతి లోక మెల్లెడల వ్యాపించెను. ఆయన ప్రియమైన లేఖనముతో రచించు కృతులను జనులు చక్కెరవలె భుజించుచుండిరి. ఆయన పద్యములు వ్రాసిన చిత్తుకాగితపు

ముక్కలు సర్కారు నోట్లవలె చలామణి యగుచుండెను. దీనికంతయు ఆతని పాండిత్యాతిశయము, వచోనైపుణ్యము కారణమనరాదు. ఏలయన, సార్వభౌముడు, కాలచక్ర పరిభ్రమణమునకు ఉత్తర ధ్రువము సులేమానుకు ప్రతినిధి, ముసల్మాన్ భక్త రక్షకుడు, సాద్ జంగీ పుత్రుడు, ఇహలోకమున దైవచ్ఛాయ, ముజఫరుద్దీన్ అబూబకర్ (సర్వేశ్వరా! ఆయన కోర్కెలను నెరవేర్చుము) అనుగ్రహదృష్టి సారించి; అంగీకారము సూచించి; నిష్కపటమైన తన యభీష్టమును తెలియపరచి నందువలన, గొప్పవారు మొదలు సామాన్యులవరకు అందరును ఆయనపై శ్లాఘాభావము చూపుచుండిరి. ఏలయన రాజుల మతమునే ప్రజలును అవలంబింతురు.

అనుపమ తావకీన కరుణామృత దృష్టులు నన్నుబోటి దీ
నుని పయి సోకినంతనె వినూతన యోగ్యత లాంఛనంబు హె
చ్చెను కవికంటె; నైజముగ సేవకునందు ననేక దోషముల్
పొసరియు, రాజు మెచ్చు ప్రతిలోపము మారును సద్గుణంబుగన్.

ప్రేయసి యొకనాడు పెట్టె నాచేత
స్నానంపు గదిలోన, సౌరభంబీను
మృత్తిక నొక్కంత; మెచ్చుకొంచలరి
"కస్తూరి తుక్కవా, కాక, యంబరువ,
నేను మత్తుడనైతి నీదు నెత్తావి"
అని నేను దానితో నంటి నెయ్యమున,
అది సన్నుగని యిట్టులనియె: "ఓ మిత్ర,
కొఱగాని మట్టినై కుమిలితి మున్ను;
చాలకాలము గులాబీల సాంగత్య
మున నుంటి, సద్దాన దనరె నీపాటి
యందచందము తావి, యట్లుగాకున్న
మున్నటివలె నేను మన్నునైయుందు."

భగవంతుడా! ముసల్మానుల జీవితము పొడిగించి జీవితఫలము ననుభవింప జేయుము వారి సత్కార్యములకు తగు ప్రతిఫలము హెచ్చింపుము. వారి స్నేహితులయు కార్య నిర్వాహకులయు పదవుల ఉన్నతి నొందింపుము. వారి విరోధులను, కీడుగోరు వారిని, ఖురానుసూక్తి ప్రకారము నిర్మూలము చేయుము. లోకపోషకా! వారి రాజ్యమును సంతానములను కాపాడుచుండుము.

ఉన్నతోన్నతుడును కలంక రహితుడును అగు భగవంతుడు, న్యాయాధిపతుల దండనీతి వలనను, కరగ్రాహుల ప్రయత్నముల వలనను పావన షీరాజ్ పట్టణము అంత్యదినముదనుక శాంతియుతమై వర్ధిల్లునట్లు రక్షించుచుండును గాక !

కరుణాపాలిత లోక, మిము నిహలోకచ్ఛాయయౌ పాదుషా
పరిపాలింపగ, పారసీక ధరణీ భాగంబునం; గాల దు
స్తర దౌర్గత్యము చచ్చె; నేడుచు ఫరస్ దేశంబునం దెచ్చటన్
అరయన్ లేము తదీయ దేహళికి దీటౌ నాశ్రయస్థానమున్.
అదరు వేమిలేని ప్రజసంవర ప్రేమ భరంబు మీవి, యో
పాదుష, తత్కృతజ్ఞతను వాకొను భారము మాది, యాపయిం
గాదనకుండ యుక్తమగు కార్యఫలంబులనిచ్చు భార మా
యాదిమసృష్టికర్త కరుణాఢ్యుని దౌసని విన్నవించెదన్

మా పారసీకరాజ్యము
గాపాడుము దేవదేవ, కలకాలంబున్
ఏపాటి విప్లవానిల
కోపప్రళయోగ్రహతికి గురిగాకుండన్.

## గ్రంథ రచనా హేతువు

ఒకనాటి రేయి, గతించిన కాలమును గురించి యాలోచించుచు, వ్యర్థముగ గడచిపోయిన నా జీవితమునకై చింతించి, హృదయశిలా

గృహమును బాహ్యక్రమముతో భేదించి, అప్పటి నా స్థితికి సరిపోవు ఈ ద్విపదలను పఠించితిని :

ప్రతి నిమేషము నూర్పుపలన జీవితము
వ్యయమౌను; గమనించి యరయుదుమేని
ఎక్కువ శేషింప; దేఁడుదియేండ్లు
గడచెనోయీ, యింక గన్నుమోడ్చెదవు;
మిగత యైదుదినాలు మేల్కొని బ్రతుకు.
అంత్యకాలపుజింత నాత్మయందింక,
సత్కార్య రహితుడై చచ్చినవాడ.
పరలోకమున సిగ్గుపడుట నిజము,
ప్రస్థానభేరీరవంబు జోరొక్కసియె,
చంక మూటాముల్లె సవరింపవిక;
వెడలు వేకువకెవ్వ కడుదుఃఖంబయ్యు
జాగుసేయును బాటసారి పైనంబు.

ఇటకు వచ్చినవారెందరో క్రొత్త
గృహమును నిర్మించి, యేగుకాలమున
నింకొక్కరికి దానినిచ్చి పోయెదరు.
వారును గొన్నేండ్లవరకు సుఖించి
యేగుదురేగాని యిల్లొక్కడైన
బూర్ణంబు కంటెను బూర్తిసేయుండు
చంచల చిత్తయౌ చపలాకి నీవు
కామింపబోకుము; కటు దోహురాలు.
తగదు నీ ప్రేమకు, దలపోసి చూడు;
అఖిల మానవులకు హర్షమూలంబు
కడుపెయౌ; నది మెల్లగడచిన నేమి?
కట్టిన వెళ్లిన గష్టంబె రేట;
ఆన్యోన్యము విరుద్ధమౌ చతుర్భ్రాత
ములు కొంత కాలంబు గలసియు మెలసి

యొకటిగా నుండిన నొదవు సుఖంబు;
అటుగాక నందొక్కడా మూటినణచి
చెలరేగ, దియ్యని జీవంబు మేను
వెడలునుగాన, వివేక సంపన్ను
డీ జీవితముపైన నిచ్చపెట్టండు.
సజ్జనుల్ దుష్టులు చచ్చెద, రైన
సౌజన్యమట్ల జెండు జంక్క గొంపోవు
నతడె సంతుష్టుండు నతి యశోధనుడు.
నీకంటెముందుగా నీదు గోరీక
బరసౌఖ్య సాధన ప్రతతి బంపింపు;
వెనుక నంపెడువారు వేరె లేరెవరు.
బ్రతుకు మంచునుబోలు, భానుండు వెలిగె;
మంచంత కరగెను, కొంచెమే నిలిచె;
అంత్యదినస్వామి యటవేచు చుండు;
ఓయి నెచ్చెలికాడ, యుత్తచేతులను
అంగడి వీధికి నరిగిన వేమొ
తలగుడ్డతో మళ్లి వెలువక వంచు
భయము గల్గెడు నాకు; పంకెక మున్నె
యూచపాట్టల మెక్కు నుత్త దరిద్రు
డామని దినములం దన్యుల మడుల
పరికయేరి భుజింప వలసియే యుండు.
సాదిహితోపదేశము ప్రియుంబార
వినుము; మార్గంబిట్టులౌనరు; మానవుడ
వగుము; ధీరుండవై పథగామి వగుము.

ఆలోచించిన యనంతరము విషయ విముఖుడనై, మానవము శపించి, యితరుల సాంగత్యము వీడి యొకమూల కూర్చుండుటయే యుచితమని నాకు తోచినది.

తననాలుక పని వినునటు
లొనరింపని వానికన్న యోగ్యతరుండౌ,
తన నాలుక తెగి మూకత
మనబధిరత మూలబడిన కష్టుంతైనఁ.

ఇట్లుండ, యాత్రల యందును ఇంటియందును నాకు తోడు నీడగా నుండిన యొక స్నేహితుడు మున్నటి యలవాటు చొప్పున లోనికి ప్రవేశించి నన్నాట పట్టించి చతురోక్తులు ప్రేలి యెంత వేడ్క గల్పినను ఆతనికి ప్రత్యుత్తర మీయక, మోకాలిపై తల వానించుకొని దాసత్వము వహించి యుంటిని. అతడు మనసు నొచ్చుకొని నాకట్టు చూచి యిట్లనియెను :

అన్న, వచియించు శక్తి నీకున్న యపుడె
ప్రమదమున నాదతంబున బలుకు, మట్లు
గాక, రేపు మృత్యువుజంటు కడపదొక్క
మౌన మనివార్యముగ నీవు పూనవలయు.

నా మిత్రులలో నొకడు నా జీవిత పద్ధతిని గూర్చి యాతని కిట్లు తెలియపరచెను. "స్వామి తన జీవితశేష మంతయు నిరంతర ధ్యానపరాయణుండయి మౌనము వహించి యుండుటకు దృఢముగ నిశ్చయించుకొనెను. నీవు నీ చేతనైనట్టుగ నీ పనులు చూచుకొని నీకు మేటియైన దారిని పొమ్ము." అంతట ఆ స్నేహితు డిట్లనియెను: "నేను దేవుని పైనను పూర్వ సహవాసము పైనను ఒట్టు పెట్టుకొంటిని. మునుపటివలె ఆయన నాతో మాటలాడకున్న ఊపిరి పీల్చను; అడుగైన వెనుకకు తీయను. ప్రతిజ్ఞా భంగము చేసినవాడనైయుండ మిత్రులమనసు నొప్పించుట యవివేకము. అతీఖడ్గము ఒరలో నుంచుటయు వాడినాలుక నోట నదుముకొని యుండుటయు పెద్దల యభిప్రాయమునకును బుద్ధిమార్గమునకును వ్యతిరేకముగ నుండును."

అరయఁగ విజ్ఞుని నాల్క యొట్టిదనః బ్రాజ్ఞానేక విజ్ఞాన సం
భర భాండార కవాట కుంచికయగుఁగ; ద్వారంబు బంధింప మం
దిర మందున్నయతం డమూల్య మణిమాణిక్యాది వి కేతయో
చిరు సంభారము లమ్మువాఁడొ యని వాచింపంగ లేరెవ్వరుఁగ.

పలుకక యుంట పండితుల భావమునం గడు మంచిదయ్యు నీ
తులుపచరించుచో బలుకు దోసముగాదు; తగఁగ వచింపగా
వలసినచోట మౌనమును, బల్కుట యుక్తము గానిచోట న
గ్గలమగుమాట, లీ యిరువగల్ వెలయించును బుద్ధిహీనత్వముఁగ

మొత్తముమీద ఆయనతో మాటలాడక యూరకుండుటకు తగిన శక్తియు, పరాఙ్ముఖుడనై యుండుటకు కావలసిన దిట్టతనమును నాయందు నశించెను. ఏలయన; అతడు నా మనస్సున కెక్కిన ప్రాణ మిత్రుడు.

పోవంగ వలసినప్పుడు
వైరిఁగ నిర్జింప దగు నుపాయము గానీ,
ధీరంబు నడల, వెనుకకు
దారందగు దారిగాని తడవుము మున్నే.

ఆవశ్యకమునుబట్టి ఆయనతో మాటలాడి హాయిగా విహరించుటకు బయలు వెడలితిని.

అది వసంత సమయము. మంచు దౌర్జన్యము శమించి సుఖప్రదముగ నుండెను. ఎర్రని గులాబీలు విరబూచి కలకల లాడుచుండెను.

కొరలు వసంత కాలమిది; కొమ్మలనేదిక తెక్కి బుల్బులుల్
సరస మనోజ్ఞ గానములు సల్పు చునుండెె; రుపాత్త చిత్తయై
చెరచెరలాడు కాంత నునుజెక్కులజారు శ్రమాంబులట్లు పొం
పిరిగొనె మంచుబొట్లు రుచిమించెడు నెర్రగులాబి పూవులఁగ.

**తోటయందొక మిత్రునితోడ రాత్రియంతయు** పుచ్చవలసినట్లు తటస్థించినది. అది మనోహర ప్రదేశము. అచ్చట తరులతలు అల్లిబిల్లిగ

నల్లుకొని యుండెను. నేలయంతయు అద్దపు దునుకలచే వెదచల్లబడి నట్లుండెనని చెప్పవచ్చును. ద్రాక్షతీగలందు పండ్లగుత్తులు నక్షత్ర పుంజములవలె వ్రేలాడుచుండెను.

> వనమునందు గొలుసువంకరలటు పారు
> జల్లయూట కాల్వ మెల్ల మెల్ల;
> దరుకులాయములను దనరు పక్షికులంబు
> సేయు రుతులు కర్ణపేయ మయ్యె.

> పలువగ రంగులం గనులపండువు సేయు గులాబి పూలతో
> జెలువుగ నిండె బూబొదలు; చెట్లుఫలంబుల మ్రొగ్గె; గాలికిం
> జలితములైన కొమ్మ చివనందుల వెన్నెలదూరి చెట్లచా
> యలొనరె రత్నకంబళము సన్నిదెనల్ పరపించినట్లుగన్.

ప్రొద్దుపొడుపున ఇంటికి తిరిగి పోవలయునను కోరిక అప్పటనే కూర్చుండ వలయునన్న తలంపు నధఃకరింప, నా మిత్రుడు పన్నీరు పూవులను సంబులములను ఇతర సుమములను కొంగునిండ నింపుకొని తిరిగిపోవ నుద్దేశించినప్పుడు అతనితో నిట్లంటిని: "తోటలోని గులాబీలు ఎంత కాలముండునో నీ వెరుగుదవు. పూలతోట చూచుటకూడ నమ్ముటకు వీలులేనిది. నశ్వరమైన దానిపై మనసు పెట్టుట యుచితము గాదని పండితులు చెప్పుదురు." "అట్లయిన గత్యంతరమేమి?" యని యాయన అడిగెను.

నే నిట్లంటిని: "చూచువారికిని దగ్గరనున్న వారికిని సంతోషము కలిగించు 'గులాబితోట' యను గ్రంథమును నేను రచింపగలను. ఆ గులాబితోట యాకులు శరన్మారుత నిరంకుశత్వమునకు పాల్పడవు. కాల చక్ర పరిభ్రమణము ఆ యుద్యానవన వసంత శోభను శరత్కోపమునకు గురిచేసి మార్పలేదు."

పెరిమంచవట్టనునించియుంచిన గులాబీ పూవులైదారు వా
నరముల్ చెల్లిన వాడు; నట్టిసుమముల్ సంపాద్యముల్ గావు; నే
విరచింతుఁ రమణీయమైతగు గులాబీతోట; నందొక్క సుం
దర పత్రమ్మును గొమ్ము; తద్వనరుచుల్ దర్శించు నిత్యమ్ములై.

నే నిట్లు వచింపగ నే తన కొంగులోని పన్నిరు పూవులను క్రింద విమ్మరించి, నా చొక్కాయి కొంగు పట్టుకొని "కరుణావ్యాదయులు చేసిన ప్రతిజ్ఞను చెల్లింతుర"ని ఆయన పల్కెను.

కొన్ని దినములు గడచిన పిదప, శక్తులకు పనికివచ్చునట్లుగను, పత్రలేఖకుల వచోనైపుణ్యము హెచ్చుటకుం దగినట్లుగను రెండధ్యాయములను (7, 8) చిత్తు పుస్తకమున వ్రాసితిని. గులాబితోటలోని శోభ యింకను శేషించియుండగనే ఈ "గులాబితోట" యను గ్రంథము సమాప్తమైనది.

అయినను లోకాశ్రితుడు, దైవచ్ఛాయ, కరుణాకిరణుడు, జన పోషకుడు, వదాన్యుడు, మతాశ్రయుడునగు పాదుషా ఆస్థానమున మెప్పు వడసినప్పుడే యీ గ్రంథము నిజముగ సమాప్తమైన దనవచ్చును. (పాదుషా యింకను ఎట్టివాడనగా) దైవ బలయుతుడు, వైరుల నిర్జించు వాడు, సంపల్లక్ష్మికి బాహువు, మత ప్రదీపము, ఉత్తమోత్తముడు, ఇస్లాము మతకీర్తిమూర్తి, అతాబేక్ పుత్రుడు సాదు, రాజాధిరాజు, జన సమూహము కంఠములపై నధికారముగల పాలకుడు, అరబ్బీ పారసీ సుల్తానుల కధినేత, సముద్రములను ఎడారులను పరిపాలించు ప్రభువు, సులేమాన్ రాజ్యమునకు వారసు, ముజఫరుద్దీన్ అబూబకర్ బిన్ సాద్ బిన్ జంగీ.

దేవుడు, తండ్రి బిడ్డల భాగ్యమును నిరంతరము పోషించుగాక! వారి యిరువురి గొప్పతనమును అభివృద్ధిపరచుగాక! వారి సత్కార్యములను సఫలీకృతము చేయుగాక!

భూధవానుగ్రహ కృపాభిభూషితంబు
నైనచో నాదు కృతిరాజ మన్నికడల
జెలువు వెదజల్లు నార్జంగి చిత్రమటుల,
చీని చిత్రాలయమువోలె; దీని జవివి
వినుగువేనట గొనరని విన్నవింతు.
విరిసిన గులాబితోట హృద్వేదనలకు
కారణము గాదు; అందు మంగళము గూర్చు
పీఠిక అబూబకర్ సాహిబీ సుజంగి
పేరనంకితమైయుంట ప్రియతరంబు.

ఆమీర్ ఫకరుద్దీన్ అబూబకర్ బిన్ అబూనసర్ ప్రశంస

మరియొకమాట నా భావమను నూత్నవధువు సౌందర్య విహీన యని రోయింగి సిగ్గుపడి తలవొంపక నిరాశాస్పదకములైన కన్నులతో అధోముఖియై సుందరయువకుఁడున్న సభకు శోభాగతియై ప్రవేశింప నేరము మన్నది. ఏలయన, లోకాధిపతి, న్యాయవంతుడు, విజయశాలి, జనపోషకుడు రాజ్యాధారుడు, రాజ్యవ్యవహార మంత్రిజ్ఞుడు, దీన శరణ్యుడు, విదేశజనాశ్రయుడు, పండితులకు పట్టుగొమ్మ, పుణ్యాత్ములకు మిత్రుడు. పారసీక జాతీయకీర్తిమూర్తి, రాజ్యమునకు దక్షిణబాహువు, ఆస్థానికులకు అధినేత, మతిరాజ్య పాలకుడు, ఇస్లామునకును ముసల్మానులకును ప్రాపు, రాజ్యమునకును రాజులకును విశ్వాసపాత్రుడు అబూబకర్ బిన్ అబూనసర్ అంగీకార భూషణముతో నలంకరింపబడనిచో ఈ వధువు పెంపుహీనము. దేవుడాయన జీవితమును పోషింగించుగాక! ఆయన పౌరుషము నున్నతి నొందించుగాక! హృదయమును రంజింప జేయుగాక! ఆయన సత్కార్య ఫలితములు అభివృద్ధి చెందించుగాక! ఏలయన ఆయన అన్ని దేశముల గొప్పవారిలో ప్రఖ్యాతుడు; సకల సద్గుణములకు నిలయస్థానము.

ఆయన యనుగ్రహచ్ఛాయ యందు మనెడు
వారి దోషంబులు విధేయ వర్తనలుగ

మారు; పూర్వవిరోధులు చేతబారి
ప్రాణమిత్రుల పోలిక బాసిచనరు.

సేవకాను యాయుల యాదరయందు ఒక్కొకనికిని ఒక్కొక కొలువు నియతమైయున్నది. దానిని నిర్వహించుటయందు అలక్ష్యముతో కొంచెమైనను చింతురేని వారు నిశ్చయముగ శిక్షకు పాత్రులగుదురు: అయినను గొప్పవారికి కృతజ్ఞతను తెలిపికొనుచు, వారి సద్గుణముల నభివర్ణించుచు, వారికి శుభము చేయుటకు దేవుని ప్రార్థించు మాబోటి దరిచేని మండలికి ఈ శిక్ష వర్తింపదు. ఎటువంటి కొలువు నిర్వర్తించుటకు సమీపమున సంతోషకంబై దూరస్థులుగ నుండుటయే మేలు. ఏలయన. దగ్గర కీర్తించుట ముఖస్తుతియగును. దూరముననున్న, ఈ నిందపాడము అంగీకృతమగును.

కాలమాతకు నీవంటి ఘనుడు సుతుడు
పుట్టినన్న సంతోషము పట్టలేక
నింగి వంకరవీపు చక్కంగనయ్యె;
ప్రీతి సామాన్యప్రజలకు నీతినేర్ప
సృష్టికర్తయు నొకదాను నేరికొంట
సదమల వివేకమునకు దృష్టాంతమగును;
పేరుజీవించు నతడొందు విపులకీర్తి;
అతడు మరణింప గుణవర్ణనాత్మకంబు
పేరు జీవించు; పండితుల్ చేరి నిన్ను
బొగడినను బొగడకయున్న నగుటుకొకటె!
సొగసుకత్తెమొగంబు సోయగము దిద్ద
చేటి పసితమేల పంచేటుగాక!

సేవనంగీకరింపక వైరాగ్యము పూనుటకు కారణము

ప్రధాన మంత్రిని స్వయముగా సేవించుటకు, కొలువుకూటమునకు నేను రాకపోకలు సేయని లోపమునకు ఈ క్రిందికథ యుదాహరణప్రాయమగును.

హిందూస్థానమున పండిత సంఘము బుజార్ జాంహార్ గుణగణ
అను గురించి తర్కించుచుండిరి. కట్టకడపట ఒక్క దోషము తప్ప
యేమియు వారికి తోపలేదు. అది యేదః: ఆయన చాల యాలస్య
గ మాటాడును. ఆయన చెప్పునదంతయు వినవలయునన్న శ్రోతలు
అ కాలము వేచియుండ వలయును.

ఈ దోష నిర్ణయమును బుజార్ జాంహారు విని యిట్లనియెను:
'ట చెప్పిన వెనుక ఏల చెప్పితినని వేదన పడుటకంటె, చెప్పకమునుపు
ు చెప్పుదునని యాలోచించుట మేలు.

అనుభవజ్ఞుడు మాటలందు దిట్టందు
ముందు ముందు దలపోసి వెనుక మాటాడు;
యోచింపక వచించి యూర్పు వెచ్చింప
పలడు; చక్కగబల్కు వా డాలపించి
మాటాడనేమి ప్రమాదంబుగల్గు?
పల మాఱు దలపోసి పచియింప మేలు;
కజాల నని చెప్పుటకు మున్నె నిలుపు;
మృగసంతతులకంటె శ్రేష్ఠుండు నరుడు
మాటలు నేర్చుట; మాటిగా నుచిత
భంగి వివేకించి పలుకలేని
మృగములు పికంటె మేలన వచ్చు.

వృద్ధాగ్రగణ్యులకు నాకరమును, ఉత్తమ పండితులకు కేంద్రస్థానము
న రాజాస్థానిక సభయెదుట నేనెట్లు భాషింపగలను? ఎటులో
సాహసించి మాటాడుదునేని నా నిగ్గిడితనమును వెల్లడించిన వాడనయి
ల్లు సగళలను మహామంత్రి యొగట పెట్టియుందును. గాజాపూస రత్న
వ్యాపారుల యంగడియందు ఒక యనగింజకైన కొరగాదు. దీపము
సూర్యని యెదుట ఒక కిరణమునైన వెలిజిమ్మదు. సౌధాగ్రగోళము
యందు పర్వతము ప్రక్కన చిన్నదిగ నగపడును.

గర్వించి మెత్తనిక్కు గల్గినవాడు
తన యధఃపతనంబు దానె యార్జించు;
సాధి నమ్రుడు, ముక్తసంచార పరుడు;
పతితునిపై నొరుల్ పగబూనబోరు;
మొదట నాలోచన, పిదప వాక్యంబు;
మును మూలబంధంబు వెనుక కుడ్యంబు;
ఏను కృత్రిమ సుమాకృతుల నిర్మింతు;
నైన, బూదోటలోనవి కొరవడునె?
నేను సుందరమూర్తినైన ప్రేమనుమత,
నైక, "కనాను"లో నది యేమిలెక్క?

"ఇంతటి ప్రాజ్ఞత యెవనియొద్ద నేర్చుకొంటి" వని లక్మానును కొందరు ప్రశ్నించిరి.

"గ్రుడ్డివానియొద్ద. ఎట్లన వాడు నేల తడవుకొని చూడనిదే కాలు పెట్టడు" అని ఆయన చెప్పెను.

"ఎదురొక్కనుటకు పూర్వము తిరోగమన మార్గము సదిలపరచుకొను" మని అరబ్బులు చెప్పుదురు.

మగతనంబున్నదని రుజువుచేసి పెండ్లిగావలెను.

బవరమున గోడిపుంజు దుర్వారమైయ్యు
గంటుగోళుల వేగతో గలయబడునె?
ఎలుకపైదూక సింహమౌ నింటిపిల్లి,
యదియె పులిమ్రోల నెలుకయై యదరిపారు.

అయినను గొప్పవారు దీనుల దోషములపై కన్నువేయరు. తక్కువవారి లోపములను తూర్పారబట్టరు. అట్టి యుదార హృదయుల సుస్వభావముపైగల నమ్మకముచేత, సంక్షేపముగ అపూర్వములైన సాదృశ్యములు, కవితలు, కథలు, పూర్వపరపాఠకుల స్వభావపరిశీలనము మున్న

గునవి యీ గ్రంథమున సమకూర్చితిని. దీనికై నా యమూల్య జీవితమున చాల భాగము వెచ్చించితిని. "గులాబితోట"ను రచించుటకు ఇవియే కారణములు.

ఈ కవితయు నీ క్రమమును,
నాకాయము చివికి యణుగుణంబులు ధూళిన్
ఏకంబై చను పిదప న
నేకములౌ నేండ్లు పూండ్లు నిటువలెనిల్చున్.

సరసహౌ నీ రచన నాకు స్మరణ చిహ్న
మైన చిత్రంబు; స్థిరముగాచపని బ్రతుకు,
అనఘు లీపీస జనుల కృతార్థతలకు
దేవుని ప్రణతి సల్పి ప్రార్థింపకున్న.

గ్రంథ రచనాపద్ధతి, అధ్యాయాలంకరణ విన్యాసక్రమము, సంగ్రహ వచోబంధము చక్కగ నాలోచించి, శోభావంతమైన యీ గులాబితోట అష్టద్వారయుతమైన స్వర్గమును బోలునట్లు అష్టాధ్యాయిగా కొనర్చితిని. పఠితలకు విసుగు వేసటలు కలుగకుండునట్లు గ్రంథమును సంక్షేపించితిని.

ప్రచురణ సంవత్సరము : క్రీ. వె. 1258.

మాకు సంతోషకరమైన మాసముదియు;
అరువందల యేబదియారు హిజ్రీ;
హితమె యుద్దేశ; మటు రచయించినాడ;
అపల వెపలితి దేవుని కప్పగించి.



# ఆంధ్రీకర్త విన్నపము

తెలిసి తెలియకయో యెటో తెలిసినట్లు
పాడి ప్రియకావ్యమును తెల్గునలిపినాడ,
పారసీభాషలోని భావప్రశస్తి
తెలుగు చదువరులెల్లను దెలసికొనగ

ఆకవీశ్వరు ప్రతిభ శతాంశమైన
తెలుపగలనేని నా శ్రమ ఫలితమగును;
తెలుగువారికి వేమన్న తెలిసినట్లు
స్మృతిని పాడీయు నికమీద మెలగుగాత!

తప్పులెల్లనావి, యొప్పులకుప్పలు
షేకుసాది దివ్య సృష్టిలోవి;
అతని కీర్తివెలుగు నాశ్రయించితి, మట్టి
గోడ పసిడిపూత గోరినట్లు!

తెనుగువారికి సహజమౌ తియ్యదనము,
తప్పుమన్నించి మెచ్చు నుదారగుణము,
పొల్లులో గట్టినేరు నపూర్వబుద్ధి
యుద్ధరించుత యీకృతి నుచితరీతి.

---

# గులాబితోట

## ప్రథమాధ్యాయము

## పాదుషాల ప్రవర్తనము

ఒకానొక పాదుషా యొక్క ఖైదీని వధించుటకు ఆజ్ఞా పించెనని వింటిని. దిక్కులేని యీ హతభాగ్యుడు నిరాశా స్థితియందు తన సొంతభాషలో తెలివితక్కువగ మాటాడి, పాదుషాను దూషింపసాగెను. ప్రాణములపై ఆసవదలిన వాడు మనసునకు వచ్చినట్లెల్ల మాటాడును.

తప్పించుకొనరాని తరుణంబునందు
గత్తివాదరబట్ట గమకించుజేయి.

వాడేమి పలుకుచున్నాడని పాదుషా యడిగెను. అచ్చటనుండిన వజీరులలో సుస్వభావుడొకడు, మహాప్రభూ, క్రోధము నడంచుకొని దీనుల మన్నించువారిని సర్వేశ్వరుడు సఖ్యముతో కనికరించునని వాడు మనవి చేయుచున్నాడు అని విన్నవించెను. ఈ పలుకులకు పాదుషాకు కరుణగలిగి వాని మరణదండనము ఉపసంహారించెను.

అంతట ఆ వజీరునకు ప్రతిస్పర్థియైన వేరొక వజీరు లేచి మహాప్రభూ, మాబోంట్లు పాదుషాయెదుట సత్యము దప్ప ఇతరము చెప్పరాదు. వాడు యేలినవారిని నీచముగ

నిందించెనని చెప్పెను. ఆ మాటలకు పాదుషా కోపముతో పెడమొగము పెట్టుకొని, ఓయీ, ఆతడు చెప్పిన యబద్ధము నీవు చెప్పిన సత్యముకంటె నాకు ప్రియమైనది. ఏలయన, ఆతని యబద్ధము సదుద్దేశ ప్రేరితము. నీ సత్యము అసూయా మూలకము. హితకరమైన యసత్యము, ఉపద్రవకరమైన సత్యమునకన్న మేలని పెద్దలు చెప్పిరి.

తానుజెప్పినట్లు తప్పకవర్తించు
నృపుని కెవ్వడైన నెన్నడేని,
మంచిమాటదప్ప మరియేమి చెప్పిన
నకట! కీడుదెచ్చు; నఘమువచ్చు.

ఫరీదూను చక్రవర్తి సౌధతోరణమునందు ఈ సూక్తి వ్రాయబడి యున్నది :

స్థిరముగా దెవ్వరికినైన ధరణితలము,
మనసు దేవునిపై నిల్పికొనుము; చాలు;
నిన్నుబోలెట్లెందరనొ పెంచి మన్నుసేయు
నవనిని తలాడగానమ్మి యూనుకొనకు.

ఎప్పుడో యొక్కనాడంతు చెప్పకుండ
విమలజీవము దేహముల్ విడును గాన,
రాచగద్దియ మరణంబు ప్రాప్తమైన,
దుమ్ములోబడి చచ్చిన దుదకునొకటె!

## 2

సబుక్తగీన్ కుమారుడైన సుల్తాను మహమ్మదు కళే బరమంతయు మన్నదిని దుమ్మయిపోయినను, కన్నులు

మాత్రము కంటిలో త్తలలో అటునిటు కదలుచు చూచుచు న్నటుల, ఒక ఖురాసాను రాష్ట్రాధిపతి కలగనెను. ఆ కల లోని భావమును వివరించుటకు పండితుల కందరకు అసాధ్య మయ్యెను. అంతట నొక దరిబేసి వినయపూర్వకముగ నమస్కరించి, అయ్యా, ఆయన రాజ్యము పరహస్తగత మైనదని యిప్పటికిని చూచుచున్నాడని స్వప్న భావమును వెల్లడించెను.

పూర్వమెందర ప్రఖ్యాతపూరుషులను
ఇలను బూడ్చిరి, యునికి గుర్తేది నేడు?
భువిని బెట్టిన ముదిపీను చివికి మట్టి
దినుట, నస్థికలైనను గనుల బడక

చెల్లి బహుకాలమయ్యె నౌషిరవాను
ఇంకనుం బేరు బ్రతుకు న్యాయేశుడౌట;
కాయముండంగ లోకోపకారివగుచు
జీవితామూల్యలాభంబు జెందుమోయి.

## 3

ఒకానొక రాజకుమారుడు పొట్టివాడుగను కంటికి తాళని సామాన్యుడుగ నుండెనని వింటిని. అతని తోడబుట్టువులు ఒడ్డుపొడుగు గలవారుగను రూపవంతులుగనుండిరి.

ఒకప్పుడు తండ్రి ఆ అల్పకాయుని తిరస్కార దృష్టితో చూచి విసుగుకొనెను. కుమారుడు కుశాగ్ర బుద్ధితో విచారించి యిట్లనియెను : నాయనా, బుద్ధిమంతు

డైన పొట్టివాడు బుద్ధిహీనుడైన పొడుగువానికన్న మేలుగద!

ఆకారపుష్టిగల ప్రతిదానికి మూల్యము హెచ్చుచుండునా?

(మేక ఆకారమున చిన్నదయ్యు దాని మాంసము తినుటకు యోగ్యమైయున్నది. ఏనుగ పెద్దదయ్యును దాని మాంసము నిషిద్ధము. తూర్ పర్వతము కొండలన్నిటిలో చిన్నదయ్యును భగవంతుని దృష్టియందు పెద్దదిగను గౌరవయుక్తమైనదిగ నున్నది.)

బక్కచిక్కియు నుత్తమాశ్వంబు మేలు
గాదె, దొడ్డెడుఖరములకంటె ననుమ
తెలివిగల బక్కవాడొక తెలివిలేని
స్థూలకాయునితో నన్న సూక్తివినవె?

ఈ మాటలకు తండ్రి నవ్వెను; అమాత్యులు మెచ్చుకొనిరి; సహోదరులు రోషావమాన పీడితులైరి.

ఎవ్వడైన మాటాడ నోరెత్తువాక
తెలివియును లోపమును దాగి తెలియరావు;
ప్రతివనంబును శూన్యగర్భంబటంచు
నూహసేయకు, పులి కూర్కుచుండవచ్చు.

ఆ కాలమున రాజునకు ప్రబల విరోధిగ నుండిన పరిసర రాష్ట్రాధిపతి యొకడు తలచూపెనని వింటిని. ఇరు

వాగుల సైనికులు ముఖాముఖి నిలబడి పోరుటకు నుద్యుక్తులైనప్పుడు మొట్టమొదట అల్పకాయుడైన ఆ రాజకుమారుడే రణరంగమున ప్రవేశించి యిట్లు వచించెను :

సంగరంబున బోరాడు సమయమందు
దుమ్ము నెత్తుటిబురదలు గ్రమ్ముకొనిన
నాశిరము జూతురేగాని, నాపిరుంద
కంఠగత జీవినైనను గాంచరరులు.

వైరిసేనల డీకొని పోరునతడు
అక్కరక్తంబుతో జూదమాడుచుండు;
వెరచి వెన్నిచ్చి పరుగిడు పిరికిపంద
భటుల రుధిర ప్రవాహంబు బందెమిడును.

ఇట్లు నుడువుచు ఆ రాజకుమారుడు విరోధి సైనికుల పైకురికి కొందర మొగదారులను వధించెను. తరువాత తండ్రియొద్దకు వచ్చి గౌరవ పురస్సరముగ నేలముద్దిడి యాతడిట్లనియె :

నాశరీరాల్పత దలంచినావె గాని
గట్టితనపు నైపుణ్యము గాంచవకట!
బడుగు గుఱ్ఱంబు రణభూమి బనికి వచ్చు,
గండపట్టియు నెద్దు లక్కఱకురావు.

అంతకంతకు విరోధిసైన్యము హెచ్చుచుండెను. వీరి సైనికుల సంఖ్య తగ్గుచుండెనని వింటిని. తమ సిపాయీలలో కొందరు వెరచి వెన్నిచ్చి పరుగెత్త నుద్దేశించుచున్న సంగతి నెరింగి రాజకుమారుడు ఎలుగెత్తి ప్రోత్సాహకరముగ

కేక వేసి, ఓ వీరులారా! ఆడువారి రవికెలు మీరు తొడుగుకొనక యుండు రేని యుద్ధప్రయత్నము గావింపుడు అని మందలించెను ఈ పలుకులు విన్నంతనే గుర్రపు రౌతులకు వీరావేశము పిచ్చలించి మరియొకమారు విరోధి సైన్యములపై తలపడిరి. ఆ నాడు రాజకుమారుని పక్షముననే జయము చేకూరెను. అంతట తండ్రి కుమారుని కౌగిలించుకొని మొగమును కన్నులను ముద్దిడికొనియెను. నానాటికి తండ్రికా పుత్రునిపై ప్రీతి హెచ్చుచుండెను. కడకు ఆతని నే యువరాజుగా నొనర్చెనని వింటిని.

సహోదరులు అసూయాగ్రస్తులయి ఆతని చంపుటకు అన్నమునందు విషము పెట్టిరి. ఈ విషయము సహోదరి మేడమీది గదినుండి చూచి, హెచ్చరించుటకుగా కిటికీ తలుపును కదలించి చప్పుడు చేసెను. రాజకుమారుడు సూక్ష్మబుద్ధి కావున ఆ హెచ్చరికలోని భావమును గ్రహించి అన్నములోనున్న చేతిని వెనుకకుతీసి, సమర్థులు మరణించుటయు, బుద్ధిహీనులు వారి స్థానము నాక్రమించుకొనుటయు కష్టసాధ్యమని యనుకొనెను.

అవని హుమాపక్షి యంతరించినను
గూబరెక్కలనీడ గోరరెవ్వరును.

ఈ దుష్కార్యము తండ్రికి తెలియవచ్చి కొడుకులను రావించి తగువైన చీవాట్లు పెట్టి పంపెను. తరువాత అన్నదమ్ములలో అన్యోన్య కలహములు కలుగకుండునటుల

సీమాంత రాష్ట్రములను తృప్తికరముగ నొకరొకరికి తంత్రి పంచిపెట్టెను.

ఒక గొంగడి పదిమంది దరిబేసులు నిద్రపోవుటకు చాలును గాని, ఒక రాజ్యము ఇద్దరు పాదుషాలను భరింప లేదని పెద్దలు చెప్పుదురు.

నగమురొట్టెను భక్షించి మిగత నగము
దైవ భక్తుండు పేదకు దానమిచ్చు;
ఒక్క దేశంబు గెలువ నింకొక్కదిక్కు
గడనసేయ సుల్తానుకు గలుగుగోర్కె.

# 4

అరబ్బీ దేశపు దారిదోపిడిగాండ్ర తండము ఒక పర్వత శిఖరమున నివసించుచు సార్థవాహముల మార్గము నరకట్టుచుండిరి. చుట్టుపట్టుల గ్రామస్థులు వారి మోసములకు చాల కష్టపడుచుండిరి.

దుర్గమ పర్వత ప్రదేశమునందలి యొక యభేద్య దుర్గమును వశపరచుకొని వారు దానిని తమ నివాసస్థానముగ నొనర్చుకొనియుండుటచేత, సుల్తాను, రక్షకభటులు సైతము వారి దెబ్బకు నెట్టుకొనలేకుండిరి. ఈ దారిదొంగలను ఇట్లే అప్రతిహతముగ వదలిపెట్టిన ఇకమీద వారిని ప్రతిఘటించుట యసాధ్యమని తలంచి చుట్టుపట్టు జిల్లాల యధికారులు వారివలన గలుగు బాధలు నివారించుటకయి ఆలోచించిరి.

క్రొత్తగా వేరునాటిన కుజమునొకటె
పెల్లగించును; కాలంబు చెల్లెనేని
గిలక యంత్రంబు నంధించి వెలువరింప
నలవిగాకుండు వేళ్లిల నంటిదిగుట.

ఊటనీటికాలువ తలనొక్క మేకు
గొట్టి యొకవేళ నీరాపి పెట్టవచ్చు;
అదియె పెంపొంది వెల్లువయ్యెనేని
గజమునెక్కియు దరియింప గష్టతరము.

దొంగల చర్యలను కనిపెట్టుటకు ఒక చారుని నియమింప నిశ్చయించి అధికారులు అనుకూల సమయముకొరకు నిరీక్షించుచుండిరి.

ఒకనాడు దొంగలగుంపు ఇంకొక సంఘముపై దాడి వెడలి యుండుటవలన వారి బిడారము అరక్షితముగ నుండెను. అనుభవజ్ఞులును యుద్ధమునందారితేరిన ధైర్యవంతులునగు కొందర భటులను పంపిరి. వారు కొండలోయలలో దాగియుండిరి. చీకటి పడిన వెనుక దొంగలు దోపిడి యాత్రనుండి మరలివచ్చి కొల్లముదుపుల నొకచోట నుంచి ఆయుధములను తీసి పెట్టిరి.

రవిబింబ మంధకారంబున గ్రుంకె;
చేపనోటను బ్రవేశించె యూనన్న.

అంతట విరోధియైన నిద్దుర మొట్టమొదట వారిపై నధికారము కొనసాగించెను. రాత్రి యొకజాము గడచెను.

తరువాత ధైర్యశాలురైన యుద్ధభటులు మాటు నుండి వెడలివచ్చి దొంగల నొక్కొక్కరిని పెడరెక్కలు విరిచి కట్టి సూర్యోదయమైన వెంటనే సుల్తాను దివాణము ముందు నిలువబెట్టిరి. సుల్తాను వారినందరను వధింప నాజ్ఞాపించెను. తలవని తలంపుగ వారియందు క్రొత్తగా పొటమరించిన యెలజవ్వనపు ఫలముగలవాడును, కపోల గులాబీ వనమందు నవీనముగ నంకురించిన యాకుపచ్చలు గలవాడు నగు నొక యువకుడుండెను. వానిఁజూచి యొక వజీరు సుల్తాను సింహాసన పాదప్రదేశమున గౌరవ పురస్సరముగ ముద్దిడి ప్రార్థనాపూర్వకముగ శిరము భూమిపయి మోపి, మహాప్రభూ, యీ యువకుడు తక్కిన సహచరులవలె జీవితారామములోని ఫలములను రుచిచూచి యెరుగడు. యౌవన భోగము లనుభవింప యుండడు కావున వీనిని మన్నించి, యురిశిక్ష నపసంహరించి. యీ మీ దాసుని మనోభీష్టమును ఆదరింతురని యేలినవారి సహజౌదార్యముపై నాకు ఆశగలదు అని మనవిచేసెను.

ఈ మాటలు పాదుషా యున్నతాశయమునకు ప్రతికూలముగ నుండుటవలన పెడమొగము పెట్టుకొని యిట్లనియెను :

భవ్యహృదయుల నద్బోధ పట్టుపడదు
అధమ నైజము గలయట్టి యల్పమతికి;
చెనటి మూకను గావించు శిక్షణంబు
గర్పగుడిపైన యకరోటు కాయనూవె.

వీరి వంశమును కుటుంబమును నాశనము చేయుటయె మేలైనపని. ఏలయన, మంటను చల్లార్చి వేఁడికొఱక ప్పును వదలి పెట్టుటయు, విషసర్పమును చంపి దానిపిల్లలను పోషించుటయు బుద్ధిమంతుల కార్యముగాదు.

అంబుదంబులు గురిసియు నమృతసృష్టి
ఫలము గనలేవు 'బేదు' కొమ్మలను నీవు;
దుఃస్వభావుని శిక్షింప దొడరకెపుడు,
చక్కెరను నీయ వశమౌనె చాపతుంగ.

వజీరు ఈ పలుకుల నాలకించి, యిష్టము వచ్చిరాని యటు మెచ్చుకొని, అభిప్రాయ సౌష్ఠవమును గొనియాడి యిట్లని విన్నవించెను : మహాప్రభూ, మీ యేలుబడి శాశ్వతముగ నుండుగాక ! దేవరవారు సెలవిచ్చిన దంతయు సత్యము, ప్రత్యుత్తర రహితమైన ప్రశ్నము. దుర్మార్గుల సంఘమునందు శిక్షణను పొందినయెడల వాని స్వభావమే పట్టువడి వీడును అట్టివాడేయగును. కాని, సజ్జనుల సహవాస గోష్ఠియందు శిక్షింపబడునేని ఆ బుద్ధిమంతుల స్వభావమె యలవడును. పాపము ! వీ డిప్పుడు చాల లేబ్రాయము వాడు. స్వసంఘము యొక్క దుర్వర్తనములు, పెడదారులు వీని చిత్తమునందింకను హత్తుకొనవు. 'హదీసు'న నిట్లు చెప్పబడియున్నది :

"నిజముగా ప్రతి బిడ్డయును 'ఇస్లాము' నకు తగిన ప్రకృతితో పుట్టును. తర్వాత తల్లిదండ్రులవలన, యూదుడుగనో క్రైస్తవుడుగనో అగ్నేయ మతస్థుడుగనో యగుచున్నాడు."

దుర్జనులతోడ నేహు కూతురు వసింప
జ్ఞానదృష్టి నశించె సంతానమునకు;
సప్తనిద్రాళు శునకంబు సజ్జనాను
సరణమున మానవత్వము సంగ్రహించె.

ఇట్లు పలికి నంతట, ఆ స్థానము నందలి యితర రాజ మిత్రులును ఆ యువకుని క్షమింప ప్రార్థించిరి. ప్రభువు వానిని మన్నించి "ఉచితము కాదని తెలిసియు మన్నించితి" నని యిట్లు పలికెను : జాలు రుస్తుమునకు చెప్పిన సూక్తి తెలియునా ?

అల్పుడును నిరాధారు డటంచు నీవు
పగతు నెప్పుడు దలపోయ బాడిగాదు;
ఊట మొగదల జిన్నదై యుండి యుబ్బి
బరువు నొంటెను గొంపోవ నరసి యుంటి.

అంతట వజీరు ఆ యువకుని ఇంటికి కొనిపోయి ప్రేమాదరణములతో పెంచుచు శాస్త్ర పారంగతుడైన యొక పండితుని వానికి విద్య గరపుటకు నియోగించెను. సంభాషణమునందలి యొరపును, తర్కమును, రాజాస్థాన వర్తులకు తెలియవలసిన మట్టు మర్యాదలను నేర్చుకొని కళల యందారితేరి ఆ యువకుడు అందర ప్రశంసలకు పాత్రు డయ్యెను. ఒకనాడు వజీరు ఆ యువకుని సద్గుణములను కొలదిగ సుల్తాను మ్రోల ప్రశంసించుచు, పండితుని శిక్షణము వాని చిత్తమున చక్కగ నతికినది. మున్నటి యజ్ఞానము వాని స్వభావమునుండి నిర్మూలమైనది అని విన్నవించెను. ఈ మాటలకు సుల్తాను నవ్వి యిట్లనెను :

మనుజుని సాంగత్యమున బెంప బడియు
తుపకు దోషేలెయొ దోషేటికషాన.

రెండు సంవత్సరములు గడచినంతట పట్టణములోని యల్లరిమూక యాయువకుని యొద్ద చేరి స్నేహ సూత్రముల బంధించిరి. ఆతడును సమయమునకై వేచియుండి, వజీరును ఆతని యిద్దర బిడ్డలను హత్యగావించి విశేషధనమును కొల్లగొట్టి దొంగల నివాస స్థానమైన పర్వతగహ్వారమునకు వెడలి, తండ్రిస్థానమును ఆక్రమించి గడిదీరిన జనకంటకుడాయెను. ఈ వృత్తాంతము విని సుల్తాను దుఃఖముతో వ్రేలుకరచి యిట్లనియెను :

చెడ్డయినుముపెట్టి చేయ సాధ్యంబౌనె
యేరికైన వాడి యెనగువాలు?
శిక్షణమున దుష్టచిత్తుండు సజ్జనుం
డగునె పండితుండ, యరయుమోయి.

పక్షపాతరహిత భావంబుతో వర్ష
మన్నిచోట్ల గురియు, నైనగాని
తోటలందు మొలచు దొలికారు లావెలు,
చవుటి పరలనెదుగు జట్టుతుంగ.

నిప్రయత్న బీజంబులు నిరుపయుక్తి
జల్లకుము; చౌటబెరుగునె సంబులములు?
చెడ్డవారికి నుపకృతిసేయుటెల్ల
మంచివారి కపకృతి గావించినట్లు.

# 5

ఉగ్లమీాషు చక్రవర్తి సౌధద్వారముకడ సేనాక
సేనాధిపతి కుమారుని కాంచితిని. తెలివి తేటలయందును

కుశాగ్రబుద్ధియందును అతడు వర్ణనాతీతుడు. బాల్యము నుండియు గొప్పతనపు సూచనలు ఆతని లలాటమున మూర్తీభవించియుండెను.

తెలివితేటల కల్మిదీపించె నతని
తలమీదుగా గొప్పతనమను చుక్క.

ఆ యువకుడు శరీర సౌష్ఠవ సౌందర్యములను, బుద్ధి పాటవమును గలవాడని సుల్తానున కెరుకపడెను. ఐశ్వర్యము హృదయము నందున్నది, ఆస్తియందుకాదు. గొప్పతనము వివేకము నందున్నది, వయస్సునందు కాదని పండితులు చెప్పుదురు.

సరిసమానులగు సహవాసులకు ఆతని యున్నతిపై అసూయ వొడమి ద్రోహియన్న అపనింద నారోపించి చంపించుటకు వ్యర్థ ప్రయత్నములు సలిపిరి. స్నేహితుడు దయగలిగి యుండ విరోధి యేమి చేయగలడు?

నీయందు వారికి ద్వేషము కలుగుటకు కారణ మేమని రాజడిగెను.

దేవరవారి ప్రభుత్వశీతల చ్ఛాయాశ్రయము వలన అందరను సంతోషపెట్టగలిగితిని. నాయధఃపతనముచే సంతసించు అసూయాగ్రస్తులు మాత్రము మిగిలియున్నారు. దేవరవారి భోగభాగ్యములు శాశ్వతముగ వెంపొందుగాక! అని యాతడనెను.

ఒరుల మతులనొప్పింపక యుండుగాని
యాత్మపిహితార్తుడయిన యార్యాళు నేమి
సేయగల? చావుమోయి దుశ్శీల, నీకు
వేదనాముక్తి మృతికంటె వేరులేదు.

ధనవంతుల కింకెప్పుడు
ధనమును గౌరవము యశము తగ్గునటంచుం
బని చెడిన మందభాగ్యుడు
దినము నిరీక్షించుచుండు దీరని కోర్కెన్.

గబ్బిళముకన్ను, దినవేళగానకున్న
తప్పుసూర్యునిదాయేమి? తథ్యమరయ
నట్టి వేయికన్నులు గ్రుడ్డివగుటమేలు
అర్కబింబము నల్లని దగుటకంటె.

# 6

పారసీక నరపాలుడొకడు దౌర్జన్యముసల్పి రైతుల ద్రవ్యము హరించుచు వారిని పడరాని యిడుమల గుడుపు చుండెనని చెప్పుకొనిరి. ఆ కష్టములకు మోసములకు బ్రతుకుపై రోతపుట్టి బాధలు తప్పించుకొనుటకు ప్రజలు పరరాష్ట్రమునకు వలసపోయిరి.

రైతులసంఖ్య తగ్గుటవలన ప్రభుత్వాదాయము సన్నగిల్లెను. రాజకోశము నిర్ధనమాయెను. ఈ కీలెరిగి విరోధులు విజృంభించి యొత్తిడి కలిగించిరి.

రిక్తదశ బేడుపాటు గోరెదవ యేని
యున్న యప్పుడు దాతృత్వ మూనవలయు;

బానినయు నాదరింపని స్వామి విడుము;
పరుడు సైతము దాసుడౌ గరుణ చూప.

ఒక సమయమున, రాజసముఖమున "షానామా" యను పూర్వ నరపాలుర చరిత్రమునందలి జోహాక్ అను జనకంటకుని రాజ్య భ్రష్టతయు ఫరీదూన్ అను రాజశ్రేష్ఠుని రాజ్యకాలమును గురించిన పట్టులు చదువబడెను. చతురంగ బలములు లేని ఫరీదూనునకు ఎట్లు ప్రభుత్వము లభించినదో మీరు తెలిసికొన గలిగితిరా యని వజీరు రాజును ప్రశ్నించెను. నీ విప్పుడు వినినట్లుగనె ప్రజలు ప్రీతి విశ్వాసములతో అండా దండ నిలిచి సాయపడుటవలన ఆతనికి ప్రభుతము సిద్ధించినదని రాజునుడివెను. మహాప్రభూ, అట్లయిన, ప్రజలు అండా దండ నిలిచి సాయము చేయుటయె ప్రభుత్వ ప్రాప్తికి హేతువైయుండ మీరేల ప్రజలను కష్టపెట్టెదరు! మీకు ప్రభుత్వకాంక్ష లేదాయని వజీరు ప్రశ్నించెను.

భూపాలకుడు సేన బోషింప మేలు,
దాననే సర్దారి తనము వర్ధిల్లు.

రయితులు సిపాయీలు భటులు దగ్గర చేరుటకు సదుపాయమేమని రాజు వజీరునడిగెను. పాదుషాకు ఔదార్యముండిన రైతులు సిపాయీలు చుట్టు మూగుదురు. కారుణ్యముండిన మీ చల్లని పరిపాలనమున వారు సురక్షితముగ సర్వ సుఖములను ననుభవింతురు. కాని తమకు ఈ రెండు గుణములును లేవు.

ప్రజల బాలింప దగడు నిర్దయుడు ఱేడు;
వృకము మేకలమేప నెందేని తగునె?
జన విరుద్ధముగా నేలు మనుజవిభుడు
తన ప్రభుత్వపు మూల బంధంబు త్రవ్వు.

చెనకన్ శక్తిహీనులైన ప్రజ గాసింబెట్టు భూపాలకుం
గినుకం బాయుదు రాప్తులుం బరులపోల్కిం గష్టకాలంబునన్;
జనసంతుష్టిగ నేలుమీ రిపులమాత్సర్యంబు నిన్నేమి సే
యును? న్యాయప్రభు సేన రైతులను లోకోక్తిన్ వినన్ లేదొకో,

నిస్సహాయుల పైని నెఱయాను మోయి,
కాలదౌర్జన్యంబు గడవ రెవ్వరును.

# 7

సముద్ర యాత్రయందు సుల్తానుతోడ ఒక పారసీకపు బానిస యుండెను. వాడెప్పుడైనను సముద్రమును చూచి గాని సముద్రయాన కష్టములను అనుభవించిగాని యెరుగడు. ఓడ త్రుళ్లింతలకు వాడు భయపడి వెక్కి వెక్కి యేడ్చుచు గడగడ వడక సాగెను. దీనివలన సుల్తాను సంతోషమునకు భంగము కలిగెను. ఎంత యోదార్చినను వాడు వినకున్నందున ఏమిసేయుటకు తోపక వారూరకుండిరి.

ఓడ యందొక వైద్యు డుండెను. అతడు సుల్తానును సమీపించి, దేవర యాజ్ఞయైన యెడల ఏదోయొక విధముగ వానినోరు మూయించెదనని విన్నవించెను. అట్లయిన చాల యుపకారము చేసినట్లగునని సుల్తాను సెలవిచ్చెను. అంతట వైద్యుడు ఆ బానిసను సముద్రములో పడద్రోయించెను.

కొంతసేపు బుటకలు వేయనిచ్చి వెంట్రుకలు జవిరి పట్టుకొని వానిని ఓడ యొద్దకు లాగిరి. వాడు రెండు చేతులతో చుక్కాని పలకను పట్టుకొని ఓడపై కెక్కివచ్చి యొకమూల నెమ్మదిగ కూరుచుండెను. సుల్తానుకు ఇది యంతయు వింతగాదోచి, దీని రహస్యమేమియని యడిగెను. ఇంతకు పూర్వము వీడెన్నడును నీటిలో పడుట యందలి యపాయ మును ఓడయందలి నిరపాయమును కని యెరుగడు. వ్యాధి గ్రస్తుడు గాకపూర్వము శరీరారోగ్యము విలువ యెవ్వ డెరుగును ?

యపరొట్టె దినసీకు యభిలాషపుట్టదు
తృప్తుడా, యాకలిదీరు కతన;
నాకు ప్రేయసియైన నారీవతంసంబు
కుటిలాంగిగా నీకు గోచరించు;
దేవలోకమునందు దిరుగు నచ్చరలకు
నడిమిలోకముదోచు నరకమటుల;
నరకవాసులకును నాకమట్లానంద
సంధాయియౌ మధ్యజగము; మరియు

ప్రాణవల్లభ రొమ్మున బట్టి బిగ్గ
గౌగిలించెడు సంతుష్టకాముకునకు
జెలికొరకు ద్వారసీమ వీక్షించు విరహ
బాధితునకెంతొ భేదంబుపరగుచుండు.

# 8

వృద్ధుడగు నొకపారసీక ప్రభువు వ్యాధిపీడితు డాయెను. ఆతనికి జీవితముపై ఆస యంతరించెను. అట్టి

సమయమున అశ్వారోహకుడొకడు హజారము ప్రవేశించి "మహాప్రభూ, దేవరవారి ప్రాభవమువలన ఆదుర్గమును వశపరచుకొంటిమి; విరోధులను కట్టి తెచ్చితిమి. ఆ ప్రాంతముల రైతులును సిపాయీలును ఏలినవారి యాజ్ఞను శిరసావహించి"రని శుభవార్త దెల్పెను. అందుకు రాజు నిట్టూర్చి, యీ శుభవార్త నాకుగాదు; నావిరోధులైన రాజ్యపు వారసులకని చెప్పెను.

హృదయమున నున్న కోర్కె యీడేరకనెడు
తలపుతోజెల్లె ప్రియజీవితంబు; నేడు
అష్టమొనగూడె; నైన నాకేమిమేలు?
అయ్యో! క్రమ్మరునే గతమైనవయసు.

ప్రస్థానభేరిని వాయించె మృత్యువు
తలనుండి కనులార, సెలవుగొనుడు;
ఓచేయి, యరచేయి, యోముద్దు ముంజేయి,
యొండొరుల్ వీడుకోలొనగికొనుడు;
పగవారి కోరిక ఫలియించె, నే నింక
భోగభాగ్యము వీడి పోవువాడ;
ఎప్పుడో యొకనాడు తప్పకవత్తురు
మీరు నాతోబాటు మిత్రులార;

జ్ఞానహీనుండనై నేను గాలమెల్ల
వ్యర్థపుచ్చితి; నేజేయనట్టిదాని
నుండి మీరలుద్బోధంబునొంది, బ్రతుకు
జ్ఞాన సంపాదనమునందు గడపమేలు.

# 9

మీా తండ్రిగారి మంత్రులను చెరసాలయందుంచుటకు వారియం దేమి తప్పిదముగోచరించెనని కొందరు మిత్రులు హార్యాజు నడిగిరి. నాకు వారియందేమియు దోషముగ పడుట లేదు. కాని యీావిషయముమాత్రము నాకునిశ్చయముగ తెలియును. నన్ను గురించిన భీతి వారి హృదయములందు విశేషముగ నాటుకొనియున్నది.

నామాటపై వారికి సంపూర్ణవిశ్వాసము లేదు. నిజాపాయశంక వలన వారు నన్ను చంపు తలంపుతోనుందురని వెరచితిని. అంతట పండితుల సూక్తిని ఆచరణకు తెచ్చితిని. వారిట్లు చెప్పి యున్నారు:

> నినుగని భీతిజెందు నరునింగని భీతిలుమోయి, యట్టి వా
> రిని అని నూరుమంది నెదిరించి జయింపను శక్తియుండియుఙ;
> గొనకొని పాముపట్టుకొను గొల్లనిపాదము ప్రేటుశంక; డా
> గను తరిలేకయున్న, బులికన్నుల జీలుచు పిల్లిగోళులఙ

# 10

డిమిష్క నగరమునందలి గొప్ప మసీదునందు పైగంబర్ పహ్యా మహాత్ముని సమాధియెదుట నేను కొంత కాలము నిరంతరధ్యాన నిర్మగ్నుడనైయుంటిని. అధర్మ ప్రవర్తనముచే దుష్కీర్తిగాంచిన యొక అరబ్బిదేశపు రాజు అచ్చటకువచ్చి నమాజుచేసి వరప్రసాదముకోరెను.

ధనికులుంబేదలు దానులీయెడకు;
ధనికులౌ కొలదిని దనరు నక్కరయు.

అతడు నాతట్టు తిరిగిచూచి, దరిబేసుల సచ్చింతనము నకును నిష్కపట వ్యవహారములకును అనురూపమగునట్లు మీరు నాతోడ దేవుని ప్రార్థింపవలయును ఏలయన, బలవద్విరోధియొకడు నాపైకి దండెత్తివచ్చునను భయము నన్ను బాధించుచున్నదని చెప్పెను. అంతట నేనిట్లంటిని: బలహీనులైన రైతులను దయాదాక్షిణ్యములతో కాపాడుము. బలవంతులైన విరోధులవలన నీకు బాధయుండదు.

భుజబలంబును శౌర్యంబు పొనరుననుచు
బీదల యశక్తతముల విరువవగవు;
పతితులగు వారలకు దోడుపడని వాడు
పడిన జేయూత యిడరను భయములేదె?

చెడ్డవిత్తి మంచినిగోరు చెనటివాడు
పనికిమాలిన వెకలిభావములఁదేలు;
చెవియొసగి న్యాయదానంబు సేయు; మట్లు
గానియెడ "అంత్యదిన" మొందుగలదుగాదె!

మనుజు లన్యోన్య మవయవమాత్రు; లంద
రేకమూలమునుండి మోసెత్తినారు;
కాలవశమున నొక్కయంగకమునొవ్వ
చల్లగా దక్కినవి యూరడిల్లగలవె?

ఒరులయాపద కెవగతగని నిన్ను
మనుజుడవని పేరుకొన బాడిగాదు.

## 11

దైవానుగ్రహముగల దరిబేసి యొకడు బాగ్దాదు పట్టణమున గనిపించెను. ఆ వృత్తాంతము హజ్జాజు యూసఫు విని, ఆ మహాత్ముని పిలిపించి, నాశ్రేయోభివృద్ధి కొరకు దేవుని ప్రార్థింపుమని కోరెను. అంతట ఆ దరిబేసి, సర్వేశ్వరా, యీతని ప్రాణములను గొనిపొమ్మని ప్రార్థించెను. అయ్యో! దేవుడా! యిది యేమి ప్రార్థన యని రాజడిగెను. ఈప్రార్థనయె నీకును ముసల్మానులందరకును శుభావహమైనదని యతడు పల్కెను.

జీవసాధుల బీడించు పృథ్విపాల,
యెంతకాలము నీయాట లిట్లుసాగు?
ఉర్వియుండి నీకేమి ప్రయోజనంబు?
జనుల వేచుట కంటెను జావు మేలు.

## 12

న్యాయ దూరుడగు నొక ప్రభువు ఒక పుణ్యాత్ముని గాంచి, నాకు ఏవిధమైన దైవచింతనము మేలుగ నుండునని ప్రశ్నించెను.

నీకు మధ్యాహ్న వేళ నిద్ర మేలుగనుండును. ఆ యొక్క-క్షణము నందైనను ప్రజలను బాధపెట్టకయుందువని ఆపుణ్యాత్ముడు చెప్పెను.

అతదినము కూర్కు కతి వాత్కు నతసియంటి :
నీవు దౌర్జన్య మవు, నీకు నిద్రతగును ;
ఎవని జాగర్యకంటె మేలవును నిద్ర
యట్టి దుష్టుని జీవితం బరుట శుభము.

# 13

ఒకానొక ప్రభువు సంతోష భోగములచే రాత్రిని దినముగ పరిణమింప జేసెనని వినియుంటిని. పానమత్తుడైన ఆ సుల్తాను ఇట్లు నుడివెను:

ఇంతకంటెను సంతోష మిడెడు క్షణము
వేరొకటిలేదు మా కిల వెదకిచూడ;
మంచి చెడ్డల భావంబు మదిని జొరదు,
అఖిల విషయచింతాతీత మయ్యె మనము.

శీతకాలపుజలిలో వస్త్రహీనుడయి యచ్చట పండుకొని యుండిన యొకదరిద్రుడు యిట్లనియెను :

ఓ మహారాజ, నిజమె, నే నొప్పుకొందు;
పరులు సరిరాదు మీకు సంపదలయందు ;
లబ్ధకాములు మీకునేలాటి వంత
చేకురదుగాని మా బోంట్ల చింతలేదె ?

సుల్తాను ఈమాటలకు సంతసించి వేయిదీనారటంకములు గల సంచిని కిటికీగుండ బయటపెట్టి, దరిద్రుడా, కొంగుపట్టుమని యడిగెను. చొక్కాయియే లేనివానికి కొంగెచ్చటనుండి వచ్చునని యాతడు బదులు చెప్పెను.

శోచనీయమైన యాతనిస్థితికి ప్రభువు మిక్కిలి జాలినొంది గౌరవసూచకమైన యుడుపును కూడ చేర్చి దరిబేసికి పంపెను. అతడు కొద్దికాలములోనే ఆరోగ్యమును ఉడుపును కరగ ద్రావి కష్టములకు లోనయి మరలవచ్చెను.

జల్లెడ నీరంబు, క్షమకామి మతిని
రాగముక్తునిచేత ద్రవ్యంబు నిలదు.

ఆతని తలంపే లేక సుల్తాను చిత్తము అన్యాయత్తమై యున్నపుడు వానిరాక నెరిగించిరి. అందుకు ప్రభువు కోప గించుకొని మొగము త్రిప్పుకొనియెను. కావుననే పాదుషాల క్రోధమును కరతాదనమును గమనించి తేసువతో మెలగవల యునని అనుభవజ్ఞులయిన బుద్ధిమంతులు చెప్పియుండిరి. ఏలయన వారిమనస్సు ముఖ్యమైన రాజ్యకార్యాలోచలన యందు మగ్నమైయున్నపుడు సామాన్య ప్రజల యెడ ఓరిమియుండదు.

అర్థనమయంబు నెరుగని యతనికెపుడు
రాజుల ధనంబు చేముట్టరానిదగును;
పలుక తరుణంబు ముందుగా దెలియవేని
చెనటిమాటల నీబెట్టు చెరచుకొనకు

ఇంతకొద్ది కాలములో నంతద్రవ్యమును వృథావ్య యము చేసిన యాసిగ్గులేని దూబరదిండి బిచ్చగానిని తన్ని తరిమివేయుడు. ధర్మనిధి నిరుపేదలకు కబళము వేయుట కేర్పడినది గాని సైతాను అనుచరుల పోట్టనింపుటకు గాదని సుల్తాను సెలవిచ్చెను.

పగటిపూట కర్పూరపువత్తిదివ్వె
నింటవెలిగించు మూఢాత్ముడెవ్వడైన
రాత్రిపూటకు దీపపాత్రంబునందు
తైలముడుగంటియుంట సత్యతమెఱుంగు.

విశ్వాస పాత్రుడైన యొక వజీరిట్లనియెను: మహా ప్రభూ, ఇటువంటి బిచ్చగాండ్రకు ఉదర పోషణమునకు కావలసినంత మాత్రము కొన్నిదినముల కొకతూరి యిచ్చు చుండుట యుచితమని నాకు తోచుచున్నది. అట్లయిన ఆబత్తెమును వారు దుర్వ్యయముచేయరు. దేవరవారు సెలవిచ్చినట్లు బొత్తిగ వారిని త్యజించుటయు, ఒకనిని ఔదార్యముచే ఆసపుట్టించి మరల నిరాశచే నొప్పించు టయు గొప్ప వారి యాశయమునకు సమ్మతముగ నుండదు.

ఊరక యర్థుల వాంఛా
ద్వారముదెరవంగబోల; దటుదెరచినచో
గ్రూరత గ్రమ్మతమూయం
గోరుట తమవంటి దాతకుం దగవౌనే?

దప్పిగొను యాత్రికులు నీరుద్రావనెంచి
కడలి యొద్దున గూర్చుండ గాంచమెపుడు;
ఎచటదియ్యని సెలలూరు నచటజేరు
మనుజపశుపక్షికీటక మక్షికములు

## 14

పూర్వకాలమున నొక నరపాలుడు రైతుల నుండి కప్పము చక్కగ వసూలు చేయక, సిపాయీలకు నెలజీత

షులు క్రమముగ నియ్యక యుపేక్షించుచుండెను. తప్పని సరిగా కొన్నిదినములకు బలవంతుడైన విరోధి దండెత్తి వచ్చెను. సిపాయీలు వెన్నిచ్చిపారిపోయిరి.

ఎపుడు ప్రభువు సిపాయీల కిచ్చుజీత
మీయకుండిన జెయికత్తి నెత్తదడయు;
కడుపుగడవని రిక్తుండు కలనియందు
ఆత్మశౌర్యంబు చూప సమర్థుడగునె?

ఇట్లు ద్రోహముచేసి పరుగెత్తి పోయిన వారిలో నామిత్రుడొక డుండెను చీవాట్లుపెట్టి యతనితో నిట్లంటిని: కొంచెము స్థితి మారినంతనె పూర్వస్వామిని ఒప్పరికించి అన్ని సంవత్సరముల నుండి యతని యుప్పు పులుసు దిన్నందులకు లేశమైన కృతజ్ఞత చూపక, నట్ట నడియేట పుట్టి ముంచినట్లు పరుగెత్తుటకంటె, నీచమును అగౌరవకరము నగు కార్య మొకటి యుండునా? ఆతడిట్లు బదులు చెప్పెను: దయతో మన్నింతువేని ———— నాగుర్రము మేతకు యవలు లేవు, జీని సంచా పట్ట కుదువబడియున్నది. సుల్తాను సిపాయీల కియ్యవలసిన ధనము లోభముచే బిగబట్టిన యెడల హృదయపూర్వకముగ ఆతని కొరకు శౌర్య సాహసములతో వారెట్లు పోరాడ గలరు?

యుద్ధభటులకు నెలజీతమొసగుమోయి,
వారు తమతలనిత్తురు పోరునందు;
జీతమును బత్తెమును లేక సిలుగు గుడుప
వింత మరియొక చోటికి నేగువారు.

# 15

వజీరులలో నొకడు ఉద్యోగము నుండి తొలగింపబడి దరిబేసి మండలియందు చేరెను. ఆగోష్ఠి దివ్యప్రభావము ఆతని చిత్తమున నాటుకొని మనశ్శాంతి చేకూర్చెను. మరి యొక సమయమున రాజున కావజీరుపై సద్భావము కలిగి మరల యుద్యోగము నిర్వహింపమని యాజ్ఞాపించెను, దానికాతడు సమ్మతింపక, ఉద్యోగ నిర్వహణమున కన్న నిరుద్యోగమే మేలని వచించెను.

కార్యముక్తులు శునక వక్త్రంబు లకును
పరులనోళ్ళకు జిక్కాలువైచి, కాగి
తంబులను జింపిపోసి, కలంబు విరిచి
చెడువిమర్శకు నోటను జేతబడరు.

ఎటయినను రాజ్య కార్యములు నిర్వహించుటకు నా కిప్పుడొక వివేకియైన వజీరు అత్యావశ్యకముగ కావలసి యున్నాడని సుల్తాను చెప్పెను. కార్య నిర్మగ్నులు కాక యుండుటయె వివేకవంతుల చిహ్నమని ఆ వజీరు పల్కెను.

అస్థులె భక్షించి యులహుమా పక్షి
పులుగులనేపక పూజ్యమై తనరె.

# 16

సింహము సేవను నీవేల కోరుకొంటివని సివంగిని కొందరడిగిరి. ఏలయన, అది తిని వదలిపెట్టిన మాంసమును

నేను దిను చుందును. దాని శౌర్య ప్రతాపముల యాశ్రయ మూలమున విరోధుల దౌష్ట్యమునుండి రక్షించు కొందునని యదిచెప్పెను. అట్లయిన, ఇప్పుడు నీవు దాని యాశ్రయ రక్షణము పొందుట వలన కృతజ్ఞతను తెలుపుకొను చున్నావుగదా, మరి విశ్వాసపాత్రులయిన స్వసేవకులలో నిన్నొకదానినిగ ఎంచుకొనునటుల నీవేల సింహామునకు సమీపమున వర్తింపవు? ఏలయన దగ్గరనున్న యెడల దాని కోపమునుండి సురక్షితముగ నుండజాలనని ఆ మేక చెప్పెను.

అగ్నిని నూరెండ్లు నర్చనల్పియును
అర్చకుండీల్గడే యందు దా బడిన!

సుల్తాను సచివునకు ద్రవ్యము దొరకిన దొరకవచ్చును, లేదా తలయూడిన నూడవచ్చును. అనుక్షణ భిన్నమైన పాదుపాల చిత్తవృత్తులయెడ అత్యంత జాగరూకతతో మెలగవలయును. సలాము చేసినందు కొకప్పుడు వారు కోపగించుకొందురు, నిందించినందు కొకప్పుడు గౌరవించి యంగీ నొసంగుదురని పెద్దలు చెప్పుదురు. హాస్యోక్తులు రాజమిత్రులకు వన్నెను, పండితులకు లోపమును తెచ్చును.

వినయంబు యోగ్యత విడబోకు మీవు;
విదు రాజసఖులకు వేడుకల్ నగవు.

# 17

నామిత్రులలో నొకడు తన దురదృష్ట బాధనుగూర్చి నాయెదుట నిట్లు మొరపెట్టుకొనెను: వరుమానముకొద్ది; కుటుంబమా పెద్దది. నిరశన కష్టభారమును వహించుటకు దార్ఢ్యములేదు. ఏ పరదేశమైన వలసపోయి అచ్చట నాజీవితము గడపిన యెడల నాయోగు బాగులు ఇతరుల కెరుకపడక యుండునని పలుమారు తలంచితిని.

పలుమారు నాకట బన్నుండెగాని
యవ్వాని స్థితిగతు లరయ రెవ్వరును;
పలుమారు పెదవిపై నిలిచె బ్రాణంబు
వాసికై యేడ్చిన వారు లేరెవరు.

కుటుంబము కొరకు నేనుగావించు ప్రయత్నములను అమానుషత్వముగను నిర్భాగ్యతగను విరుద్ధార్థము కల్పించి నాప్రత్యర్థులు నేను లేకుండుతెరి తూలనాడి నవ్వుకొందు రనియు, నాదురవస్థకు సంతోషించు చుందురనియు మరల తలపోసితిని.

ఎప్పుడు నదృష్ట మెట్టిదో యెరుగబోని
పరువుమాలిన యుధముని పాటు గనుడు!
నేడు సుఖముగ దనపొట్ట నింపుకొనుచు
విడిచి నా డాలుబిడ్డల వెతలు చెంద

గణితము నాకు కొంత తెలిసియుండుట మీరెరుంగ నిది కాదు. మీపలుకుబడి మూలమున నాకొక చిన్న

యుద్యోగము ప్రాప్తించు నెడల మనసు కుదుటబడి మరణ పర్యంతము మీకు నేను కృతజ్ఞతా ఋణబద్ధుడనుగ నుండ గలనని అతడు పల్కెను.

తమ్ముడా, పాదుపాల సేవకు రెండుదిక్కులు గలవు. ఉదర పోషణము జరుగునను ఆసయొకటి; ప్రాణభీతి మరి యొకటి. ఇంతమాత్రపు టాసకై అంతటిభీతి ననుభవించుట పెద్దల యాశయమునకు భిన్నముగ నుండును.

చేనుదోటల కష్టంబు చెల్లదనుచు
నెవరు నడుగరు దరిచేసి యింటి కరిగి;
కష్టవేదన సైపుము; గాక నీవు
ప్రేవులను గాకి మూకకు వేయ బొమ్ము.

దీని కాతడిట్లనియెను: మీరు చెప్పినది నాస్థితికి సరిపోదు; నా ప్రశ్నకు తగునైన ప్రత్యుత్తరమును గాదు. ఎవడు వంచనము చేయునో వానిచేయి భీతిచే గడగడవణకు చుండుననుమాట మీరు విన లేదా!

సత్యమార్గము దైవసమ్మతంబగును
దారి తప్పంబోడు ధర్మాధ్వగామి.

నలుగురు మనుష్యులనుచూచి నలుగురు ప్రాణముపోవు నట్లు భయపడుచుందురని పెద్దలు చెప్పుదురు. కోశాపహారి సుల్తానును, కన్నపుదొంగ తలయారిని, వ్యభిచారి చారుని, బజారులంజె కొత్వాలును చూచి భయపడుచుండును.

లెక్కలు నిర్దోషముగనుంచినవానికి తనకీదారువలన నేమి భయము ?

మిడిసి యుద్యోగమున మేర మీరకున్న
పదవి దొలగిన, శత్రుల బారి బడవు;
నిర్మలుడవైన భయ మేమి నీకు సఖుడ,
మురికిగుడ్డనె బండపై మోదు జాకి.

ఇప్పటి నీస్థితికి ఒక నక్కకథ సరిపోవుచున్నదని యిట్లు చెప్పితిని: ఒక నక్క పడుచు లేచుచు పరుగెత్తుచుండెను. ఏమియాపద సంభవించినది. ఇట్లుచావుబ్రతుకులతో పరుగెత్తుచున్నావని యొక డడిగెను. వారికి సింహముతో పని బడెననివింటిని అని నక్క చెప్పెను. ఓసి తెలివిమాలినదానా, నీకును సింహమునకును ఏమిసంబంధసామ్యములున్నవి ? నోరుమూసుకొమ్ము. అసూయాగ్రస్తులు దుష్టోద్దేశముతో ఇదియును సింగపుగొదమయని నిరూపింపలేరని నేను బంధింప బడుదును. విచారణసలిపి నన్నువదలిపెట్టించుటకు ఎవరు నాపక్షమూనుదురు ? ఈరాకు దేశమునుండి సంజీవనౌషధము తెచ్చులోపల సర్పదష్టుడు మరణించును, అని అది బదులు చెప్పెను. ఇదేవిధముగ, నీకు యోగ్యతయు భక్తి విశ్వాసములుండి సుకీర్తితుడవై యుండియును ప్రత్యర్థులు మాటున పొంచియుందురు. విరోధులొకమూల కనిపెట్టుకొని యుందురు. ఒకవేళ నీ నీతిప్రవర్తనము వారు మారుపరచి సుల్తానుకు ఎక్కజెప్పి నీపై దురభిప్రాయముకలిగించిన యెడల, అట్టిసమయమున నీ పక్షమున మాటాడుటకెవరికిశక్తి

యుండును? నీవు సంతృప్తిరాజ్యమునురక్షించు కొనుచు ప్రభుత్వోద్యోగ కాంక్షను నీరువదలుటయె శ్రేయస్కరమని యిప్పటికిని నాకు తోచుచున్నది.

జలధియాత్రంగల్గు నర్వలాభములు;
నిరపాయతంగోర బరగు తీరమున

నా మిత్రుడు ఈమాటలకు ప్రీతినొందక మొగము త్రిప్పుకొని నిష్ఠురముగ నిట్లనియెను:

ఈ మాటలయందేమి వివేకము, కార్యపరత్వము, విషయగ్రహణము అగపడుచున్నది? చెరసాలయందు స్నేహితులు అక్కరకువత్తురు. తిండికూటమునందు విరోధు లైనను నెయ్యము చూపింతురను పెద్దలవాక్యము ఇప్పుడు దృష్టాంతీకరింపబడినది.

సంపదల దేలునప్పు డిచ్చకములాడి
అన్న, తమ్ముడ, యను వార లాప్తవరులె?
కష్టదినముల నెదిక్కు గాంచనపుడు
చేయి యందిచ్చువారెపో చెలిమికాండ్రు.

అతడు కలతచెంది నాబోధను వినకుండుట నెరిగి, నాకు పూర్వపరిచితుడైన కోశాధికారియొద్దకు పోయి ఆయువకుని దుఃస్థితియు, యోగ్యతయు శక్తిసామర్థ్యములను అభివర్ణించితిని. అంతట నొక చిన్నయుద్యోగమీయబడినది. కొంతకాలమునకు ఆతని యోగ్యతా స్వభావములకును కార్యనిర్వహణ నైపుణ్యమునకును పైయధికారులు మెచ్చు

కొనిరి. అప్పటినుండియు ఆతనిపని మేలయ్యెను. ఇంతకన్న పెద్దయుద్యోగ మొసంగబడినది. అతని సంతోషగ్రహము వాంఛాపరిపూర్తియను ఉచ్చస్థితి నలంకరించెను.

క్రమక్రమముగ ఆయువకుడు సుల్తానుకు ప్రేమ పాత్రుడయి రహస్యములు చెప్పుకొనదగినంతటి విశ్వాసనీయు డాయెను. అతని సౌఖ్యమునకు సంతోషించి యిట్లంటిని:

కటికి లేమిడి కీవు గాసి చెందకుము;
చీకటిలోనూరు జీవామృతంబు,
మోము మాడ్చకు కాలనేమి దుర్గతికి,
ఓర్పు చేవయ్యు బండొనగు దియ్యనిది.

ఆ సమయమున కొందర స్నేహితులతోడకలసి నేను మక్కాయాత్రకు వెడలవసినట్లు తటస్థించెను. మరలనేను యాత్రనుండితిరిగివచ్చు నపుడు ఒకటిరెండు అంచెలుండగనే ఆ నామిత్రుడు నాకు యెదురుకోలోసగెను. దరిచేసి యుడుపులు ధరించుకొనియుండిన ఆతని దుఃస్థితినిచూచి, యిదెట్లుసంభవించెనని యడిగితిని. మీరిదివరకు చెప్పినట్లె యసూయాగ్రస్తులు నాపై నిందనారోపించిరి. సుల్తాను అందలి సత్యాసత్యములను విచారించుటకు యత్నింపలేదు. పూర్వ మిత్రులును ప్రాణస్నేహితులును న్యాయముచెప్పక నోరు మూసుకొని యూరకుండిరి. వారు మున్నటి సహవాసమును కూడ మరచిరి.

చూచుచున్నారుగద ముఖస్తుతినిపుణుల
వక్షగతహస్తులయి భాగ్యవంతునెదుట!

అతడె దురదృష్టవశమున నధనుడైన
నఖిల లోకంబు కాల్మెట్టు నతనితలను.

వేయేల, యింతవరకు చెరసాలకష్టము లనుభవించి తిని. ఈ వారము మక్కా-యాత్రికులు సురక్షితముగ నగరముచేరిరన్న సంతోషవార్త విని అధికారులు మమ్ము బంధవిముక్తుల గావించిరి. పిత్రార్జితమైనఆస్తిని గూడ జప్తిచేసిరనిచెప్పెను. ఆనాడు నామాట నీ చెవి కెక్కకపోయెను. పాదుషాలసేవ అపాయకరమును, ఆదాయ కరమునైన సముద్రయాత్రవంటిది. ధనమార్జించిన నార్జింప వచ్చును. లేదా యలల దెబ్బకు ప్రాణములు పోయినను పోవచ్చునని యిదివరకు నేను చెప్పియుండ లేదా?

పెద్దవారల బోధకు బెదచెవి నిడ
కాళ్ళకుం జుట్టుకొనును సంకెళ్లు; మతల
గాటుబాధకు నోర్చుకో దీటులేక
తేలు నివసించు బొరియలో వ్రేలి నిడకు.

# 18

కొందరు దేశదిమ్మరి ఫకీరులు నాగోష్ఠిలో నుండిరి. వారు శాంతగుణాలంకృతులుగ బయటి కగపడుచుండిరి. ఒకానొక సంపన్నుడు వారి సమాజముపై విశేష సద్భావము గలిగి సదావృత్తి యొసగు చుండెను. అంతట కొన్ని దినములకు వారిలో నొకడు దరిబేసుల కుచితము కాని నీచకార్య మొనరించెను. ఆపెద్దమనుష్యుని మనస్సు విరిగెను.

వారి యోగ్యతకు విలువ తగ్గెను. దిన బత్తెము నిలిపివేయ బడెను.

ఏ విధము చేతనైనను నామిత్రులకు మరల జీవనాధారము కల్పింప వలయునని తలంచి ఆసంపన్నుని సేవించుట కుద్దేశించితిని. అచ్చటి ద్వారపాలకుడు నన్ను లోనికి ప్రవేశింపనీయక యరికట్టి మొరకుదనము చూపెను. పెద్దలిట్లు చెప్పియుండుట వలన వానిని మన్నించితిని.

ధరణి పాలుర మంత్రుల ద్వారములకు
పరిచయములేక నీవేగ వలనుపడదు;
కుక్కగాంచిన జొక్కాలు కొంగులాగు
గడుసు పణిహారిగన మెడనొడిసిపట్టు.

ఆసంపన్నుని సమీపవర్తులగు ముఖ్యసేవకులకు నాస్థితి యెరుక పడినంతట వారుమర్యాదతో నన్ను లోనికిగొనిపోయి యున్నతాసనమున కూర్చుండగోరిరి. అయినను నేను వినయపూర్వకముగ క్రింద కూర్చుండి యిట్లంటిని :

మీగులాముల పంక్తినే గూరుచుందు;
అధమ దాసుని నన్ను నటు సేయునిందు.

నాపలుకులువిని, అయ్యో దేవుడా! యిదియేమిమాట!

కోరి నాకనులపై గూర్చుందువేని
ముద్దుదీర్తును; నీవు మోహనుడవోయి.

అని ఆసంపన్నుడు పల్కెను. అంతట ఉచితాసనముపై కూరుచుండి వివిధ విషయములు ప్రసంగించుచుండ వాని

మధ్య ప్రస్తావ వశమున నామిత్రుల దోషచరిత్రము కూడ వచ్చినది. నేనిట్లంటిని:

పూర్వదాతలైన పూజ్యులు మీకేమి
నెతనుదోచె దాను బరిహరింప;
గొప్పతనము శాంతి యొప్పు సర్వేశుండు
తప్పుగనియు దిండి తప్ప కొనగు.

అంతట ఆ పెద్ద మనుష్యుడు నామాటలకు ప్రీతినొంది నామిత్రులకు మునుపటివలెనే పోషణద్రవ్య మొసగుటకును, నిలువపడి యున్న బత్తెముగూడ ఇచ్చుటకును ఆజ్ఞాపించెను. నేను కృతజ్ఞత తెలుపుకొనుచు వినయముతో భూమిని ముద్దిడి, నాసాహసము మన్నింప వలయునని యిట్లంటిని:

ఆశలీడేర్చు 'కాబా'కు నరుగు చుంద్రు
దేశ దెశాలనుండి దిదృక్షు జనము;
తాము మముబోంట్ల నహియింప దగును; విఫల
కుజము నెవరైన రాతితో గొట్టబోరు.

# 19

తండ్రి సంపాదించి పెట్టిపోయిన విశేషధనసంచ యము కుమారునకులభించెను. ఆ రాజపుత్రుడు ఉదార చిత్తుడయి దాతృత్వ హస్తము తెరచి ధారాళముగ రైతుల కును సిపాయీలకును ధనము వెదచల్లుచుండెను.

ఊమునింపిన పళ్ళెర ముంచినంత
ఇంపునెత్తావి గొనదు ఘ్రాణేంద్రియంబు;

వేడినిప్పుల నాపాడివేయ వెడలు
అంబరును మించు సౌతభం బన్నియెడల.

గొప్పతనమును వహియింప గోరుదేని
మానసంబున నౌదార్య మూనవలయు;
ఆర్ద్ర కేదారమున విత్తునంతవరకు
మొలకలెత్తవు ధాన్యంబు; తెలియుమోయి.

వివేచనా రహితుడగు నొకమిత్రుడు ఆ రాజకుమారున కిట్లు నీతి బోధించుటకు ప్రారంభించెను: "మన పూర్వులైన భూపతులు ఎంతయో ప్రయత్నముసల్పి అక్కరల కొరకు ధనము కూడబెట్టిరి. నీవు చేతిని కొంత మట్టుపరచు కొనుము. ఇప్పుడెరుగరాని కార్యములు ముందు తలపడును. విరోధులు వెనుకనుందురు. పనివడినపుడు ధనహీనుడవై కష్టపడకుండునటుల అరసికొమ్ము."

"ధనము సామాన్యజనులకు దానమీయ
నొక్కొకరి కొక్కబియ్యపుముక్కవచ్చు
ప్రతి మనుష్యునికడ యవపాటి వెండి
గొన్న దినదిన వృద్ధియౌ గోశధనము."

రాజకుమారునకీమాటలు సమ్మతముగాక కోపగించుకొని కఠినముగ నిట్లు పలికెను, "సర్వేశ్వరుడు నన్నీరాజ్యమునకు పరిపాలకునిగా నొనర్చినది, నేననుభవించుటకును ఇతరులకు పెట్టుటకే గాని కావలివానివలె ధనము కాపుదారిచేయుటకు గాదు."

నలువది కోట్టుల ద్రవ్యము
నిలిపిన ఖారూను చావనే చచ్చెను; ని
ర్మల కీర్తి నిలిపి చనుటను
వెలయును నౌషిరవాను పేరిప్పటికిన్.

# 20

న్యాయప్రభువైన నౌషీరవాను వేటాడుచుండిన స్థలమునందు మాంసమును కరుకుట్లు చేయుచుండిరి. ఉప్పు లేదని తెలుసుకొని ఒక గులామును గ్రామమునకు పరుగెత్తి పొమ్మనిరి. అంతట నౌషీరవాను ఇట్లు చెప్పెను: వెలయిచ్చి తీసికొనిరమ్ము, లేకయున్న యిది యొక చెడ్డ యలవాటుగ పరిణమించి గ్రామమును నాశనము చేయును.

ఈ కొద్దికే యేమి యపకారము కలుగునని వాడ నెను. ఈలోకమునందు నిరంకుశత్వమునకును దౌర్జన్య మునకును మూలము మొట్టమొదట సూక్ష్మముగనె యుండెను. వెనుక వచ్చినవారు దానిని మరింత అభివృద్ధి చేయగా ఇప్పటి నిస్సీమస్థితికి వచ్చినదని రాజనియెను.

రైతు తోటను ఫలమొండు రాజు దినిన
ధ్వంస మొనరింత్రు పరిజనుల్ పండ్లచెట్లు;
అయిదు గ్రుడ్ల కొల్లకు నృపుడాజ్ఞ వెట్ట
వేయికోళ్ళ సిపాయీలు వేచి తింద్రు.

# 21

పన్నులు వసూలుచేయు నొక యుద్యోగి రైతుల కొంపాగోడి నాశముచేసి రాజు బొక్కసము పెంపొందించు చుండెను. మనుష్యులచిత్తము మెప్పించుకొరకు సర్వేశ్వరుని హృదయము నొప్పించువారి సంపదలు నిర్మూలించుటకు అటు వంటి మనుష్యులనె దైవము వారిపైకి నియోగించునను సూక్తి ఆ యుద్యోగి యెరుగడు కాబోలు!

రెల్లు మంటల పొగ రేగుటకంటె
ఆర్తుల నిట్టూర్పె యధికమై పొదలు.

మృగములలో నెల్ల సింహము శ్రేష్ఠమైనదనియు గార్దభము అధమమైనదనియు జనులు చెప్పుచుందురు. పెద్ద లంగీకరించినట్లుగా, మనుష్యులను హింసించు పంచాననము కంటె భారమును వహించు గార్దభమె మేలైనది.

ఖరము బుద్ధిలేని మొరక జంతువె యయ్యు
బరువు మోయుచుంట గరము ప్రియము;
గార్దభంబు వృషము గాన్పించు మేలుగ
ప్రజల హింసపెట్టు వారికంటె!

కొన్ని దినములకు నింద్యుడైన యాయుద్యోగి స్వభావము కొంతవరకు సుల్తానుకెట్లో తెలియవచ్చి వానిని చిరుత పలకలలో నొత్తి పలుతెరగుల బాధపెట్టి చంపుట కాజ్ఞాపించెను.

ప్రజల యంగీకృతికి బాలుపడవయేని
పాదుషాహికి నీపయి రాదు ప్రీతి;

దైవకారుణ్యముం గోరవలతువేని
అతని సృష్టికి శ్రేయంబు నాచరింపు.

ఆ యుద్యోగిచే నిదివరకు బాధలొందిన వారిలో నొకడు ఆసమయమున తత్సమీపమున పోవుచుండి వాని యధఃపతనమును తనలో తాను తలపోసుకొనుచు నిట్లని యెను :

ప్రభుని యోగబలంబున్న ప్రతి మనుజుడు
ప్రజల ద్రవ్యంబుదిన నొంట బట్టగలదె?
గట్టి యెముకను ఖబళింప గలడుగాని
పొక్కిలిం జేరినప్పుడు పొట్టజీల్చు.

దుష్టదృష్టవంతుడౌ దుర్జనుండీల్లు;
ప్రజల శాపము వ్రేలు వానిపై జిరము.

# 22

క్రూరకర్ముడైన యుద్యోగియొకడు ఒక సాధువుతలపై రాయి రువ్వెనని చెప్పుకొందురు. ఆ దరిబేసి కప్పుడు కసి తీర్చుకొనుటకు శక్తిచాలక ఆరాతిని దాచియుంచుకొనెను.

ఒకప్పుడు పాదుషాకు ఆయుద్యోగిపై కోపమగ్గలించి తలబంటి గోతిలో పాతించెను. సమయము కొరకు వేచి యుండిన ఆ దరిబేసి ఆరాతినే అతని తలపై విసరెను. నీ వెవ్వడవు? ఈరాతినేల రువ్వితివని ఆయుద్యోగి యడిగెను. నేను ఫలానివాడను. ఈ రాయి ఫలానిది. ఫలానిదినము ఈరాతితో నా తలపయి కొట్టియుంటివని దరిబేసి చెప్పెను.

ఇంత కాల మెచ్చట నుంటివని ఆయువ్యోగి యడిగెను నీయధికార గౌరవములకు భయపడుచుంటిని. ఇప్పుడు నిన్నీ గుంటలోచూచి యనుకూలసమయము ప్రాప్తించెనని తెలుసుకొంటిని.

ఇల నయోగ్యుల భాగ్యంబు హెచ్చుచుండ
సూక్ష్మబుద్ధులు మర్యాద చూపుమంద్రు;
వెతజ పెనువాడి గోళులు పెరుగువరకు
దుష్టరిపులను మార్కొన దొడరకీవు.

ఉక్కు చెయివాని పంజాను నొత్తిపోకు
నీకు మెత్తని ముంజేయి నిక్కునలగు;
వాడు విధి బద్ధహస్తుడై బలము దొలగ
మెదడు పెరుకుము మిత్రులు ముదమునొంద.

# 23

ఒకనొక యధిపతి తీవ్రమైన రోగముచే బాధపడుచుండెను. దాని విషయము వర్ణింపక వదలుటయే మేలు. ఈవ్యాధి కుదురుటకు ఫలాని గుణముగల మనుష్యుని పిత్తకోశముతప్ప వేరొక మందు లేదని యూనాని వైద్యుల సంఘము ఏక గ్రీవముగ తీర్మానించెను.

అంతట అట్టిగుణముగల మనుష్యుని వెదకుటకు ఆజ్ఞయైనది. ఒకానొక పల్లెటూరి చిన్నవానికి వైద్యులు చెప్పిన గుణములన్నియు కలవని వానిని తోడ్కొని వచ్చిరి.

తల్లిదండ్రులకు లెక్కకు మిక్కుటమైన ధనమునిచ్చి సంతోష పెట్టిరి.

పాదుషా జీవిత క్షేమముకొరకు ఒక రైతును వధించుటకు సెలవొసంగితినని న్యాయాధికారి ఆజ్ఞాపత్రము నొసగెను. అటుపయి వధకులు ఆ బాలుని కొంపోవుటకు సంసిద్ధులైరి. అంతట నాతడు మొగము నాకసము వంక కెత్తి నవ్వెను. ఈ స్థితిలో నీకు నవ్వు వచ్చుటకు కారణ మేమని రాజడిగెను. బిడ్డలు తల్లిదండ్రుల ప్రేమ నాసింతురు. విచారణకొరకు న్యాయాధికారి యొద్దకు పోదురు. న్యాయమునకోసం పాదుషా నాశ్రయింతురు. ఇప్పుడన్నన్నో తల్లిదండ్రులు కొద్దిపాటి ద్రవ్యము నపేక్షించి నన్ను మృత్యువున కప్పగించిరి. న్యాయాధిపతి నన్ను వధించుటకు ఆజ్ఞాపించెను. పాదుషా నావధమూలమున తాను క్షేమపడ జూచుచున్నాడు. ఈ సమయమున కరుణామయుడైన సర్వేశ్వరుని రక్షణముతప్ప నాకు వేరొండు ఆశ్రయము లేదు.

నీ సేత కెవరితో నేమొఱలిడుదు?
నినుగూర్చి నీయొద్దనే విచారణయు!

ఈ పలుకులకు సుల్తాను చిత్తము కరుణార్ద్రమయి కన్నీరు జొటజొట గారుచుండ నిట్లనియెను. అమాయికుడైన యీ బాలకునిరక్తము స్రవింపజేయుటకంటె నామరణమే యుత్తమమని, వానిని చేరదీసి కౌగిలించుకొని కన్నులు తుడ్దిదుకొని మితిలేని ద్రవ్యము బహుమానమిచ్చి యింటికి

పంపెను. ఆ వారమునందె సుల్తాను వ్యాధి యుపశమించె నని చెప్పుకొనిరి.

నీలునదీ తటమున నొకమావటివాడు పాడుకొను చుండిన పద్యము ఈ సందర్భమునకు సరిపోవుచున్నది.

నీపదంబుక్రింద రూపరు చలిచీమ
కష్టమెరుగవేని, కరిపదంబు
క్రిందజిక్కి బాధనొందు నీకాలెట్టు
లున్నొ దాని నీవు నూహనల్పు.

# 24

ఉగ్రమూలైస్ బానిసలలో నొకడు తప్పించుకొని పారి పోయెను. కొందరు వెన్నంటిపోయి వానిని పట్టి తెచ్చిరి. తక్కిన బానిసలు ఇకమీద నిట్టికార్యము చేయకుందురను నెపము పెట్టి పూర్వ ద్వేషమును సాధించుకొనుటకు వజీరు ఆ బానిసకు మరణదండనము విధించెను. అంతట వాడు ఉగ్రమూలైసు సముఖమునకు వచ్చి శిరము భూమిపై మోపి యిట్లనియెను :

నా కేదివచ్చినా న్యాయంబెయగును
అది పాదుషాకిష్టమై యుండుకతన;
ధర్మ ప్రభులుమీరు, దాసుండ నేను,
మీయాజ్ఞ కెదురాడ మేలౌనె నాకు?

అయినను, ఏలినవారి కుటుంబపుటుప్పు పులుసు తిని పెరిగిన మేలు మరవనందున, నిర్హేతుకముగ నాయూపిరి

తీసిన నేరమునకు అంత్యదినమునందు మీరు పట్టుపడక యుండవలయునని నేను కోరుచున్నాను. సెలవిత్తురేని యీవజీరును చంపెదను. ఆయపరాధమునకు ప్రతీకారముగ మీరు నాకు మరణదండనము విధింపుడు. అప్పుడు మీరు న్యాయముగా శిక్షించిన వారగుదురు. ఈ మాటలకు సుల్తాను నవ్వి ఈ ధర్మసందేహమెట్లని వజీరునడిగెను. మహాప్రభూ, దైవప్రీతిగ వీనిని వీూ పెద్దల గోరీలకు జన్నె విడిచి వదలిపెట్టుటయె యోగ్యమని నాకు తోచుచున్నది. అందువలన నాకుగూడ ముప్పు దప్పును. తప్పిదము నాదియే యని తలంతును. ఏలయన పెద్దల వాక్య మిట్లున్నది:

మంటిగడ్డలు వినరెడు మనుజుతోడ
బుద్ధిహీనత బోరిన పుర్రెపగులు;
ఎదిరి ముఖమున బాణంబు వేయునపుడు
వాని గురికి నీవును బాలుపడుట నెరుగు.

# 25

జూజక్ రాష్ట్రాధిపతి యొద్ద దయార్ద్ర చిత్తుడును సుస్వభావుడునగు నొక ఖాజీ యుండెను. ఆయన అందరను ఎదుట గౌరవించును. వారివెనుక మంచి మాటలాడు చుండును. ఒకప్పుడు ఖాజీ యొనర్చిన కార్యము సుల్తానుకు అంగీకారముగాక జరిమానా విధించి శిక్షించెను. రాజ భృత్యులు పూర్వమాతని కారుణ్యమునకు పాత్రులై యుండిన మేలు మరవక కట్టుబాటునందు ఏలాటి యిక్కటులు గలుగ

నీయక దయా దాక్షిణ్యములు చూపుచు ఆతని గౌరవించు చుండిరి.

వెనుక నిందించు వైరి మైత్రిని వరింతు
వేని, మెచ్చుకొమ్మ యెదుట వానిమాట;
అనురాత్ముడెటున్ మాటలాడు; వాని
నుడుల చేదెదనలువుము నొరుతీపు.

అతడు తనపయి మోపబడిన కొన్ని నేరములనుండి విముక్తుడయి మరి కొన్నిటికొరకు చెరసాల యందుంచ బడెను. పరిసర రాష్ట్రాధిపతి యొకడు రహస్యముగ అతని కిట్లు లేఖ వ్రాసిపంపెను: ఆప్రాంతాధిపతి అటువంటి గొప్ప వాని యోగ్యతను తెలిసికొనక యగౌరవించెను. ఫలాని వారి యభిప్రాయము (వారిని దేవుడు నిముక్తులను జేయు గాక!) మాయెడల ప్రసన్న మగునేని శక్తివంచన లేక వారి కోరిక ననుసరించుటకు ప్రయత్నింపబడును. ఈ రాజ్యాధిపతులు వారి దర్శనమునకు నువ్విళ్లూరుచున్నారు. ఈయుత్తరమునకు ప్రత్యుత్తరము నిరీక్షించుచున్నారు.

ఖాజీ యీ లేఖలోని విషయము మనసునకు తెచ్చుకొని, యందు అపాయము శంకించి, యొకవేళ బయలు పడినను ఆపద రాకుండునటుల తక్షణమె ఆలేఖ వెనుక ప్రక్క సంక్షేపముగ ప్రత్యుత్తరము వ్రాసి పంపెను.

ఒక రాజోద్యోగి యీ సమాచారము తెలిసికొని, ఏలిన వారప్పుడు శిక్షించిన ఖాజి పరిసర రాష్ట్రాధిపతులతో

ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుచున్నాడని సుల్తాను కెరిగించెను. అంతట ఆజాబు కొనిపోవుచుండిన భృత్యుని పట్టుకొని దానిని చదివిరి. అందిట్లు వ్రాయబడి యున్నది: గొప్పవారికి నాయందు నాయోగ్యతకు మించిన సదభిప్రాయమున్నది. కాని వారు ప్రసాదించిన వరము నంగీకరించుటకు ఈ దాసునకు వలను పడదు. ఏలయన, వీరి కుటుంబపు పొత్తుతిని పెరిగిన నేను కొద్దిగ ఆదరణము మారినందులకై, పూర్వమునుండి మేలు చేసిన వారియెడ కృతఘ్నుడనుగ నుండజాలను.

> నిరతంబు నీమీద నెనరూనువాడు
> చెడుగొంటు నొకవేళ జేయమన్నించు.

సుల్తాను ఆ ఖాజీ కృతజ్ఞతకు సంతోషించి, గౌరవ సూచకమగు అంగీని ధనమును బహుమానమిచ్చి యిట్లనెను: నేను తప్పు చేసితిని, నిరపరాధుని సిన్ను కష్టపెట్టితిని. మన్నింపవలయును. మహాప్రభూ, యీదాసునకు ఏలిన వారియందు ఏతప్పిదము నగపడుటలేదు. నేనట్లు కష్టముల పాలు కావలసి యుండుట దైవ నిర్ణీతముగావున, నన్ను చిరకాలము సాకి సంతరించిన వారి మూలముననే చెడుగొందుటయు మేలని యీదాసుడు తలంచుచున్నాడు. పెద్దలిట్లు చెప్పియున్నారు:

> పరులు కష్టంబు విడిరని పనవబోకు,
> తలప సుఖదుఃఖ హేతువు దైవమగును;
> వింటిలోనుండి బాణంబు వెడలినట్లు
> గనుపడియు గారకుండు విలాకాడుగాదె.

# 26

అరబ్బీదేశపు నరపాలుడొకడు కోశాధికారులతో నిట్లు చెప్పెనని వింటిని: ఇప్పుడెంత యిచ్చుచుండినను ఫలానివాని జీతము ఇమ్మడిచేయుడు. ఏలయన, వాడు ఆజ్ఞానువర్తియయి దివాణమును జాగరూకతతో సేవించు చున్నాడు. ఇతర సేవకులు ఆటపాటల ప్రొద్దుపుచ్చుచు వారి విధి నిర్వర్తనమందు ప్రమత్తులయి సంచరించు చున్నారు.

ఈ మాటలు వినుచుండిన యొక పుణ్యాత్ముడు నిట్టూర్పువిడిచి మూర్ఛిల్లెను. నీ కేమి తోచినదని ఆయన నడిగిరి. సర్వేశ్వరుని ఆస్థానమునందుగూడ దివాణపు దాసులకు నిట్టి పదవులు హెచ్చుచుండును.

రెండురేవులు సుల్తాను బ్రీతిగొలువ
గనికరించును మూడవ దినము, నిజము;
సదయుడౌ నీశ్వరుని మొగసాలనుండి
యర్థికోటి క్రమ్మరదు భగ్నాశ నెపుడు.

అజ్ఞ ననుసరింప నలరు నేతృత్వంబు;
అజ్ఞదాటగాంచ వధికపదవి;
ధర్మపరులు సతము దైవసన్నిధియందు
శిరమువంచి సేవ చేయుచుంద్రు.

# 27

ఒక నిరంకుశుడు నిరుపేదలయొద్ద వంటకట్టెయలు బలవంతముగ తక్కువ వెలకు తీసుకొని, యెక్కువ వెలకు భాగ్యవంతులు విలుచునట్లు నిక్కచ్చి చేయుచుండెను. పుణ్యాత్ముడొకడు ఆతని యొద్దకు పోయి యిట్లనెను:

కనిన వారల నెల్ల గరచు సర్పమవు;
కూర్చుండునెడ బాడుగోరు ఘూకమవు.
నీబలాత్కృతి మాయొద్ద నిగ్గవచ్చు,
సర్వసాక్షి దేవుని కడసాగబోదు;
ప్రజల బలవంతముగ గష్టపరతువేని
వారి ప్రార్థన మాకాశ పదమునంటు.

అతడు ఈమాటకు కోపగించుకొని అందరి నీతికి విముఖుడయి యాసజ్జనుని నిరాధరించెను. ఒకనాటి రేయి వంట యింటినిప్పు కట్టెలగుట్ట కంటుకొని అన్ని వస్తువులను గాల్చి వేసెను. మెత్తని పడుక కాలిపోవుటవలన ఆతడు వేడి బూడిదలో నిలబడియుండెను. ఈ నిప్పు ఎచ్చటినుండి నాయింటిపై బడినదో తెలియకున్నదని ఆ జనకంటకుడు మిత్రులతో పలుకుచుండు సమయమున మున్నటి పుణ్యాత్ముడు ఆకస్మికముగ ఆదారిని వచ్చుచుండి యాతని చూచి, నిరు పేదల హృదయముల వెడలు వేడి నిట్టూర్పులనుండి యని బదులు చెప్పెను.

వేదనాతప్త హృదయుల వేడియూర్పు
గూర్చి యవధాన! మెదడల గోడుతుదకు

దలకొనును; జేతనైనంతకొలది యొరుల
యెదల నొంపకు; నిట్టూర్పు లేర్పుజగము.

కై ఖుస్రువు చక్రవర్తి కిరీటఫలకమున నిట్లు వ్రాయ బడి యుండెను :

ఎన్ని పురుషాంతరము లేడు లీజ గాళి
నాదు మృత్తికపై నింక నడచుచుం దు!
రాజ్య మెటునాకు జెయిమారి ప్రాప్తమయ్యె
అట్లె యది పెరుచేతుల కరుగుచుండు.

# 28

ఒకానొక మల్లుడు కుస్తీ విద్యయందు ప్రవీణు డాయెను. అతనికి మున్నూట యరువది చక్కని కుస్తీపట్లు తెలిసియుండి, ప్రతిదినము నొక్కొక్క క్రొత్తపట్టు చూప గలిగి యుండెను. తన శిష్యులలో చూపనందమైన యొక యువకునిపై ప్రీతిజనించి, అతడు వానికి మున్నూట యేబది తొమ్మిది పట్టులను నేర్పించెను. కాని యొక పట్టుమాత్రము నిలిపిపెట్టుకొని దాని తరిబీదు ఆలస్యము చేయుచుండెను.

క్రమ క్రమముగ శిష్యుడు బాహుబలము నందును మల్లయుద్ధ నైపుణ్యమునందును వన్నెకెక్కెను. ఆ కాల మున ఎవ్వరికిని వాని నెదిరించు శక్తి సామర్థ్యములు లేకుం డెను. ఆ దీమసముతో శిష్యుడు సుల్తాను దగ్గరకుపోయి యిట్లు విన్నవించెను : మా గురువులవారు విద్య నేర్పినందు వలనను, వయస్సుచేతను నాకన్న మిన్నయగును గాని,

లేకున్న బాహుబలమునందు ఆయన కన్న తక్కువ వాడను గాను. కళాకౌశలమునందు ఆయనకు సరి సమానుడను.

రాజు ఈ చులకదనపు మాటలకు ఈసడించుకొని గురు శిష్యులను కుస్తీపట్టుటకు ఆజ్ఞాపించెను. విశాలమైన ప్రదేశము నాయత్తపరచిరి. అమాత్యులును, రాజన్యులును, దేశ దేశములనుండి వచ్చిన మల్లురును అచ్చట చుట్టూ మూగియుండిరి. ఆ యువకుడు మత్తగజమువలె గోదాలోనికి ప్రవేశించు నురవడిచూడ, కంచుకొండ యడ్డము వచ్చినను దానిని పెకలించి పారవేయునో యను నట్లుండెను. వాడు తన కన్న బలవంతుడని యెరిగి, వానికి నేర్పక దాచియుంచిన పట్టును ఈ తరుణమున గురువు ప్రయోగించెను. శిష్యునికి దానినుండి తప్పించుకొను ఉపాయము తెలియకుండెను. అంతట కోపగించుకొని వస్తాదు రెండుచేతులతో వానిని భూమినుండి తన తలపైకెత్తి క్రిందికి విసరెను.

ప్రజలలోనుండి సంతోషకలకలము పెల్లుబికెను. అంతట గురువునకు గౌరవసూచకమగు అంగీని ధనమును బహుమానమిచ్చుటకు రాజాజ్ఞయైనది. నిన్ను పోషించి విద్య నేర్పినవానిపైకి కాలుదువ్వితివి. తుదకు నీయత్నము విఫలమాయెను అని రాజు శిష్యుని పిలిచి చీవాట్లు పెట్టెను. మహాప్రభూ, బాహుబలముతో ఆతడు నన్ను గెలువలేదు. కాని కుస్తీ విద్యయందు ఒక పట్టుమాత్రము కొరవపడి యుండినది; దానిని నాకు నేర్పక బిగబట్టి యుండెను. ఈ

దినము ఆ పట్టే నన్ను చిక్కించుకొన్నదని యువకుడు విన్న వించెను.

ఇటువంటి దినము ఒకటి వచ్చుననియే ఆ పట్టును నేర్పక దాచియుంచితిని. మిత్రులొకవేళ విరోధులగుదు రేని వారు నీ కపకారము చేయగలయంతటి బలము మైత్రియు న్నపు డొసగబోకుమని బుద్ధిమంతులు చెప్పుచుందురు. తన శిష్యునిచే అపకార మొందిన యొక గురువు చెప్పిన మాటలు విన లేదా?

ఇలను విశ్వాసముఖిలంబు ఖిలమొ! లేక
యిత్తరిని తదాచరణంబు రిత్తయేమొ!
బాణవిద్య నాకడ నలవరుమకొనియు
నన్నుగురిసేయడను శిష్యునెన్నడెరుగ.

# 29

ఒకానొక దరిబేసి యిసుక యెడారియందు ఒకమూల కూర్చుండి యుండెను. పాదుషా యామార్గమున పోవుచుం డెను. దరిబేసి నిశ్చింతముగ సంతృప్తిరాజ్యము నేలు చుండుకతన పాదుషాను కన్నెత్తియైన చూడలేదు. అందు లకు రాజ్యాధికార గర్వితుడగు సుల్తాను కుతిలపడి యిట్లని యెను: "కుట్లబొంతలు తొడుగుకొను ఈ దరిబేసిమూక నాలుగుకాళ్ల జంతువులతో సమానము. వీరికి యోగ్యతయు మానుషత్వము శూన్యము."

అంతట వజీరు దరిబేసి యొద్దకు పోయి "అయ్యా! యీ యిలనంతయు పరిపాలించు పాదుషా మీ ప్రక్కన

పోవుచుండ, మీరు రాజోచిత మర్యాదలు నెరపి యేల యేలినవారిని సేవింపరు'' అని యడిగెను. అందుకు దరిబేసి, మీ సుల్తాను కిట్లు చెప్పుము: ''సుల్తాను ధనము నెవరు కోరుచుందురో అట్టివారు అతనిని సేవింతురు. ఇదియుంగాక, రాజు రైతుల రక్షణముకొరకు ఏర్పడెను. రైతులు రాజును సేవించుటకు గాదు'' అని చెప్పెను.

రాజు ప్రాభవముచే ప్రజ సుఖించియును
పేదల కాపరి పృథ్వీశ్వరుండు;
గొల్లండు గొర్రెల కొరకు నేర్పడియె
గొల్లని సేవకై గొర్రెలుగాదు.
ఒకడు కృతార్థుడై యుప్పొంగుచుండ
హృదయక్షతి దపించు నింకొక్కరుండు;
మరణంబు తనయాజ్ఞ నెరవేర్చినంత
వ్యర్థభావుని తలపండు లో మెదడు
మట్టి జికెదుదాక మాటాడబోడు;
తర్వాత స్వామియు దాసుడన్ భేద
మంతరించును; మరణానంతరంబు
వారి మట్టిని ద్రవ్యవాడు దరిద్రు
డితడర్థవంతు డం చెరుగంగ వశమె?

దరిబేసి పలుకులకు సుల్తాను మెత్తపడి నీ వేదైన కోరుమని యడిగెను. ఇంకొకమారు నన్ను తొందర పెట్టక యుండుటయె నా కోరికయని అతడు చెప్పెను. నా కేదైన యొక కోరిక తెల్పుడని రాజడిగెను.

ధనమున్న యప్పుడె పలపోసికొనుము;
సిరులు రాజ్యంబులు చేతులు మారు.

అని దరిబేసి చెప్పెను.

## 30

ఒక వజీరు మిసరు దేశీయుడైన జున్నూను యొద్దకుపోయి ఆయన యాశీర్వాదముగోరి యిట్లనియెను: "నేను రేయుంబవలు సుల్తానుసేవయందే నిమగ్నుడనై యున్నాను. నిరంతరము మేలున కెదురుచూచుచు దండనమునకు భయపడుచున్నాను." జున్నూను దుఃఖించి యిట్లనియెను: "నీవు సుల్తానుకు భయపడినట్లు నేను సర్వేశ్వరునికి భయపడియుండిన ముక్తులలో నొకడనై యుందును"

కష్టసుఖముల తలపోత గలుగకున్న
స్వర్గమున నుండు దరిచేసి పదయుగంబు;
ప్రభువునటు దైవమును భయభక్తి గొలువ
దేవదూతయై మంత్రియు దేజరిల్లు.

## 31

ఒక పాదుషా నిరపరాధుని వధించుటకు ఆజ్ఞాపించెను. అంతట వాడు, నాపయి మీకుగల క్రోధమును సాధించుటయందు మీ సొంత కీడు నాహ్వానింపకుడు. ఏలన ఈ మరణదండనము నాపయి ఒక్క నిమిషములో గడచిపోవును. కాని, ఆ పాపము మిమ్ము శాశ్వతముగ చుట్టుకొనును.

జీవిత మెడారి గాలినా శ్రమమేగు;
కష్టసుఖములు; సొబగుల కలిమి లేమి,
చను; నిరంకుశు హింస నక్షణమె వేచు,
గాని, యది వ్రేలు నెప్పు దవ్వాని మెడను.

సుల్తాను వాని నీతివాక్యములవలన లాభపడిన వాడయి మరణ దండనము నుపసంహరించెను.

## 32

నౌషీరవాను మంత్రులు ఏదో యొక ముఖ్యమైన రాజకీయ విషయమును గురించి యాలోచించుచుండిరి. వారియందొక్కొక్కడును ఒకొక్క విధముగ తన యభిప్రాయమును వెలిపుచ్చెను. సుల్తానును తనకు తోచిన యభిప్రాయము వెల్లడించెను. అంతట ప్రధాన మంత్రి బుజుర్ జుమెహరు రాజాభిప్రాయమె శ్రేష్ఠమని యంగీకరించెను.

తర్వాత తక్కిన మంత్రులు రహస్యముగ ప్రధానామాత్యుని ఇట్లు ప్రశ్నించిరి: ఇందర పండితుల యభిప్రాయముల కంటె సుల్తాను అభిప్రాయము మీకెట్లు మేలని తోచినది? ఎట్లన, కార్యఫలిత మెట్లుండునదియు మనకు తెలియదు. మన యభిప్రాయముల సాఫల్యము దైవేచ్ఛపై నాధారపడియున్నది. ఒకవేళ అనుకూలపడిన పడవచ్చును. లేదా ప్రతికూలమైన కావచ్చును. కావున సుల్తాను ఉద్దేశము ననుసరించుటయే మేలు. అందువలన ఒకవేళ కార్యము విఫలమైనను ఆయన కోపమున కగ్గము కాము. కావుననే పెద్దలిట్లు వచించిరి :

పాదుషా కంటె వేరభిప్రాయపడుట
తనమెడకుదావె యుర్రిత్రాడు తాల్చుకొనుట:

దినము రాత్రియటంచు రాజనియనేని
అటుగొ చంద్రుడు, సప్తర్షు లరుగొ యనుము.

# 33

ఒక మోసగాడు జెడ పెనచుకొని, నేను అలీసంతతి వాడనని చెప్పుకొనుచు మక్కా-యాత్రికుల సార్థవాహము తోడ పట్టణము ప్రవేశించెను. తాను మక్కా యాత్రికుడ నని తెలిపికొని స్వరచితమని యొక చక్కని పద్యమును సుల్తానునకు సమర్పించెను. రాజు దును సంతసించి ధన మొసగి గౌరవించి, అందరును ఆతని నాదరింప వలయునని ఆజ్ఞాపించెను.

ఆ సంవత్సరమె సముద్ర యాత్రను డి మరలివచ్చిన యాస్థానసచివుడొకడు ఇట్లనియెను: నేనితనిని బస్రాపట్టణ మున 'అజహా' పండుగనాడు చూచితిని. ఇతడు మక్కా-యాత్రికుడు కాడు. మరి యింకొకడిట్లనియెను: ఈతని నేను గుర్తెరుగుదును. ఇతని తండ్రి మాల్తా పట్టణమున నున్న యొక క్రైస్తవుడు. కావున వీడు అలీ సంతతివాడు కాడు. స్వరచితమని యతడు చెప్పిన పద్యము అన్వారి పద్య సంగ్ర హమునందున్నదని వారెరిగిరి. అంతట సుల్తాను కోపగించు కొని వీనిని తన్ని తరిమి వేయుడని యాజ్ఞాపించి, ఓయీ, యొకదానిపై నొకటి యున్ని యసత్యములెట్లు పలికితివని వానినడిగెను. మహాప్రభూ, ఒక్క-మాట విన్నవించ వలసి యున్నది. అది యథార్థము కానియెడల ఏలినవారు ఏశిక్ష విధించినను దానికి బద్ధుడనై యుందునని చెప్పెను.

అది యేదియని రాజడిగెను.

బీద గొల్లడు మజ్జిగ విక్రయింప
గలుపు నిరుసేరు నీరొక్క గరిటె చల్ల;
దేశదేశాలు తిరిగిన త్రిమ్మరింద్రుడు
జంతు నడిలేక బొంకులే చాటుచుండు.

అని యాతడు చెప్పెను. ఈ మాటలకు సుల్తాను నవ్వి, నీజీవితమున నింతకన్న సత్యమైన వాక్యమును ఎప్పుడును చెప్పియుండవని సంతోషించి మామూలు బత్తెమిచ్చి పంపుడని సెలవిచ్చెను. వారు అతని మనసు సంతోషపెట్టి పంపివేసిరి

# 34

హారూనుల్ రషీదు పుత్రులలో నొకడు కోపోద్రిక్త చిత్తుడయి తండ్రి యొద్దకువచ్చి, ఫలాని సేనాని కుమారుడు మాతల్లిని దూషించెనని చెప్పెను. అంతట అమాత్యులను చూచి హారూను అట్టివానికి ఏమి శిక్ష యుచితముగ నుండునని ప్రశ్నించెను. ఒకడు చంపుట మంచిదనెను. ఇంకొకడు నాలుక తెగగోయుట యుచితమనెను. తక్కినవారు జరీమానా విధించి యూరు వెడలగొట్టుట యుక్తమనిరి.

హారూను ఇట్లు నుడివెను: కుమారా, వానిని మన్నించుటే దయచూపిన వాడవగుదువు. నీకది శక్యము కానియెడల, నిన్ను వాడేమాత్రము తిట్టెనో, ఆమాత్రమే నీవును వాని తల్లిని తిట్టుము. హద్దుమీరి తిట్టిన తప్పు నీ

యందుండును, నీ విరోధి నీపై నేరము మోపవలసి యుండును.

మత్తకరితోడ బోరాడు మల్లునైన
వీరుడని సన్నుతింపరు విబుధ వరులు;
నిజముగా వాడె వీరుండు నిండు కోప
మాత్మ నహియించి వెడమాటలనని యతడు.

# 35

కొందరు పెద్దమనుష్యులతోడ నేనొక యోడయందు కూర్చుండి యుంటిని. మా వెనుక వచ్చుచుండిన యొక పడవ త్రెళ్లి అందుండిన యిద్దరు సహోదరులు సుడిగుండము లోపడిరి. అదిచూచి యొక పెద్దమనుష్యుడు నావికుని పిలిచి యిట్లనియెను: వారిద్దరిను తప్పింపుము. అందుకు బహుమానముగ నేను యేబది దీనారముల నిచ్చెదను. ఆ మాటలువిని నావికుడు నీటిలోదుమికి ఒకనిని తప్పించెను. మరియొకడు మృతినొందెను. నేనిట్లంటిని: అతనికి ఆయుష్యము పూర్ణమైనది కాబోలు! కావున నే వాని సేవనెత్తుట కాలసించితివి. రెండవ వానిని రక్షించుటకు త్వరపడితివి. నావికుడు నవ్వి యిట్లనియెను: తాము సెలవిచ్చినది యథార్థమె. అయినను దానికి వేరొక కారణమున్నది.

ఏమి కారణము?

ఒకనిని రక్షించుటకు నామన ముచ్చిళ్లూరు చుండినది. ఏలయన, ఒకప్పుడు నేను ఇసుక యెడారిలో అలసి సొలసి నడువలేక యుండినపుడు అతడు నన్ను ఒంటెపై గూర్చుండ

బెట్టుకొనెను; మరియొకడు బాల్యమున కొరడాతో కొట్టె నని నావికుడు చెప్పెను.

చేత నైనంత వర కేరి చిత్తములను
గాసి పెట్టకు; మా దారి కంటకాంకి
తంబు; చేయూతయిమ్ము పేదలకు; నీకు
గూడ బనులున్నవని యెంచుకొమ్ము సఖుడ.

# 36

ఇద్దరన్నదమ్ములుండిరి. ఒకడు సుల్తాను సేవ చేయుచుండెను. మరియొకడు తన చేతుల కష్టముతో జీవించుచుండెను. ఒకప్పుడు భాగ్యవంతుడైన యన్న యిట్లని యెను: నీవు సుల్తానును సేవించుచుండిన, పనులు చేయవలసిన కష్టము తప్పిపోవునుగదా. అంతట తమ్ముడిట్లని యెను: నీవును కష్టించి పనులు చేయుచున్నయెడల నీచమైన రాజసేవనుండి విముక్తుడవగుదువు గదా. ఏలయన జరీనడుముపట్ట గట్టుకొని రాజు కొలువున నిలుచుండుటకంటె యవరొట్టెదిని కూర్చుండుటయె మేలని పెద్దలు చెప్పియున్నారు.

పాదుషాలను సేవించి పనులుచేయు
జేతులను రొమ్ముపయి భక్తి జేర్చుకంటె,
వేడి సున్నపురాలను విరియబోసి
కట్టుసున్నంబుగా జేత గలుప మేలు

ఏమి మెసవుదు వేసవి, నేమి సీతు
నందు దొడుగుదు నను చింత వ్యర్థమయ్యె
బ్రతుకు; సేవాభరంబున వంగుకంటె
పాడుపొట్ట, రొట్టియతోనె పడుముతృప్తి.

## 37

ఒకడు ధర్మప్రభువైన నౌషీరువాను సన్నిధికి వచ్చి, ఫలాని మీ విరోధిని దేవుడు కొనిపోయెనని సంతోషవార్త తెలిపెను. నన్ను వదలిపెట్టెనని నీవేమైన వింటివా యని నౌషీరవాను ప్రశ్నించెను.

శత్రువీల్గెనటన్న సంతోషమేల?
మన జీవితముఁ గూఁడ నుండదు వశంబు.

## 38

నౌషీరువాను ఆస్థానమున అమాత్యులు ఏదోయొక విషయాలోచనమునందు తర్కించుచుండిరి. వారియందు ప్రముఖుడైన బుజర్ జమిహరు ఊరకుండెను. ఈ వాదోపవాదములయందు మీరేల పాల్గొనరని తక్కినవారడిగిరి. ఏలన, వజీరులు వైద్యులవంటివారు. వైద్యుడు వ్యాధిగ్రస్తునకు తప్ప నితరునికి మందియ్యడు. మీ యభిప్రాయములు సహేతుకములుగ నున్నయప్పుడు పైపెచ్చుగా నేను మాటలాడుట యుక్తముకాదు.

నా ప్రవేశ మక్కరలేక నడుచుపనుల
పనికిమాలిన మాటలు పలుకదగదు;
గ్రుడ్డివాని మార్గమునందు గూపమున్న
దానిగని యూరకుండుట తప్పెయగును.

## 39

హారూనుల్ రషీదు మిసరురాజ్యమును స్వాధీనపరచుకొని యిట్లనియెను: మిసరురాజ్యము నేలుచున్నా

నను గర్వముతో దైవత్వమారోపించుకొన్న విప్లవకారునికి వ్యతిరేకముగ, ఈ రాజ్యము నింకొకనికిత్తును.

రాజు బానిసలలో అధమాధముడైన 'కొసీబ్' అను నీగ్రోజాతి వాడొకడుండెను. హారూను వానిని మిసరు రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసెను. వాని తెలివితేట లిట్లుండినవని చెప్పుకొందురు: ఒకప్పుడు మిసరు దేశపు కృషీవలులు బానిసరేని సముఖమునకు వచ్చి, ప్రభువా! నీల్ నదీ తీరభూములందు ప్రత్తి చల్లితిమి. కాని యకాలవర్షములు పట్టి యంతయు నాశమైనదని మొరపెట్టుకొనిరి. నాశము కాకుండుటకు మీరు కంబళిబొచ్చునో చల్లియుండ వలసినదని ఆ బానిసరేడు వారికి ఉపాయము చెప్పెను. ఈ మాటలు వినుచుండిన యొక పుణ్యాత్ముడిట్లనియెను:

వేత్తృతను బట్టి భాగ్యంబు వెలయునేని
అజ్ఞమతి కంటె రిక్తుని నరయలేము,
పండితులయూహ వెతగొంది బమ్మరింప
అజ్ఞులనొకప్డు సంపద లధిగమించు.
ధనము దౌలతు ప్రాప్తించు దైవనియతి,
కాదు కార్యజ్ఞత తదీయ కారణంబు,
కష్టపడి రసవాది దుఃఖమున జావ
వెడగు పెనులిబ్బి గను బాడియడుగుత్రవ్వ.

## 40

ఒక పాదుషాకు చీనాదేశపు బానిసకన్నె నొకతెను సమర్పించిరి. అతడు మధుపాన మత్తుడై యుండి యా యువతిని గవయగోరెను. అందుకా కన్య సమ్మతింపకుండెను.

సుల్తాను కోపగించుకొని యీ రమణిని ఒక క్రిబానిస కిచ్చి వేసెను,

వాని వికార స్వరూపమును వర్ణించుటకు నలవిగాదు. పై పెదవి ముక్కురంధ్రముల నతిక్రమించి యుండెను. క్రింది పెదవి మెడపట్టపైకి వ్రాలియుండెను. 'సఖ్రా' యను దయ్యము కూడ వాని వికృత ముఖస్వరూపము చూచి వెరగొని పరుగెత్తవలసి నట్లుండెను. వాని బాహుమూలములనుండి మసి యూటలు స్రవించుచుండెను.

అందము చందము యౌవనము
సంగమని, వికృతంపు రూప భావాలతో
పందెమ్ము ప్రళయమ్ము రుద్రుడు
సందనుకం జిక్కియుండునని యనవచ్చునా

వర్ణనాతీతమగు వాని పాడురూపు!
ఇంక బాహు మూలములనుండి సిస్తుపుంచె
కాచుగావృత మమ్ము నాకంపు ఘాటు!
యెండలో గుప్పుపీసగె యెంతో పులుసు.

ఆనాటిరేయి యీ క్రిబానిసను మోహమగ్గలించి కామోద్రేకము చిక్కబట్టనోపక, బలాత్కారించి యీకన్యను చెరచెను. ప్రొద్దుపొడిచి నంతట సుల్తానుకు కైపుతగ్గి యీ యువతిని వెదకెను. నిన్న జరిగిన కథ రాజునకు కెరిగించిరి. అంతట ఆతడు మండిపడి, ఆ బానిసను ఆ తొత్తు కూతురిని ఒకటిగా కట్టి యెత్తైన మేడపైనుండి కందకములో పడద్రోయుడని ఆజ్ఞాపించెను.

తరువాత సుస్వభావుడగు నొక వజీరు లేచి ప్రార్థనా పూర్వకముగ శిరము భూమిపై నానించి యిట్లు విన్నవించెను: పాపము, ఇందు నా బానిస తప్పేమియు లేదు, ఏలయన ఏలినవారి గులాము లందరు ఇట్టి బహుమానముల కును ఆదరింపులకును అలవాటుపడి యున్నారు.

దాని నంటకే యొక రాత్రి యోర్చుకొనియుండిన వాని దేమి మునిగిపోవును? అట్లయిన ఆ బానిసకత్తె ఖరీదు కన్న నెక్కుడుద్రవ్యము వానికిచ్చియుండుమనని పాదుషా యనెను. అంతట వజీరు, మహా ప్రభూ, దేవరవారు సెల విచ్చిన దండనయును నాకర్థమగుచున్నది. అయినను పెద్దలిట్లు చెప్పియున్నారు:

అతి తృషార్తుడు సెలయేటియందు జొచ్చి
మత్తకరి యున్నదని జంకి మరలిపోడు;
ఆకలెత్తిన మతహాసు ద్వారమున్న
యింటి సెంటిమై 'తంజాను' కేల వెతకు?

సుల్తాను ఇంపైన యీ పలుకులకు సమ్మతించి యిట్లనెను: ఇప్పుడా బానిసను నీకిచ్చివేయుచున్నాను. ఆ కొత్తకుక్కను నేమి చేయమందువు?

దానిని ఆ బానిసకే యిచ్చి వేయుము. కుక్క యెంగిలి తినుటకు కుక్కకే తగియుండునని వజీరు చెప్పెను.

చెడ్డవాడల నడయాడు చిన్నదాని
చెలిమి పాటించి దగ్గర జేర్చ కెపుడు;
దప్పి గొనియు నెవ్వడుగాని త్రావబోడు
కంపునీటి వాడానిన కమ్మనీరు.

# 41

సికందర్ రూమీని ఇట్లడిగిరి: పూర్వపశ్చిమ దేశములను మీ రెట్లు లోబరుచుకొంటిరి? పూర్వనరపాలురకు మీకంటె నెక్కుడు కోశము, వయస్సు, రాజ్యము, సిబ్బంది మొదలగునవి యుండియు మీవలె వారు జయమునొంది యెరుగరు.

రూమీ యిట్లు చెప్పెను: దైవసాహాయ్యమువలన నేనే యే దేశముల వశపరచుకొంటినో ఆ యా దేశముల రైతులను గష్టపెట్టినది లేదు. పూర్వులు ఏర్పరచిన దానధర్మములను సదాచారములను రద్దుపరచినది లేదు పాదుషాలనుగూర్చి వారి మంచితనముతప్ప వేరొండు మాటాడినది లేదు.

మహితుఁ నామంబు మలినంబు సేయు
కుమతి బెద్దని పేరుకొనరు పండితులు;
భాగ్యంబు భోగంబు బలుప్రాభవంబు
శాసనాజ్ఞాకృతి జయము నాక్రాంతి
యన్ని తృణప్రాయమౌను గతింప;
పూర్వుల సత్కీర్తి పాలియింపబోకు
నీపేరు ప్రఖ్యాతి నిలువంగ వలదె?

## ద్వితీయాధ్యాయము

# దరివేసుల శీలము

## 1

ఒక పుణ్యాత్మునిచూచి యొక పెద్దమనుష్యుడిట్లని యెను : ఇతరులచే నిందింపబడుచున్న ఫలాని భక్తునిగూర్చి మీరేమి చెప్పెదరు ?

బయటికి నే దోషమును కాన్పించుట లేదు. అతని యంతరంగమున నేమి దాగియున్నదో దానిని నేనెరుగను.

మానికల బొంత దొడిగిన మనుజుగాంచి
కల్మషములేని భక్తునిగాదలంచు;
మేమి వానిలో నున్నదో యెరుగకున్న
ఏమి పని 'ముహ్తాసిబున' కింటిలోన ?

అని ఆ పుణ్యాత్ముడు పలికెను.

## 2

పావనమైన ' కాబా ' వాకిట ప్రణతుడయి వేదనా గద్గద స్వరముతో నొకదరివేసి యిట్లు మొరపెట్టుచుండ నేను వింటిని : ఓ క్షమాశీలా, కరుణామయా, మాబోటి దుర్మార్గుల వలనను అజ్ఞానుల వలనను ఏమి ప్రయోజనముండునో నీ వెరుగుదువు.

భక్తి వినయంబులునులేవు; ప్రణతినల్ప
నట్టిలోపంబె నీ ముందు బెట్టినాడ;
పాపి యనుతప్తుడగు దనపాపములకు,
జ్ఞాని యత్పనా లోపంబు సైపవేడు.

భక్తులు తమ సేవకు ప్రతిఫలము వాంఛింతురు. వర్తకులు తమ వస్తుసామగ్రికి విలువ గోరుదురు. వినయ ముచూపి రక్షణము గోరునంతటి యోగ్యత నాకు లేదు. నిర్హేతుక వాత్సల్యముచే నీవు నన్నురక్షింతువన్న యాస యొక్కటియె నీ యెదుట పెట్టుచున్నాను. నేను యాచించు టకు వచ్చితిని; వ్యాపారము చేయుటకుకాదు.

నను ముంచిన దేల్చిన నే
ననయము నీ ద్వారసీమ నాంచెదశిరముఁ;
చనరునె స్వేచ్ఛ గులాముగ,
ననువర్తించెదను నీదు నాజ్ఞను దేవా.

అర్థియొకడు 'కాబా' ముందు నార్తి వెక్కి
వెక్కి యేడ్చుచు నిట్లన వింటి: ప్రభువ,
వినతి గ్రహియింపు మని నిన్ను వేడగాని
కలుషముల పైని బెట్టు నీ కలయి గీటు.

# 3

అబ్దుల్ ఖాదర్ గిలాని కాబా మందిరమున పవిత్ర శిలాఫలకముపయి మోము మోపి యిట్లు పలుకుచుండ కొందరువినిరి: సర్వేశ్వరా, నన్ను మన్నింపుము. అట్లుగాక నేను శిక్షార్హుడనని తలంతువేని అంత్యదినమున పుణ్యాత్ము

లను గాంచి సిగ్గు పడకుండునటుల నన్ను గ్రుడ్డివానినిగ చేవదీయుము.

అనుదినంబును బ్రొద్దున నవని నంట
వినతి దలవంచి యీరీతి వేడికొందు;
నిన్నుమరవను సర్వేశ; నన్ను దాను
స్మృతికి నెలయింతువే యెప్పుడేని క్షణము.

# 4

కన్నపు దొంగ యొకడు ఒక పుణ్యాత్ముని యింట ప్రవేశించెను. అచ్చట నెంత వెదికినను ఏమియు దొరక నందున వాడు భగ్న మనోరథుడాయెను. ఆ పుణ్యాత్మున కీ విషయము తెలియవచ్చి, తాను పండుకొని యుండిన కంబళీనితీసి దొంగ మనసు చిన్నపోకయుండునట్లు వాని మార్గమున విసరివేసెను.

ద్వైప మార్గానువర్తులు తమ విరోధి
హృదయములనైన నొప్పింప రెన్నడేని;
స్నేహితులతోడ గలహంబు సేయు నీకు
నిట్టిగౌరవపద మింకనెట్టులబ్బు?

నిర్మలాత్ముల మైత్రి యెదుట నైనను వెనుక నైనను ఒకే విధముగ నుండును. అట్టివారు ముందు నీకొరకు ప్రాణములనైన నర్పింతుమని నమ్మబలికి వెనుకకు మరలి నపుడు తప్పులు పట్టరు. కపట మిత్రులన్ననో—

ఎదుట మేక విధాన నెంతొ నెమ్మదియు,
వెనుక హింసానక్త వృకవర్తనంబు!

ఇతరుల తప్పులు నీకడ
సతతము తూర్పార బట్టు చందంబున దు
ర్మతి నీ తప్పులు సైతము
నితరులకడ జాటుచుండు నెల్లిదపరుపజ్ఞ.

# 5

కొందరు దేశద్రిమ్మరి ఫకీరులు పరస్పర సుఖదుఃఖ భాగస్వాములయి యాత్రసల్పుట కంగీకరించిరి నేను వారి సహవాసము నాసించితిని. దానికి వారొప్పుకొనకుండిరి. అంతట నేనిట్లంటిని : మాబోటి బీదల సహవాసము నిరాకరించుటయు, మీ బోంట్లగోష్ఠివలన గలుగు లాభమును పొందనీయక యాటంకపెట్టుటయు తమవంటి గొప్పవారి కారుణ్యమునకును సౌశీల్యమునకును లోపముగ నుండును. తమచిత్తములకు భారభూతుడనుగాక తెలివిగల చెలికాని వలె తోడ్పడుచుండుటకు తగినంత యుత్సాహము ఆతురత నాకు గలదు.

అంతట వారిలో నొకడిట్లు చెప్పెను : మా మాటలను మీరు వేరు విధముగ తలంచుకొని కుశిల పడబోకుడు. ఏలయన, కొన్ని దినములకు పూర్వము చోరుడొకడు దరిజేసి వేషముతోవచ్చి మావద్దచేరి స్నేహసూత్రముతో మమ్ము బంధించెను.

అంగిదాల్చిన వాని యంతెట్లు తెలియు?
లేఖలో విషయంబు లేఖకుండెరుగు

సామాన్యముగ దరిబేసుల సత్ప్రవర్తనమునందుగల విశ్వాసమువలన వానిపై నెవ్వరికిని సంశయము పుట్టక సహవాసము నంగీకరించిరి.

జ్ఞానులకు బాహ్యచిహ్నము
మానితమౌ కుట్లబొంత; మరి యదె చాలుఁ
మాననము పుణ్య చింతా
ధీనముగా నెల్లవేళ దిరమై యున్నన్

నీ విధుల నిర్వహింపుము నిరత, మంత
నెడదకెక్కిన యుడుపుల దొడిగికొమ్ము,
తల గిరీటము, భుజముపై ధ్వజముబెట్టి
కొమ్ము, దాన రాదేమి లోపమ్ము నీకు.

అంతయు ద్యజించి వైరాగ్య మభ్యసింప
జ్ఞానియగు గాని వేషంబు కలిమిగాదు;
బొందళము వీరుడు ధరింప బోలుగాని
బడుగుపేడికి నదియేల బరువుచేటు.

ఒకనాడు ప్రొద్దుకుంకు వరకు దారి నడచి నడచి చీకటి పడినతోడనే యొక కోటప్రక్కన పండుకొని నిద్రించితిమి, అంతట వేషధారియైన యాదొంగ లేచి కాలుసేతులు శుద్ధిచేసికొనుటకని మిత్రుని జలపాత్రముతీసికొని దొంగిలించుటకు బయలు వెడలెను.

దైవభక్తుల యంగిని దాల్చినట్టి
అల్ల దరిబేసి కార్యంబు నరసినావె?

పూతకాబాకు గప్పిన పుట్టమూడ్చి
గాడిదకు గుడారముగాగ గట్టినాడు!

మేము పండుకొనియున్న స్థలము దాటినంతనే యా దొంగ కోటలోనికి ప్రవేశించి యలంకార పేటికను దొంగలించి పలపల తెల్లవారులోపల చాలదూరము పయనించెను. ఏమియు నెరుగని మేము నిద్రించుచుంటిమి. ప్రొద్దు పొడుచుచుండగనె యధికారులు మమ్ము కోటలోనికి తీసికొనిపోయి చావమొత్తి చెరసాలలోనికి సాగనంపిరి. ఆ దినము మొదలు మేము అన్యుల సహవాసము వర్జించి నిస్సంగులముగా నుండుటకు తీర్మానించుకొంటిమి.

కులములోన నొకడు కొరగాని పనిసేయ
మిగతవారికెల్ల నగడు వచ్చు;
బెడిసి యొక్కయెద్దు బీడులో పడినంత
ఊరిపశువులెల్ల దూరు గుడుచు.

బాహ్యదృష్టికి, వారి సహవాసము నుండి నేను తొలగింప బడినట్లగపడినను తథ్యమరసిన దరిబేసుల గోష్ఠియందు పొందదగిన లాభము ఆ కథమూలమున సిద్ధించినందులకు సర్వేశ్వరునికి వందనములర్పించితిని. మా బోంట్లకు ఈ నీతి జీవితమునందెల్లప్పుడు ప్రయోజనకారి కాగలదు.

మట్టు మర్యాద లెరుగని మనుజుడొకడు
సభను జెలరేగ బెద్దల స్వాంతమెరియు;
దొరగ బన్నీరు నింపిన తొట్టియందు
గుక్కపడునేని, జలదారి గుంటయగును.

## 6

భక్తుడొకడు పాదుషాకు అతిథియయ్యెను. తనయందు వారికిసదభిప్రాయము హెచ్చునటుల భోజనమునకు కూర్చుండి నపుడు అతడు తన కిష్టముండినంతకన్న తక్కువగ భుజించెను. నమాజు చేయుటకు లేచినపుడు తనయలవాటుకన్న ఎక్కువ సేపు ప్రార్థించెను.

కాబాకుబోలేవు గను మోయరబ్బి
యీబాట తుర్కికి నేగురో యబ్బి.

ఆ భక్తుడు స్వగృహమునకు వచ్చినప్పుడు మరల అన్నము తినగోరెను. బుద్ధిమంతుడైన యాతని కుమారుడు ఇట్లు ప్రశ్నించెను: తండ్రీ పాదుషా విందుబంతిని నీవేల చాలినంత భుజింపకుంటివి? అదియు నొకందుకు పనికివచ్చునని వారు చూచుచుండగా నేనేమియు తినలేదని తండ్రి చెప్పెను. ఒకందుకు పనికివచ్చుదానిలో నేదియు కొరత పడకుండునట్లు నమాజుకూడ చేయుమని కుమారు డెత్తిపొడిచెను.

సుగుణసంపత్తి నరచేత జూపినావు;
తప్పిదంబుల జంకలో దాచినావు;
కష్టదినమున జెల్లని కాసుతోడ
ఓయి గర్వాంధుడా, ఏమిసేయగలవు?

## 7

బాల్యమునందు నెక్కుడు శ్రద్ధాభక్తులు కలవాడ ననియు, రాత్రి జాగరము, పుణ్యచింతనము, ఉపవాసముల

యందు మిక్కుటమైన పట్టుదలకలిగినవాడననియు నాకిప్పటికిని జ్ఞప్తియున్నది. ఒక నాటిరేయి మా తండ్రిగారియొద్ద కూర్చుండి యా రాత్రి యంతయు కంటిపై రెప్పవేయక ప్రియమైన ఖురాను నొడిలో నిడుకొని పారాయణముచేయుచుంటిని. మా చుట్టుపట్టులనుండినవారు నిద్రించుచుండిరి. వారిని గురించి జనకునితో నిట్లంటిని: ఈ సమాజములో నొక్కడైనను నమాజుచేయుచున్నవానివలె తలయెత్తడు. వీరందరు మరణించిరో యనునట్లు గాఢనిద్రాపరవశులై యున్నారు. ఇందుకు జనకుడిట్లనియెను: ప్రియతనూజ, యితరుల తప్పులెత్తిచూపుటకంటె, నీవును నిద్రించి యుండిన మేలుగ నుండెడిది.

వ్యర్థ గర్వావకుంఠనల బమర, వాడి
తాను దనకన్న నన్యంబు దలపలేడు;
జ్ఞాన దృష్టి ప్రబోధంబు గాంచునేని
తెలియు దనకన్న నజ్ఞుండు గలుగడంచు.

# 8

ఒక సభయందు ఒకానొక పెద్దమనుష్యుని యోగ్యతను సద్గుణములను ఇనుమిక్కిలిగ పొగడిరి. అంతట నా యోగ్యుడు తలయెత్తి యిట్లనియెను: నేనెటువంటివాడనై నదియు నేనెరుంగుదును.

ప్రజకు నా బాహ్యావర్తన భవ్యమయ్యు
జిత్తమలినత దలవంతు సిగ్గుతోడ;
తన బెడంగును రంగు నందరు నుతింప
నెమిలి కరిగాళ్ళరోతకు నెగులుచెందు.

# 9

లిబనాను పర్వతమునందలి పుణ్యాత్ములలో నొకడు దిమిష్క నగరములోని గొప్ప మసీదునకు వచ్చెను. ఆయన యుపన్యాసములును మహిమలును అరబ్బీ దేశమంతట ప్రసిద్ధములై యుండెను. ఆ మహనీయుడు బావియొద్ద నీటి తొట్టికడ కాలుసేతులు శుద్ధిపరచు కొనుచుండ కాలుజారి తొట్టిలోబడి చాలకష్టముతో తప్పించుకొని పైకెక్కివచ్చెను. నమాజు పూర్తియైన వెనుక సహవాసులలో నొకడు ఆయనతో నిట్లనియెను. నాకొక సంశయము కలిగినది.

ఏమి సంశయము?

దేవరవారు పడమటి సముద్రముపై నడచునప్పుడు అరకాలైన చెమ్మగాక యుండిన సమాచారము నాకు జ్ఞప్తియున్నది. అయినను ఏమికారణమోగాని యీదినము తమరు నిలువులోతు నీళ్ళలోబడి తప్పించుకొని బయట పడుటయె కష్టసాధ్యమయ్యెను.

అంతట ఆ మహాత్ముడు తలవంచుకొని కొంతసేపు వరకు ఆలోచనా నిమగ్నుడయి తలయెత్తి యిట్లనియెను: లోకప్రభువైన మహమ్మదు సెలవిచ్చిన యీ సూక్తి నీకు తెలియదా? "ఒక సమయమున నేను సర్వేశ్వరునియొద్ద యున్నపుడు తన సమీపవర్తియగు దేవదూతగాని లోకమున కంపబడిన ప్రవక్తగాని అచ్చటికి వచ్చుటకు దారి

లేకయుండెను.'' కాని సదా యట్లేయుండునని ఆయన చెప్పలేదు.

మహమ్మదు మరియొకప్పుడిట్లు సెలవిచ్చెను: ''ఆయన యొకప్పుడు జిబ్రియీలు, మయికాలు వంకచూడడు. వేరొకప్పుడు హజ్రా జైనాబులతోడ మాటాడును,''

కన్నులయెదుట నిమేషము
మిన్నునగ్రొమ్మెరుగు పోల్కి మెరసి, మరిగి, యూ
పన్నుల గాఢోత్కంఠయు
జెన్నగు నీ విలువ హెచ్చు జేసెటి పీశా.

యాకూబు గని కొందరడిగి రీరీతిగ :

''ఓ కీర్తి భూషణా, యోమనీషి
మిసరు రాజ్యమునందు మీ కుమారుండుండ
నతనిచొక్కాతావి నద్భుతముగ
గంటిరి పసిపట్టి; కతమేమినేడు 'క
నాను' కూపమున మీ నందనుండు
కడు దగ్గరగ దాచబడియుండ నెరుగరు?''

అనవిని యాకూబు ననియె నిట్లు :

''క్షణికములు మాపనులు శంపగతి; నొకప్పు
స్వర్గముననుందుము; మరొక్క క్షణమునందు
కాలిమడమను గనలేము; జ్ఞాని స్వవిధి
వర్తిల నిహపరాతీత పదవినొందు.

# 10

నేనొక సమయమున బాల్ఖకు నగరపు మసీదునందు నీతిబోధకముగ నుపన్యసించు చుంటిని. అచ్చటి శ్రోతలు నీరసులుగను, మృత హృదయులుగను, లౌకిక విషయాసక్తులుగను, పరచింతా శూన్యులుగ నుండిరి. నా యుత్సాహము ఉద్రేకము వారి నంటు కొనలేదనియు, నా వేదనాగ్ని పచ్చి కట్టెలవంటి వారి హృదయముల దరి కొల్పబోదనియు గనుగొంటిని. పశుప్రాయుల శిక్షణమున విసిగి వేసారితిని. గ్రుడ్డివారికి నద్దము చూపుట వ్యర్థమని తెలిసికొంటిని. అయినను వ్యాఖ్యాన ద్వారము తెరువబడినది. వాక్ప్రవాహము తుంపెసలు గొట్టినది. "మేము మనుష్యులకు తమ కంఠములోని రక్త నాళముకంటె సమీపముగ నున్నాము" అను ఖురాను సూక్తిని వివరించుచు నిట్లు చెప్పితిని :

> చెలి నాకంటెను నాకుదగ్గరిదియై చెన్నారు; నట్లయ్యు లో
> దలపం జిత్రము! కామితార్థమునకుం దవ్వాయె జిత్తంబు: ఈ
> కొల కే నేమియొనర్తు? నేరికడ నాకుందున్ నివేదింతు? నె
> చ్చెలి నాకౌగిటనుండియున్ విరహినై చింతింతు నశ్రాంతమున్.

ఈ వాక్యాసవమును గ్రోలి నేను మత్తుగొంటిని. పానపాత్రలోని ద్రాక్షారసము ఇంక కొంత శేషించియుండగనె యొక బాటసారి యీ సభ ప్రక్కన పోవుచుండెను. ఆ వాక్ప్రవాహపు గడపటి తరంగములు ఆతని దాకెను. వేదనాభరితుడయి యా బాటసారి మూల్గెను సభ్యులంద

రును ఆతని ననుసరించి మూల్గిరి. అంతట నేను భావోద్రేక ముతో నిట్లంటిని: "దేవుడు స్తుతింపబడుగాక! దూరస్థుల యినను ప్రాజ్ఞులు జ్ఞానముచేత సన్నిహితులుగనుందురు. సమీపవర్తులయ్యును, అజ్ఞులు మూఢత్వమువలన దూరస్థు లగుదురు"

భావములు శ్రోతలకు బోధపడకయున్న
వక్తశక్తిలోపంబని పలుకవచ్చు;
విరివిసేయుము నీ కోర్కె వీవి, నందు
వక్తృతా కందుకముగొట్టు పండితుండు.

# 11

మక్కాకుపోవు మార్గమున నిసుక యెడారియందు నొకరాత్రి నిదుర లేనందున అడుగెత్తిపెట్టుటకు శక్తిలేక యొకచోట గూలబడి "నా గతికి నన్ను వదలిపెట్టు"మని ఒంటెవానితో చెప్పితిని.

ఒంటెయే గమన శ్రమకుమ్మలింప
నెంతదూరమ్ము తెరువరి యేగగలడు?
బలిసినయతండు కృశియించి పడకమున్నె
బక్కవాడు కష్టంబుల జిక్కిమడియు.

"సోదరుడా, మక్కాముందున్నది. దారిదోపిడి గాండ్రు వెనుకనున్నారు. నీవిప్పుడు పయనింతువేని బ్రతుకు దువు. శయినింతువేని మరణింతువు. పెద్దలు చెప్పిన యీ వాక్యమును నీవు వినలేదా" యని యొంటెవాడిట్లనియెను:

రాత్రివేళ నెడారి మార్గంబునందు
బయనమగుచుండి, చల్లగా బాటప్రక్క
చెట్లక్రిందను నిద్రింప జెలగు సుఖము,
కాని ప్రాణంబుపై అన మానవలయు.

## 12

పెద్దపులిచేత గాయపడి సముద్రతీరమున కూర్చుండి యుండిన యొక పుణ్యాత్ముని చూచితిని. ఎట్టి పూతమందు వలనను ఆతని గాయముమానకుండెను. కొంత కాలము దాని బాధతో కష్టపడుచు సర్వేశ్వరునికి నిరంతరము వందనము లర్పించుచుండెను.

"ఏల వందనములర్పించుచున్నావు?" అని కొందర డిగిరి. "ఏలయన, దురదృష్టమునకు పట్టుపడితినేగాని పాపమునకు పట్టువడ లేదుగదా యని దేవుని కీర్తించుచు న్నాను" అని ఆ పుణ్యాత్ముడు చెప్పెను.

ఆ ప్రియుస్నేహితుడు నన్ను నంతకునకు
నొనగినను బ్రాణభీతితో నుమ్మలింప;
మీ యెడదనొవ్వ నీదాను డేయఘంబు
నలిపెనోయన్న చింతయే కలచుమదిని.

నిజముగా దైవభక్తులు పాపమునకంటె కష్టమునే కోరు కొందురు. "వారు నావలన కోరిన దానికంటె చెర బడుటయె మేలుగా తోచుచున్నది" అని యిటువంటి సందర్భమున యూసబు చెప్పిన వాక్యము నీవెరుగవా?

# 13

ఆవశ్యకమైన కార్యము తలపడి యొక దరిబేసి మిత్రునింట కంబళిదొంగిలించి దానిని విక్రయించి తన యక్కఱ గడపుకొనెను. దండనాధికారి వానిచేయి తెగ గొట్టుటకు ఆజ్ఞాపించెను.

అంతట మిత్రుడైన కంబళి సొంతదారు జాలిగొని "ఆతని మన్నించితిని. శిక్ష నుపసంహరింపుడు" అని అధి కారిని ప్రార్థించెను. "నీవు వత్తాసివచ్చినను దండనీతిని జవదాటను" అని అతడుపల్కెను. "తమరు సెలవిచ్చిన దంతయు యధార్థమె, అయినను దానధర్మ ములకై నిర్ణీత మైన ద్రవ్యమునందు ఏదోకొంచెము దొంగలించిన యతడు చేయి తెగగొట్టవలసినంత కఠినశిక్షకు పాత్రుడుకాడు. ఏలయన, ఫకీరునకు సొంతమైనది యేదియు లేదు. దరిబేసుల కాస్తి యుండినను అది అక్కఱగలిగినవారికిగూడ సొంత మైనదిగనుండును" అని యా మిత్రుడు విన్నవించెను. ఆ మాటలకు అధికారి సంతసించి దరిబేసి శిక్ష నుపసంహరించి వానిని చీవాట్లుపెట్టి యిట్లనియెను: "ఇటువంటి ప్రాణస్నే హితుని యింట తప్ప దొంగిలించుట కింకెచ్చటనైన వీలు లేక లోకమంత గొడ్డుపోయినదా యేమి?"

"పెద్దలు చెప్పిన యీ వాక్యమును తమరు విన లేదా! కాని యింటి కడపనైన త్రొక్కకుము. చెలికాని యిల్లు చూరగొనుము."

కష్టసంప్రాప్తికి మనంబు కలతచెంది
బలము ధైర్యంబు విడుచుట పాడికాదు;
మరి, విరోధుల వీపు చర్మంబు, స్నేహి
తుల యొడలిపైని చొక్కాయి నొలిచికొమ్ము.

# 14

పాదుషా యొక పుణ్యాత్మునిగాంచి "మేమెప్పుడైనను మీకు జ్ఞప్తికి వచ్చుచుందుమా?" యని ప్రశ్నించెను. "అవును, మేము దేవుని మరచినప్పుడు మాత్రము" అని ఆ పుణ్యాత్ముడు జవాబు చెప్పెను.

కడకు నీద్వారమునమండి క్రమ్మరింప
బడన సరు డన్నిదిక్కుల బమ్మరించు;
నీవు చేరబిల్చినవాని నిక్కువముగ
ఇతర గేహాళి యాచింపనీవు దేవ.

# 15

పాదుషా స్వర్గమునందును, దరిబేసి నరకమునందు నుండినట్లు ఒక పుణ్యాత్ముడు కలగనెను. "పాదుషా ఉత్పతనమునకును దరిబేసి యధఃపతనమునకును కారణమేమయ్యుండును? సాధారణముగ లోకులు తలంచుదానికంటె యిది విపరీతముగనున్నది" అని యాతడనెను. "పాదుషా దరిబేసులపై గల ప్రీతిచేత స్వర్గముననున్నాడు. దరిబేసి పాదుషా సాంగత్యమువలన నరకముననున్నాడు" అని ఆకాశవాణి పలికెను.

అంగి జపమాల బొంతయు నమరియున్న
లాభమేమౌను దుష్కార్య లంపటునకు?
సుగుణుడౌ దరిబేసి దాల్చుకొనవచ్చు
దురికిదైన గుళ్లాయి తా త్తరిదియైన.

# 16

కూఫా నగరమునుండి వచ్చుచున్న యొక బాటసారి మక్కాయాత్ర చేయుచుండిన మా బిడారమును గలసికొనెను. ఆతని కాళ్లకు చెప్పులుగాని తలకు కుళ్లాయిగాని లేదు. దారిబత్తెమయిన తెచ్చుకొనలేదు. అతడు సంతోషముతో దారి నడచుచు నిట్లు పలికెను:

ఒంటెనెక్క, భారముమోయ నొంటెపోల్క;
ప్రజల బాలింప, ప్రభునకు బంటుగాను;
గతమునకు నుమ్మలింప, ప్రస్తుతపు జింత
నెరుగ, హాయిగా గడపెద నెపుడు బ్రతుకు.

"ఓ దరిబేసీ, యెచ్చటికి పోవుచున్నావు? గమన ప్రయాసముచే మరణింతువు. వెనుకకు మరలుము" అని యొక యొంటెరౌతు చెప్పెను. దరిబేసి యా మాటలు వినక యెడారిదారి పట్టెను. మహమ్మదు ఖర్జూరపుదోట కడకువచ్చు నప్పటికి ఒంటెరౌతు మరణించెను. దరిబేసి యాతని తలగడకడ వంగి యిట్లనియెను: "నేను కష్టము పాలయ్యును బ్రతకియున్నాను. నీవు ఒంటెపై నెక్కివచ్చియు మరణించితివి."

ఒక్కడు వ్యాధితునకు గా
బొక్కుచు నిసియెల్ల నేడ్చి ప్రొద్దున మడిసెన్;
మొక్కవలె గూరుచుండెను
పక్కపయిన్ రోగి వ్యాధిబాగయి తుదకున్.

జవము సత్వంబు గలుగు నశ్వములు బడల
నలనగతి గుంటిగాడిద యంచె జేరె;
ఎందరో దృఢకాయులు ప్రమందినారు.
క్షత శరీరుడు జీవించె గంటిమాని.

# 17

సుల్తాను ఒక భక్తుని తన దివాణమునకు ఆహ్వానించెను. ఆ భక్తుడిట్లు తలపోసెను: ''నేను మందుతిని కొంచెము బలహీనుడ నయ్యేదను. అందువలన సుల్తానుకు నాయందిప్పుడున్న విశ్వాసము మరింత హెచ్చగలదు.'' అతడు పొరపాటున విషగుటిక మ్రింగి చచ్చెనని చెప్పుకొనిరి.

ఉల్లి విధంబున బయిపయి
బెల్లుగ నుడుపులను దొడిగి పిస్తావలె మే
నెల్లడ గండగలిగి సొం
పెల్లెడు దరిబేసిగంటి వేసవు బెద్దన్,

ప్రజకు మొగమును వీపు 'కాబా' కు జూపి
ప్రార్థనముసేయు దరిబేసి ప్రకటనేచ్ఛ;
దైవభక్తుండవై కొల్వ దలతువేని
దైవమును దప్ప వేరొండు దలపనేల?

# 18

సార్థవాహులు యూనాను దేశమున పయనించుచుండ బందిపోటు దొంగలు వారి నడ్డగించి లెక్కకు మిక్కుటమైన ధనమును కొల్లగొట్టిరి. ఆ వర్తకులు లబోదిబోయని యేడ్చుచు దైవమును పైగంబరులను ఎంత ప్రార్థించినను ప్రయోజనము లేకపోయెను.

వారి దోపిడిగాండ్రకు ధనచయంబు
చేత జిక్కిన రాబట్టు సేతగలదె ?
సార్థవాహుల కన్నీటిజడి కొకింత
కరుణ గల్గునె చోరుల కటికి యెదల!

ఆ బిడారునందు సుప్రసిద్ధ నీతివేత్తయగు లకుమాను౦డెను. "ఈ దొంగలకు నీతి మాటలతో కొంత బుద్ధి చెప్పిన యెడల ఒక వేళ వారు అపహరించిన ధనములో కొంత భాగమైన మాకియ్యవచ్చును. లేకున్న నింత ద్రవ్యమును పోగొట్టుకొనుట చాల పరితాపకరముగ నుండును" అని యొకవర్తకుడు చెప్పెను. "ధర్మాధర్మములను అటువంటి మనుష్యులకు చెప్పుటకూడ చాల విచారకరముగ నుండును" అని లకుమాను బదులు చెప్పెను.

పత్ర పశువుతో రాయబడియు ద్రుప్పు
దిన్నలోహంబు మెరుగార దీర్పబడునె?
నీతి కొరయె మలిమస చేతసులకు ?
ఇనుపమేకును రాతిపై జొనుప దిగునె ?

ధనముగలనాడె బీదల దనువు; వారి
యిచ్చు లీడేర్తువేని నీయిడుమ లుడుగు;
యాచకుల కిమ్ము లేదన; కట్లుగాక
ధనమును నిరంకుశుండూడ్చుకొను నొకప్డు.

# 19

పరమపదించిన మా గురువు అబుల్ ఫరజ్ బిన్ జూజి నేను దరిబేసుల సంగీత గోష్ఠులకు పోగూడదనియు కార్య భారము వహింపక యేకాంతముగ కాలము గడపవలయు ననియు నొక్కి చెప్పియుండెను. కాని, యౌవన సహజమైన చాపల్య మగ్గలించి లౌకిక విషయేచ్ఛలకు లోనయి ఆచార్యుని యభిప్రాయమునకు విరుద్ధముగ కొంత సంచరించితిని. ఆటపాటల సంతోషమున మునిగి తేలుచుంటిని. గురుని హితవాక్యములు మనస్సునకు వచ్చినప్పు డిట్లనుకొను చుంటిని :

మాతోడ ఖాజి యుండిన
జేతో ముదమతిశయింప జేతులు విసరున్;
ప్రీతిగమత్తు క్షమించును
ఆతరి ధర్మాధికారి యాసవ మానన్.

ఒకనాడు సాయంకాలము వరకు ఆ సమాజమున కలసిమెలసి తిరుగుచు నందొక గాయకుని కాంచితిని.

అతడు సారంగిపై నాడించెడు కమాను
ధమనుల సడలించు దారుణముగ;
గాన వైఖరియును గంర నినాదంబు
తండ్రి చావున కేడ్చు తనయుకూయి

కొంత మేలనిపించు; గొందరు వినుగొంది
 వ్రేళ్లు చొప్పించిరి వీనులందు;
జాలించుమనిచెప్ప సంజ్ఞగా నొకసారి
 పెదవిపై వ్రేలిని బెట్టికొనిరి.

మధుర కంఠస్వరానంద మగ్నమగుచు
నంతరంగము పాతవశ్యమును బొందు
గాని, నీవంటి దౌర్భాగ్య గాయకుండు
ఊరకుండిన సంతోష మొదవుమాకు.

నీ పాటయు పద్యము విన
జెపడెనే ప్రమదమెవని చిత్తమునందున్?
నీ పోకకు మా యుల్లము
తాపము విడి చల్లవడును, దలగుమవేగన్.

పాట విన్నయంత భగవంతుని స్మరించి
యింటి స్వామితోడ నిట్టులంటి:
దూది దెమ్ము చెవుల దోపుదు, లేకున్న
తలుపుదెరవు మేను వెలికి జనుదు.

వేయేల మిత్రుల యభీష్టానుసారముగ కష్టముతో
ఆ రాత్రి నెటులో వెడల బుచ్చితిని.

అదను దెలియక మేల్కొని యరచుచుండె
నిద్ర మాంద్యమ్మున మునాది; నీవు నాదు
రెప్పలను బట్ట చేయుము రేయినిడివి,
క్షణము సేపైన నిద్దుర గాంచియెరుగ.

తెల్లవార, లేచి మొలపట్టనుండి యొక దీనారమును,
తలపైనుండి తలపాగయు తీసి ఆశీర్వాద పురస్సరముగ ఆ

గాయకుని యెదుటపెట్టి యాతని కౌగలించుకొని నా కృతజ్ఞ తను తెలుపుకొంటిని.

ఆతనియెడ నా ప్రవర్తనము ఆచార విరుద్ధమని స్నేహితులు నా తెలివిమాలిన తనమునకు లోలోపల నవ్వు కొనిరి. వారిలో నొకడిట్లు నిందింపసాగెను: "నీ వొనర్చిన కార్యము ప్రాజ్ఞ సమ్మతముగాదు. పెద్దల కుచితమైన తల పాగను ఇటువంటి గాయకున కొసంగితివి. వాని జీవిత కాలమునందెన్నడైన నొక దీనారమును సంపాదించి యుండడు. బంగారు రాపాడి డక్కీకి అతికించి యెరుగడు. ఎవనిని రెండుమారు లొకచోట కాంచలేమొ యట్టి గాయ కుడు ఈ యానంద మందిరమునకు దూరముగ నుండుగాక!"

రోమములు నిక్కపొడుచును
ఏ మనుజునకైన వాని యెలుగును విన్నన్;
మా మనము పొగులు; బులుగులు
వేమరు గీగావటంచు వెరగొని యార్చున్.

"నీవు నన్ను తూలనాడక యూరకుండిన మేలుగ నుండును. ఆ గాయకుని మహిమ నాకు గోచరమైనది" అని నేనంటిని.

"ఆ మహిమ యెట్టిదో నాకు దెలుపుము. నేనును ఎగతాళి చేసినందుకు ఆతని యొద్దకుపోయి క్షమింప వేడు కొందు" నని మిత్రుడు పల్కెను. ఆ మాటలకు నే నిట్లంటిని: అది యెట్టిదనగా, దివంగతుడైన మ్యాగ్నిఫ్యు

దరిబేసుల యాటపాటలలో చేరవద్దని నాకు పలుమారు బుద్ధి చెప్పియుండెను. అయినను అదృష్టవశమున నిన్నటి రాత్రి నే నిచ్చోట నడుగిడునంతదనుక గురువొసగిన నీతిలోని ప్రయోజనము నాకు గోచరింపకుండినది. ఇది మొదలు నా జీవితాంతము వరకు నెప్పుడైన దరిబేసుల నృత్యమునందును ఆలపాటలయందును పాలుగొననని ఆ గాయకుని చేతిలో చేయివేసి యొట్టు పెట్టుకొంటిని.

తేనెవాతెర పువుబోణి తియ్యబలుకు
రాగయుతమైన గాకున్న రమ్యమగును;
ఎట్టి సంగీత ఫణితియు నీ పిశాచ
గాయకుని నోట వెడలిన గ్రాచునెదను.

# 20

లోక ప్రసిద్ధ నీతివేత్తయగు లకుమానును "నీవు మట్టుమర్యాద లెవరివలన నలవరచుకొంటివి" అని కొందరు ప్రశ్నించిరి.

"మట్టు మర్యాద లెరుగని వారినుండి నేర్చుకొంటిని. వారి నడవడియందు నాకేది సమ్మతము కాదో అట్టి దానిని నే నాచరింపక వదలితిని."

హాస్యముగనైన నొకమాట యన్నయంత
ప్రాజ్ఞులందుండి నీతిని బడయుచుంద్రు.
నూరు పన్నాల నీతులు నూరిపోయ
నజ్ఞు డెగతాళిగా దాని నవగణించు.

# 21

ఒకానొక భక్తుడు రాత్రిపూట పది మణుగుల యన్నముతిని ప్రొద్దుపొడుచు వరకు ఖురాను పారాయణము చేయుచుండెనని కింవదంతి యుండెను. ఆ వృత్తాంత మొక పెద్ద మనుష్యుడు విని యిట్లనియెను: "సగము రొట్టెయే తిని రాత్రియంతయు నిద్రపోవునేని అంతకన్న చాల మేలుగ నుండును."

జ్ఞాన దీప్తులు నీలోన జడలుకొనగ
ఉదరమున కొంత రిక్తమై యుండవలయు;
ఎరుక నీయందు శూన్య, మదేలయన్న
ముక్కువరకు నాహారంబు మెక్కెదెపుడు.

# 22

అధర్మ ప్రవర్తనము వలన దైవ మార్గమునకు వెలియైన యొక పతితుడు సర్వేశ్వరుని నిర్హేతుక కృపాకటాక్ష వీక్షణ ప్రదీపము దారిచూప, సన్మార్గ వర్తియయి పుణ్యాత్ముల సంఘమున చేరెను. వారి భక్తి విశ్వాసముల ప్రభావము వలన ఆతనికి దుఃస్వభావము మారి సత్కార్యాచరణము పట్టువడెను. లౌకిక భోగేచ్ఛలపై అతని చిత్తమును పరుగెత్తనీయక మట్టుపరచుకొనెను. అయినను లోకులు "అతడు పూర్వ విధముగనె యున్నాడు. ఆతని భక్తి శ్రద్ధలు కేవలము నాటకము" అని నిందింపసాగిరి.

అనుతాపంబున ప్రార్థన
దనకుత్కట దైవశిక్ష దప్పినదప్పున్;
మన మేర్చు కాకిలోకుల
మొనవాలుక పోటుదాటి పోవఁగవశమే!

అతడు లోకుల యాడికోలు సహింపనోపక మరల గురువునొద్ద తన సంగతి నిట్లు మొర పెట్టుకొనెను: "మహాత్మా, జనులు నన్నుగూర్చి చెప్పుకొను మాటలు వినివిని క్రుళ్లి కృశించుచున్నాను."

దానికి గురువిట్లనియెను: "అంత మేలుచేసినవారి ఋణము నీవెట్లు తీర్చుకొనగలవు? ఏలయన వారు నిన్ను గురించి తలచునంతకంటె నీవు శ్రేష్ఠుడవుగనున్నావుగద!

ఈనుబోతులు, కీడునెంచెడివారు
నన్ను దూషింతురు, నా రక్తపాత
మునకు నిరీక్షింతురని పల్కెదీవు!
చెడ్డమానిసివయ్యు శ్రేష్ఠుండవనుచు
అఖిల మానవులు నిన్నగ్గించుకంటె
నన్మార్గినై నింద సహియింపమేలు.

మరి నా సమాచారము. నేను సద్గుణ పరిపూర్ణుడ నని ప్రజలు నాయెడ పూజ్యభావముతో వర్తింతురు. సత్యము నరసిన, నాకును లోపములుగలవు. వానిని గురించి తలపోసికొనుచు దుఃఖ భాజనుడనై యున్నాను.

నాదులోపము ప్రజకు గన్పడనియట్లు
వాకిలినిమూసితినిగాని వాలకమున
అనిశ మంతత్పహిస్నాకివైన నీవు
గనకయుండ దలుపుమూయగలమె దేవ!

# 23

నేనొకనాడు పూజ్యుడైన మతగురువునొద్దకు చని యిట్లు మొరపెట్టితిని: "ఫలానివాడు నేను తగవులమారి నని సాక్ష్యము చెప్పెను." అందుకు గురువిట్లనియెను: "నీ శాంత స్వభావముచే వానిని సిగ్గుపరచుము."

చెడుగు తెంపరి నినుగాంచి చెనకలేని
యటుల సన్మార్గవర్తివై యలరుమీవు;
తగినశ్రుతిలోన వల్లకీతంత్రిపలుక
వైణికుండేల చెవినొక్కి పట్టిత్రిప్పు.

# 24

సూఫీమత తత్త్వమేమని కొందరు ఒక మత గురువు నడిగిరి. ఆయన యిట్లు చెప్పెను: "ఇంతకు పూర్వముండిన సూఫీలు బాహ్యమునకు దారిద్ర్యమనుభవించుచు కష్టపడు చుండినట్లు అగపడినను యథార్థముగ మనశ్శాంతి గలిగి తృప్తులై యుండెడివారు. ఇప్పటివారన్ననో బాహ్యమునకు శాంతచిత్తులుగ నగపడుచు లోలోపల చీకాకు పడు చుందురు."

ప్రతినిమేషము చిత్తంబు బయలుచనగ
దపసి నిర్మలస్వాంతుడై తనియగలడె?
భోగభాగ్యవాణిజ్యముల్ పొదలుకొనియు
దైవసంసక్త హృదయుండు తపసియగును.

# 25

రాత్రియంతయు సార్థవాహుల బిడారుతోడ నడచి నడచి వేగుజామున నేను ఎడారియోర నిద్రించిన సంగతి యిప్పటికిని నాకు జ్ఞప్తియున్నది. (దైవ) విరహవేదనా భరితుడగు సత్పురుషుడొకడు మా బిడారుతో కలసికొని పయనించుచుండెను. ఆతడు ఆనాటి వేకువ లేచి యెలుగెత్తి కేకలువేయుచు నెడారి మార్గమున భ్రమ్మరుచు నొక్క క్షణమైన చిత్తశాంతి యెరుగక వేదన ననుభవించు చుండెను. మరుసటిదినము, "నీకేల యీ యవస్థ పట్టెనదని యడిగితిని. ఆతడిట్లు బదులు చెప్పెను: "చెట్లపయి బుల్బులి పిట్టలు కర్ణపేయముగ గానము సేయుచుండెను. కొండలందు డేగలు ఈల వేయుచుండెను. నీటిపడియలందు భేకములు బెకబెకమని యరచుచుండెను. వనములందు జంతుసంతా నము రొదపెట్టుచుండెను. ఈ విధముగ ప్రాణిలోకమం తయు సృష్టికర్తను ప్రశంసించుచుండ నేను మాత్రము ఇట్లు మందమతినై నిద్రపోవుచుండుట సమంజసము గాదని భావించుకొంటిని.

నిన్నటివేకువజ మనసు నీరయిపోబులుగొండుపాడిసఁజ
నన్నగిలెఁజ వివేకము ప్రశాంతియు కాంతియు శక్తిమోద, మా

పన్నుడనైన నా గళరవంబు వినంబడినంత, మిత్రుడో
యన్న, విహంగకూజితము లాగతినార్తునిజేసెనే నినుఁ.

ఇది యెటు నమ్మనౌననిన నేనిటువల్కితి: నోయిమిత్ర, స
మ్మదముగ జకిసంతతులు మోహను నా భువనేశ్వరుఁ రసా
స్పద కమనీయగీతములుపాడి నుతింపగ, నేనుమూగనై
పడరక యూరకుంట యది పాడియె? ధర్మమె మానవాళికిఁ.

# 26

ఒకానొక సమయమున హిజ్జాజుయాత్రయందు సజ్జనులైన కొందరు యువకులు మాకు దారితోడయిరి. వారును మేమును పొరపొచ్చెములెరుగని నెయ్యముతో కలసి మెలసి ప్రవర్తించుచుంటిమి. వారొకప్పుడు పాటపాడుచు మరియొకప్పుడు స్తోత్రపాఠములు చదువుచుండిరి.

మా తోడ వచ్చుచుండిన యొక పుణ్యాత్మునకు ఈ పద్ధతి యింపితముకాలేదు. ఆయనకు దరిబేసుల కష్టనిష్ఠురములందు నేమాత్రమును సహానుభూతిలేదు. ఇట్లుండ మేమందరమును హులాల్ సంతతివారి ఖర్జూరవనము చేరితిమి. 'హుయ్యా' యను నొక యరబ్బి తెగకు చెందిన నల్లని పిల్లవాడొకడు అచ్చటి కరుదెంచి వీనుల విందుగా రాగము నాలపించెను. ఆ గానము నాలకించి యాకాశము లోని పక్షులు సైతము ఎగురక నిలిచిపోయెను. ఆ పుణ్యాత్ముడెక్కి వచ్చుచుండిన యొంటెయు గానపారవశ్యమున నృత్యము సలుపుచు ఆతని క్రింద పడద్రోసి యెడారిమార్గమున పరుగెత్తెను. ఆయన దగ్గరకుపోయి నేనిట్లంటిని :

"మహాత్మా, ఆ గానము జంతువును సైతము ఆనందపుల కితముగ నొనర్చినది. కాని అది నీ హృదయమునందు ఏలాటి మార్పును కలిగింపలేకపోయెను!"

ప్రత్యూషంబున బుల్బులి పలికె: ప్రణయ
మెరుగనేరవు నీవేమి నరుడవోయి,
ఒంటెయు నరబ్బిపాటకు నుబ్బియాడ
బసువవో నీవు నిర్వృతి బడయలేవు!

కనులకుగట్టు సర్వము వికస్వరకంఠమునెత్తి యీశ్వరుజా
వినుతియొనర్చు; చెల్లమగు పీనులుగల్గిన దద్రహన్యముల్;
పొనరుగులాబిపూవు నెక బుల్బులెకాదు నుతించుచుంట, దే
వుని బొగడంగనాల్కయగుచో ప్రతికంటక మీవనంబునన్.

# 27

ఒకానొక నరపాలునకు ప్రాణావసానకాలము ఆసన్న మాయెను. తనకు వారసులెవ్వరును లేరు. కావున నాతడిట్లు వుయిలునామా వ్రాసి మరణించెను: "నేను మరణించిన మరునాటి ప్రొద్దున మొట్టమొదట నెవడు ఈ పట్టణము ప్రవేశించునో వానికి కిరీటధారణము గావించి రాజ్యమంతయు నప్పగింపవలయును."

విధివశమున మరునాటివేకువ నొక బిచ్చగాడు మొట్టమొదట పట్టణము ప్రవేశించెను. వాడు తన జీవితమంతయు భిక్షాన్నము భుజించుచు చింపిరి పేలికలు బొంతగా కుట్టుకొని కప్పుకొనుచుండెను. మంత్రులును

ఆస్థాన సచివులును వృయులునావమా ప్రకారము కోశాగార దుర్గముల కుంచెకోలలు ఆతనికి స్వాధీనపరచిరి.

కొంతకాల మా దరిబేసి రాజ్యపరిపాలనము చేసెను. తరువాత కొందరు సామంతులును రాష్ట్రాధిపతులును స్వతంత్రులయి సైన్యముల సమకూర్చుకొని యుద్ధసన్నద్ధులైరి. ఇంతయేల, యాతని యసమర్థపాలనమువలన రైతులకును, సిపాయీలకును తలప్రాణము తోకకువచ్చినది. రాష్ట్రము లోని కొన్ని ప్రాంతములు తిరుగబడి తల్లిరాజ్యమునుండి విడబడియెను. ఇవి యన్నియు తలపోసికొని ఆ యాంచక చక్రవర్తి కుమిలి కూలుచుండెను. పూర్వదశలో తనకు స్నేహితుడుగానుండిన యొక దరిబేసి యాత్రనుండి మరలి వచ్చి యాతని యున్నత స్థితికి సంతోషించి యిట్లనియెను "నీకు అభ్యుదయమును చేకూర్చి సర్వసంపదలను రాజ్యమును హస్తగతము గావించి, నీ గులాబిపువ్వులను ముండ్లనుండియు, ముల్లును కాలినుండియు తీసివేసిన సర్వేశ్వరునికి వందనము లర్పించుచున్నాను."

మొగ్గలొకవేళ వికసించి ముదముగూర్చు;
వేరొకప్పుడు వసివాడి వృంతమెడలు;
విగతపత్రంబులైయున్న వృక్షలతలు
మఱల నాకుల బువ్వుల మురువుచూపు.

అంతట రాజిట్లనియెను : "మిత్రమా, నన్నభినందించుటకంటె నోదార్చుటకె యిది సరియైన తరుణము. పూర్వము నన్ను నీవు చూచినప్పుడు అన్న చింత యొక్క

'టియె నన్ను పీడించుచుండెను. ఇప్పుడన్ననో రాజ్య భార మంతయు వహించుచున్నాను."

లోకము విరోధమైనను
శోకము, ననుకూలమైన సుఖబంధనముం
జేకురు; రెంటను గష్టమె
దూకొను నరు; డంతకన్న దుఃఖముగలదే?

కోరెదవేని సంపదలు, కోరుము తృప్తిని; దానికన్న బం
గారము మేలుగాదు; కనకంబు ధనాఢ్యుడు పంచిపెట్టినం
గూడకు మాన దానిపయి; గొప్పమనుష్యులు సేయు ద్రవ్య స
త్కారముకంటె బూజ్యముగదా చరిబేసి తితిక్ష పోల్పగన్.

అలబహరాముని విందున
వలచెడు వనఖరపుటెరచి బలువేపుళ్ళుం
దలపోయ జీమ యొనగెడు
శలభపు దొడమాంసమునకు సాటియె యొందున్!

# 28

అబూహరీరా ప్రతిదినము మహమ్మదు ముస్తఫాను సేవించుటకు వచ్చుచుండెను. ఒకనాడు మహమ్మదు ఆయ నతో నిట్లు చెప్పెను: "నీవు ప్రతిదినమును నాయొద్దకు రాకుందువేని మన స్నేహము మరింత గాఢమగును."

కొందరా పుణ్యాత్మునితో నిట్లనిరి: "సూర్యుడు సౌందర్య శోభితుడయ్యెను తన్నెవ్వరును ప్రేమించినట్లు మేము వినలేదు." దానికాతడిట్లు పలికెను: "ఏలయన

సూర్యుని మనము ప్రతిదినమును చూడగలుగుచున్నాము. వర్షాకాలమున రవిబింబము మబ్బు ముసుగులో మరిగియున్న పుడు దానికై మనము నిరీక్షించుచుందుము. అప్పుడది ప్రేమపాత్రమగును. ''

ఒరుల దర్శింపబోవుట యొప్పెయగును;
గాని, పలుమారుదర్శింప గలుగు వెగటు;
ఒరులు నిను మందలింపకయుండునటుల
నిన్ను నీవె విమర్శించు కొన్నమేలు.

# 29

దిమిష్కనగరమున నా మిత్రుల సాంగత్యముపై రోతపుట్టి పుణ్యభూమి ప్రవేశించి యచ్చట మృగములతో సహవాసము నెరపుచుంటిని. ఇట్లుండ నొకనాడు ఫరంగులు నన్నుపట్టి బంధించి తిరాబలీస్ పట్టణమునకు కొనివచ్చి కొందర యూదులతోడ నన్నును కందకము త్రవ్వపనియందు నియోగించిరి.

నాకు పూర్వపరిచితుడైన హాలబ్ పట్టణపు సరదారి యొకడు ఒక దినము మేము మట్టిపనిచేయుచుండిన ప్రదేశమున పోవుచుండిన నన్నుగాంచి ''ఈ దుర్గతి నీ కేలపట్టినది'' యని యడిగెను. నేనిట్లంటిని : ''ఏమిచెప్పుదును !

దైవమునకన్న నన్యులు
సేవింప ననర్హులగుట, జెచ్చెర ప్రజలం

బోవిడి కొండ లెడారులు
తావలముగనుంటి శాంతి దైవారంగన్.

ఇప్పటి నా దురవస్థను
దప్పక యూహించుకొనుము; దైవంబేలా
యిప్పగిది బశుసమానులు
మొప్పెలతోగూడి బ్రతుక బొసరిచెనన్నున్.

పరులంగూడి సుగంధపు
విరిదోట జరించుకంటె, బ్రియమిత్రులముం
దర నిగళ బద్ధ పదుడయి
తిరుగుట సంతసమటంచు దెలియవె సఖుడా.''

అంతట నాదురవస్థకు కనికరించి నా మిత్రుడు పది దీనారములకు ఫరంగులయొద్ద నన్నువిలిచి కైదుతప్పించి హాలబ్ పట్టణమునకు తీసుకొనిపోయెను. ఆయన కొక్క కూతురుండెను. ఆ యుచతిని నాకిచ్చి పెండ్లిచేసి యరణముగ నూరు దీనారముల నొసంగెను. కొంత కాలము గడచెను. నాయిల్లాలు వాయాళియు గయ్యాళియు తగవుల మారియునైనది.

మాతులు పొడిచెడి యిల్లా
లేతని కొనగూడు వానికిల నిరయంబౌ;
ఓ తండ్రి, యట్టి జంతను
మాతల బెట్టకయ కరుణ మనసీయగదే.

ఒకనాడు నాభార్య నోటికి వచ్చినట్లెల్ల అరచుచు నిల్లు తిట్టుటకు మొదలుపెట్టెను: "నీవు ఫరంగివారియొద్ద

బానిసవై యుండ మా తండ్రి నిన్ను పది దీనారములకుకొని కైదు తప్పించెను కదా ! ”

“ అవును, పది దీనారములకు ఫరంగివారియొద్ద విలువబడి, కైదు విడిపింపబడి, మరల నూరు దీనారములకు నీచేత పట్టువడిన మందభాగ్యుడను నీనే ” యని యంటిని.

> వృకవక్త్రంబున జిక్కియున్న యజమాన్ వేవేగరక్షించి, యిం
> టికి గొంపోయి వధించె దానిని నిశన్ నిశ్చింతుడై యొక్క క
> ర్షకు; డాజంతువునాత్మ యిట్లనియె స్వర్గంబేగుచో వానితోన్;
> వృకబాధం దొలగించియున్ వృకమవై పీడించితేనన్ దుదిన్.

# 30

ఒకానొక పాదుషా బహుకుటుంబియగు నొక పుణ్యాత్ముని చూచి “ నీ వెట్లు కాలముగడపుచున్నావు ?” అని యడిగెను.

“ రాత్రి యంతయు ధ్యానమునందును, వేకువ ఆవశ్యకముల గురించిన ప్రార్థనమందును, పగలెల్ల దినబత్తెము గడిపించుకొనుట యందును నా కాలము గడచిపోవుచున్నది” అని యాతడు జవాబు చెప్పెను.

పాదుషా యా మాటలయందు, ధ్వనించు భావమును గ్రహించి కుటుంబ పోషణాభాగము తొలగునటుల ఆ పుణ్యాత్మునకు బత్తె మొసగ నాజ్ఞాపించెను.

చిరము కుటుంబ వాగురలఁ జిక్కిన మిత్రుఁడ, నీకు నింక నె
త్తెర గలవేకగల్లు; తిన దిండియు గట్టను గప్ప బుట్టముల్
దొరకవటన్న చింత, యొక దొడ్డైకు బిడ్డలఁబెంచు చింత, యి
ద్ధరణికిలాగు నిర్జర పథంబున నేగు మహాత్మునెనియున్.

ధ్యానము సల్పుదున్ నిశను దైవమునందు బహల్వజింతు; నే
ధ్యానము సేయరేయి శుచియైన మనంబున గూరుచుండ మ
న్మానసమున్ నిరంతరము మల్లడి వెట్టును రేపు ప్రొద్దునన్
దీనతనేడ్చు బిడ్డలకు దిండియెటో గదె యన్న భావముల్.

# 31

ఒకానొక తపస్వి యెడారియందు నివసించుచు, ఆకలములు దిని యాకటి బాధ తీర్చుకొనుచు నిశ్చింతముగ బ్రతుకుచుండెను. పాదుషా ఆ మహాత్ముని సేవించుటకు అచ్చటికి యాత్ర చేసి యిట్లు విన్నవించెను: "మీకు ఉచితమని తోచునెడల మీకొఱకు పట్టణమునందొక యాశ్రమమును నిర్మింపజేసెదను. మీ పూజాపురస్కారములకు నిక్కడికన్న నక్కడ ఎక్కువ యనుకూలముగను నిరంతరాయముగ నుండును. ఇతరులును ఆత్మశక్తి మూలకమైన మీ యాశీః ప్రభావమువలన పుణ్యము నార్జింతురు. మీ నీతి ప్రవర్తనము లోకులకు అనుసరణీయమైన మేలుబంతి కాగలదు." పాదుషా పలికిన యీ మాటలు తపసికి రుచింపక పెడమొగము పెట్టుకొనెను.

అంతట వజీరిట్లు విన్నవించెను: "మహాత్మా, పాదుషాకోర్కె తీర్చుటకైనను తమరు రెండుమూడు దిన

ములు మాపట్టణమున నివసించి యాశ్రమము యొక్క ఔచిత్యానౌచిత్యములను స్వయముగ తిలకింపుడు. ఒక వేళ అన్యుల సహవాసమువలన మీ నైర్మల్యమునకు కళంక మాపాదించునేని యటుపైని దేవర వారి యిష్టమువచ్చిన ట్లొనర్పవచ్చును." ఈ మాటలకు సమ్మతించి యా తపస్వి పట్టణమునకు విజయము చేసెను. ఉద్యాన వనములోని పాదుషా సొంతమహాడీయందు ఆయనకు బస యేర్పాటు చేసిరి. ఆ నివాసము స్వర్గమువలె మనోహరముగను శాంతి దాయకముగ నుండెను.

చెలువలఁ బొద్దపు పదళులకు జెక్కులబోలు గులాబిపూలు, త్రి
య్యలినెరిగొన్న ముంగురుల యందము మందము సేయు సంబులా
లులరెడు, దాచన మరనట్టి నినుంగువిధాన, సీతు పెం
జిలికని పుంజుతానులకు జంకెదునోయన గోమలంబులై.

పొగనడుమ నాల్కజాపెడు
ధగ ధగ మను నగ్ని కీల తతులటు పూచెన్
జిగులారు తొగరు పూవులు
సొగసుగ దరు లతల యాకుజొంపములందున్.

ఆ తపసికి పరిచర్యసలుపుటకు చంద్రవదనయగు సుందరాంగి నొకతెను పాదుషా తక్షణమె నియమించెను. ఆ యువతి నిట్లు వర్ణింపవచ్చును :

లలితేందు రేఖ కెయగు
నలికము, నప్సరనవంటి యాకృతి, వర్ణో
జ్జ్వలమగు బర్హిమనోజ్ఞత
గల చెలి యతి హృదయమైన గడకు హరించున్.

ఆ కలువకంటి వెనువెంటనే శరీర సౌష్ఠవమును అపూర్వ రూప లావణ్యమునుగల యొక యువకుడును తపసి యొద్దకు గులాముగ పంపబడెను.

అతని యందము చందము
చేతోముద మొంద నెంతసేపరసిన మా
కాతురదీరదు. పూరాత్
స్రోతోవర్ణనము శోఫరోగికి బోలెన్.

క్రమ క్రమముగ ఆ మహాత్ముడు కమ్మని రుచిగల వంటకముల నారగింప మొదలిడెను. సొగసైన యుడుపులు ధరించుటకును, ఫలములు, మధురములైన తినుబండములు భక్షించుటకును అత్తరువులు పూసికొనుటకును అభ్యాసమైనది. పరిచారిక రామణీయకముపై కన్ను వేయును. గులాము అంగసౌష్ఠవముగాంచి యానందించును. సుందరాంగుల ముంగురులు బుద్ధిని బంధించు సంకెలలనియు, జ్ఞాన విహంగము నాకర్షించు దీపములనియు పెద్దలు చెప్పియుండిరి.

మతము హృదయంబు పాండితి మాన్యతలును
వ్యయిత మయ్యెను నీ సేవయందె సతము;
నేడు జ్ఞాన ఖగంబును నేను; నీవు
ఉచ్చులకు బకినెలయించు నోదనమవు

వేయేల, చిరకాలార్జితమైన యా తపస్వి ప్రభావము క్షీణించెను.

నిర్మలాత్ములు వక్తలు నీతి తత్త్వ
విదులయొద్ద గడించిన విద్యయుండి
పాడు లౌకిక గోష్ఠిలో బడుట నతడు
తేనెలోబడ్డ యీగ చందాన నయ్యె.

ఒకనాడు ఆ పుణ్యాత్ముని సేవించుటకు పాదుషాకు కోరిక కలిగి యచ్చటికిపోయి దర్శించెను. పూర్వము తాను చూచినప్పటి కంటె ఆయన పూర్తిగ మారియుండెను. నల్లకప్పు వదలి దేహము ఎఱ్ఱబారి బలిసి యుండెను. బంగారు నగిషీపనిచేసిన పట్టుదిండ్లపై ఆయన హాయిగ నానుకొనియుండ, మనోహరుడగు గులాము నెమిలి కన్నుల వీవనవీచుచుండెను. అతని సుఖస్థితికి పాదుషా సంతసించి వివిధ విషయములు సల్లాపించి సంభాషణా నంతరము ఇట్లు చెప్పెను: "నేను విద్వాంసులను దైవభక్తులను అత్యంత ప్రీతితో గౌరవించుచుందును." అంతట, తత్త్వజ్ఞానియు; వివేకియు లోకజ్ఞాన సంపన్నుడునగు వజీరు ఇట్లు విన్నవించెను: "మహాప్రభూ, మీ ప్రీతికి పాత్రులయిన యీ రెండు తెగలవారికి మేలు సేయుటయే స్నేహిత ధర్మము. ఎట్లన, విద్వాంసులకు ధనమొసంగిన వారు ఇతరులకు విద్యగరపుదురు. భక్తులకు ధనమొసగకుండిన దైవచింతనము క్షీణింపక వారెప్పటివలె భక్తులుగ నుందురు.

సహజ సౌందర్యవతియగు చానకేల
రంగు పూతలు పచ్చల యుంగరాలు?
సత్స్వభావము, నగుమోము, శాంతి గలిగి
తనియు ఒరిబేసికేల నత్తరువు కూడు?

తనకు గల్గియు నితరుల ద్రవ్యమునకు
జేయి చాపెడు భక్తుండు శిష్టుడగునె?
ద్రవ్యమేల విరాగికి, ధనముగోరు
నతడు, వేరొక భక్తుని నడసికొమ్ము.

దైవచింతా నిమగ్న చిత్తంబువాడు
బిచ్చమెత్తకయే పరిబేసి యగును;
వ్రేళ్లు జెఎతమ్మె లందమౌ వెలది, కామ్య
గాదె యుంగరాల్ కమ్మలు గలుగకున్న.

# 32

ఒకానొక పాదుషాను నొక ముఖ్యమైన కార్యము తలపడెను. ఆ కార్యము తన యిష్టానుసారము నెరవేరునేని కొంత ద్రవ్యమును భక్తులకు పందేరము చేయుదునని నిర్ణయించుకొనెను. తాను తలంచినట్లె కార్యము ఫలించినది. అంతట తన వాగ్దానము ప్రకారము మ్రొక్కుబడి చెల్లించుట ఆవశ్యకమని తలంచి, ఆస్థాన సేవకులలో నొకనిని పిలిచి, దీనారముల సంచిని వానిచేతపెట్టి యీ ధనము నంతయు భక్తులకు పంచిపెట్టవలసినదిగా పాదుషా యాజ్ఞాపించెను. ఆ సేవకుడు వివేకియు జాగరూకుడనియు వినియుంటిని. అతడు దినమంతయు పట్టణమెల్ల తిరిగి తిరిగి సాయంకాలమున పాదుషా సన్నిధికివచ్చి దీనారముల సంచిని ముద్దిడి యెదుటపెట్టి "మహాప్రభూ, యెంత వెదకినను నొక భక్తుడైన కానరాడు" అని విన్నవించెను.

"ఇది యేమిమాట? నాకు తెలిసినంతవరకు ఈ నగరమున నన్నూరుగురు భక్తులున్నారు." అని పాదుషా చెప్పెను.

"మహాప్రభూ, యథార్థముగ భక్తులైనవారు ఏమియు పరిగ్రహింపరు. పరిగ్రహించువారు భక్తులుగారు." అని సేవకుడు మనవి చేసెను. పాదుషా యీ మాటలకు నవ్వి యాస్థాన సచివులతో నిట్లనియెను: "దరిబేసులను భక్తులను నేనెంత ప్రీతిశ్రద్ధలతో సమ్మానించినను, ఈకొంటె కాయ మాత్రము వారిపై విరోధమూని తిరస్కారము చూపుచుండును. అయినను న్యాయము వానితట్టే యున్నది."

ధనమున కాసించు దరిబేసికంటె
నిష్కాముడౌ భక్తు నెమకి కన్గొనుము

# 33

"సదావృత్తిని గురించి మీ యభిప్రాయమేమి" యని యొక విద్వాంసుని ప్రశ్నించిరి.

"మనశ్శాంతి కొరకు పాటుపడువారు ధర్మాన్నము భుజించుట ఉచితమగునుగాని, కేవలము పొట్టపోసుకొనుటకే ధర్మశాలలలో బంతులుతీరి కూర్చుండుట నీచము" అని ఆయన చెప్పెను.

దైవభక్తిసాగ ధర్మాన్న కబళంబు
గొనిన నొప్పె, దాన గొదవలేదు;

పొట్టనింపు కొనగ బురుమ తెవ్వండేని
కపటభక్తి సలుప గలుష మొదవు.

## 34

దయార్ద్ర హృదయుడైన యొక పెద్దమనుష్యుని యింటికి నొక దరిబేసి వచ్చెను. అచ్చట విద్యావంతులును నోరు నాజూకు లెరిగిన కొందరు మిత్రులు సరస సల్లాపము లాడుచుండిరి. ఆగోష్ఠియందు నొక్కొక్కడును వాని వానికి తోచినట్లు చతురోక్తులు పలుకుచుండెను. ఆ దరిబేసి యిసుక యెడారిలో నడచి వచ్చుటవలనను అంతవరకేమియు తినకయున్నందునను బలహీనతచే నూరకుండెను. "నీవుకూడ నేదైన నొకటి మాటాడిన బాగుగనుండును" అని యా స్నేహితులలో నొకడు కోరెను. "మీవలె నేను విద్యావంతుడనుగాను. నోరు నాజూకు లెరుగను. అదియుగాక యింతదనుక రొట్టెముక్కనైన ఎంగిలిచేసి యెరుగను. ఒక్క పద్యముతో మీకు తృప్తిపఱుపగు రీతి చదివెదను" అని చెప్పెను. అందరును ఆతురముతో "ఏదీ చదువు" మని కోరిరి. ఆతడిట్లు చదివెను:

భామినీ స్నానమందిరద్వారసీమ
నిలబడిన బ్రహ్మచారినా నేను, జవులు
నింపు భోజ్యములెల్ల పట్టింపబడిన
పళ్లెరము ముందు నిలుచుంటి బ్రమద మెసగ.

మిత్రులు ఆతని బడలికను దుర్బలత్వమును ఎరిగి పళ్లెము పెట్టునట్లు ఆజ్ఞాపించిరి. అంతట గృహస్వామి యిట్ల

నియెను: "మిత్రమా, మా నౌకరులు కుందుడు మాంసము వేగించి తెచ్చుదనుక కొంచెము తామసింపుము." ఈ మాటలకు దరిబేసి మొగమెత్తి చూచి నవ్వుచు నిట్లని యెను:

వేపుట వేగినవానికి
వేపుడుమాంసంబు ప్రియమె? వేళకు నేదో
చేపడిన యుత్త రొట్టియె
సాపడి యాకలిని గొంత శాంతమొనర్చు౯.

# 35

ఒక శిష్యుడు గురువుతో నిట్లనియెను: "ప్రజల మూలమున నేను చాల యిబ్బంది పడుచున్నాను. నన్ను సేవించుట కొరకు వారు యాత్ర చేయుచున్నారు. నాకాల మంతయు వారి రాకపోకలచేతను సంభాషణమువలనను గడచిపోవుచున్నది. మనశ్శాంతి కుదురుటలేదు." ఈ మాటలు విని గురువిట్లు చెప్పెను: "బీదవారికి కొంచెము ఋణమిమ్ము. భాగ్యవంతులను ఏదైన కొంత చేబదులుగ నడుగుము. తర్వాత ఇరు తెగలవారును నీయొద్దకువచ్చి తొందరపెట్టరు."

భిక్షకుండిస్లాము పృతనాగ్రగామి
యైనచో 'కాఫరు' యాచనాభీతి
పడకి చినాయెల్లపరకు దౌడెత్తు.

# 36

వేదాంతవిద్యార్థి యొకడు గురువుతో నిట్లనియెను: ఉపన్యాసకులు చేయు నుపన్యాసములు అలంకృతముల య్యును మనోహరములయ్యును నా మనమున నాటుకొనుట లేదు. ఏలయన వారి చేతలకును మాటలకును ఏమియు సంబంధముండదు.''

పూర్ణ వైరాగ్య మొరులకు బోధచేసి
తాము ధనధాన్య మార్జింప దలఁతు రెవ్వరు,
విధుల శాసించు బహు శాస్త్రవేత్త లేమి
చెప్పిన నొకని మనసైన జెన్నుగిలదు.

చెడుగు దలపక మరి తాను జేయునట్టి
పనిని పరులకు గర్తవ్యమని తెలుపక
మాటలకు జేతలకు నేమి మారుపాటు
లేని మాన్యుండె పండితుడౌను తండ్రి.

ధనమార్జించుచు దేహము
పనివడి పోషించునతడు పండితుడగునే?
తను దారిదప్పి క్రుమ్మరు
మనుజుం డితరులకు నెట్లు మార్గము చూపున్.

ఈ పలుకులు విని గురువిట్లనియెను: ''కుమారా, పనికిమాలిన యూహను మాత్రమె యవలంబించి నీతిబోధకుల శిక్షణమును బహిష్కరించుటయు, పండితులకు తప్పులంట గట్టుటయు, పరిశుద్ధ హృదయులగు జ్ఞానులను ఎల్లకా

లము నన్వేషించుచు విజ్ఞాన లాభమునకు వెలియాటయు తలపోయ నొక గ్రుడ్డివాని కథకు సరిపోవు చున్నది :

ఒకనాటిరేయి అంధుడొకడు బురద గుంటలోపడి యిట్లనియెను : " ఓ ముసల్మానులారా, నా దారిలోనైన నొక దీపము పెట్టరాదా ? " ఈ మాటలను ఒక బజారు లంజె విని యిట్లడిగెను : ఓయీ. నీవు దీపమునే చూడలేవు. మరి దీపమువలననేమి కనుగొందువు ?

నీతిబోధక పరిషత్తు గుడ్డలంగడి వంటిది. అచ్చట నంతయు రొక్కపు బేరము. డబ్బు చెల్లింపనిదే వస్తువులను నీవు తీసికొనలేవు. ఎంతవరకు నీ మనస్సున జ్ఞానార్జనాసక్తి యుదయింపదో అంతదనుక ఆనందమనుభవింపలేవు.

మాటలకు జేతలకు మారుపాటులున్న
బండితుల వాక్యములు వినవలయు శ్రద్ధ;
సుపుడొక్కడు మరియొక్కసుప్తు నెట్లు
మేలు కొల్పెడు ననుమాట మిథ్యయగును.

కుడ్యలిఖితమయ్యు గుణవంతు లెపుడు
హితబోధ గ్రహియింప నెనగు శ్రేయంబు.

## 37

మతము విసర్జించి మాన్యుండు సుజనుండు
పండితగోష్ఠి లాభంబు బడయ
నరుదెంచె విశ్వవిద్యాలయ భూమికి
అంతట నే నిట్టులంటి : మిత్ర,

సన్న్యాసులకు సర్వశాస్త్రజ్ఞులకు నేమి
భేదంబు గంటిరి? వీరి కొరకు
వారిని త్యజియించి వచ్చితి రిప్పుడు
దయచేసి తెల్పుడు తమ తలంపు,

ననవుడా తపస్వియు నిట్టులనియె: సఖుడ,
తనదు గొంగడి వెల్లువ మునిగిపోవ
దరికి సన్న్యాసి యద్దాని నుద్ధరించు;
పండితుడు పతితులనెల్ల బయటి కిడ్చు.

# 38

ఒకడు తప్పత్రాగి దారిప్రక్కన నొడలు తెలియక పడియుండెను. పుణ్యాత్ముడొకడు ఆ త్రోవను పోవుచుండి యాతని నీచస్థితికి ఏవగించుకొని హేగానుగా చూచెను. అంతట వాడు కైపునిద్రలోనె తలయెత్తిచూచి యిట్లనియెను:

పతితునిగని పెడమోమిడి
యతి దారుణదృష్టిజూచు న్యాయమె? కరుణా
మతి దప్పుల మన్నించుట
మతిమంతుల కుచితమండ్రు మాన్యులు పెద్దల్.

నేను పాపినెయౌదు; నీవైన ధీర
గాంభీర్యమున నన్ను గడచిపోరాదె?

# 39

పనిపాటులేని తుంటరులు కొందరు ఒక దరిజేసి నెదురొక్కని దూషించి చావమోది కష్టపెట్టిరి. అంతట నా

దరిబేసి నాకీగతి పట్టినదని తన యశక్తతను గురించి మత గురువునొద్ద మొరపెట్టుకొనెను. ఆ మొరనాలకించి గురు విట్లనియెను: "కుమారా, దరిబేసుల కట్లబొంత సంతోష సహనములకు లాంఛనము. ఆ యంగీ ధరించినవారు దార్జ న్యము సహింపనోపరేని ధర్మబాహ్యులగుదురు గాని దరి బేసులు కారు. వారివలన కుట్లబొంతయు దూష్యమగును."

కడలిలోనరాయి బడవేసినంతనే
బురదవేగబోదు పూర్ణమగుటః;
తాల్మి ధృతియులేని దరిబేసియొకలోతు
పాతులేనినీటి పడియనుమ్మ.

ఓర్చుకొనుము కష్టంబుల నోపినంత,
దేవుడు దయార్ద్రహృదయుండు; తెగునఘంబు;
తమ్ముడా, తుట్టతుదకిది దుమ్మెయగుట
కాయ మట్లొటకున్మన్నె కమ్మదుమ్ము.

# 40

వినుడోయి వినుడోయి వింతయౌకథను!
బాగదాదను మేటి పట్టణంబందు
జుండాకు ముసుగుకు జరిగె దర్కంబు;
దారికావిరిదుమ్ము తలపైని నిండ
పలుప్రయాణంబుల బడలికహెచ్చ
నిష్ఫలంబుగబల్కె నిగిడికేతనము;
ఒకమంచముపై బండి యొకకంచమందు
గుడిచి యిద్దరమొక్కబడి పరించితిమి;

యొకరాజునే కొల్చుచున్నాము మనము.
అయిన నేమొకాని యరక్షణంబైన
నిలుపునిల్కడలేదు, నిడి ప్రయాణంబు;
ఏవేళకష్టంబు లెఱుగవు నీవు;
కోటముట్టని గుండుగుళికి పాల్పడవు;
గాలిదెబ్బ యెడారి గాటంపుటెండ,
యిసుకదుమారంబు లెఱుగవునీవు;
మోహరంబున నీలు మంచుయుకే చాపి
యిన్ని యిక్కటుల నే నెట్లోర్చుకొనగ,
నాకంటె నీకు విస్తారపు గౌరవము
హెచ్చుగానుండుట కేమికారణము?
చిన్నారియువతుల చక్కనిక్కుముద్దు
విడుదువుతనివార; సందుమిందుమును
బలుచనిజలపంబు పై పిండుటుల
నంపకత్తెలమోము లంటి వేలెపవు;
మల్లెపూనెత్తావి మలయుపూబోండ్ల
పాలిండ్లపై బడి ప్రాకాడెదవు;
చెవిలోన గుసగుసల్ చెప్పుచుండెదవు;
చెంటిసిపాయాల చేతిలోనేను
బడితి; వారలునన్ను బయనించువేళ
త్రాళ్లులతోజుట్టి తలక్రిందుసేయ
న్యాయమేయని కేతనంబు ప్రశ్నింప,
నవగుంతనంబిట్టు లనియె నవ్వుచును:
వినయంబుతోగ్రింద వీక్షింతుగాని
నీవలెదలయెత్తి నిక్కగర్వమున
నింగిపైజూడ్కుల నిగిడింపబోను;
అవివేక గర్వాంధులై మోరలెత్తు
వారలు తలక్రిందుపడుట నిజంబు.

# 41

ఒకానొక మల్లుఁడు కోపావేశమున కంపించుచు నోట నురుగులు గ్రక్కుచుండుట యొక సజ్జనుఁడుచూచి "ఈ యవస్థ యాతని కెట్లుకలిగె" నని యడిగెను. వానిని ఫలానివాఁడు తిట్టెనని యచ్చట నున్నవారనిరి. "పాప మీ నిర్భాగ్యుఁడు వేయిమణుగుల బరువుగల రాతిని లేవనెత్త గలఁడుగాని యొక్కమాట నోర్చుకొనునంతటి శక్తి లేక పోయెను." అని యా సజ్జనుఁడు పల్కెను.

భుజబలంబును శౌర్యంబు బొగడుకొనకు;
నీచనైజము గల్గి, యే నియతిలేక
మనసు చిక్కఁబట్టఁ లేని మానవునకు
అబలకినుమం ఁభేదంబు నరయగలమె?

నిన్ను గాంచి యొరులు నిందింపనట్లుగా
జేసికొమ్ము నీకు జేతనైన;
మోము ముష్టితోడ మోదినయంతనే
వీరుఁడౌనె? మేటిశూరుఁడౌనె?

మదగజ కుంభస్థలమున
మెదడు పెఁకు శక్తియున్న మేటరియైనఁ
నదయుత బరకష్టంబుల
కెద కరగనివాఁడు మనుజుఁడే తలపోయఁ.

ఆధూళిచేబుట్టె నాదామునంతు;
ఆధూళిగాకున్న నతఁడు మానవుఁడె?

# 42

సూఫీమత సామాజికుల సౌశీల్యమెట్టిదని నేనొక పెద్దమనుష్యుని అడిగితిని. ఆయన యిట్లు చెప్పెను: "వారిలో ప్రథముడు తన సొంత కార్యముల నటుకట్టిపెట్టి మున్ముందు స్నేహితుల యభీష్టము నెరవేర్చును. పండితులిట్లు చెప్పి యున్నారు: "సొంతమునకు కట్టుపడిన సోదరుడు, సోదరుడును కాడు సొంతమును కాడు."

పయనమందు తోడి బాటసారియునిన్ను
వదలి గడచిపోవు వాడుహితుడె?
ఎడదనంకెల నిను నెపడు బంధింపడో
ఆట్టివానిచెలిమి కానపడకు.

భక్తిమతములేని బంధువర్గముల
సంబంధమునువీడ జాలమేలౌను.

ఈ ద్విపదలోని భావమును ఆక్షేపించుచు ఒకవాది నన్ను ప్రతిఘటించినసంగతి యిప్పటికిని నాకు జ్ఞప్తియున్నది. ఆతడిట్లనెను: "సర్వశక్తి సంపన్నుడగు సర్వేశ్వరుడు పవిత్రమగు ఖురానునందు బాంధుసంబంధ విచ్ఛేదము నిషేధించెను. నీవు చెప్పునది ఆ సూక్తికి వ్యతిరేకముగ నున్నది."

నేనిట్లు బదులు చెప్పితిని: "నీవు తప్పుదలచితివి. నేను నుడివినది ఖురాను సూక్తికి విరుద్ధము కాదు. సర్వేశ్వరుడిట్లు ఆజ్ఞాపించి యున్నాడు: "మీకు యథార్థ విషయపరి

జ్ఞానము లేనప్పుడు మీ తల్లి దండ్రులు మిమ్ము 'మాతోడ భాగస్వాములు కండు' అని యాజ్ఞాపింతురేని మీరు వారి మాటల ననుసరింప బనిలేదు.''

దైవచింత నుంతదనరని బంధుల
వేయిమందినైన విడువవచ్చు,
నతముదైవభక్తి నలిపెడునన్యుని
కొరకు; నతడెమదికి గూర్చువాడు.

# 43

బాగదాద్‌పట్టణ వాసియౌజాణ
వృద్ధుండుతనయకు బెండ్లిగావించె,
బాదరకలుకుట్టు పనివానికిచ్చి
కూతురియుపతయంబు గొరికె నా మొరక;
కాటుల నెత్తురు గారుచునుండె;
మరునాడుతనయ వాతెర జూచి తండ్రి
అల్లునితో నిట్టులనియె నిందించి:
చెప్పట్టయనకొంటె చిగురువాతెరను?
ఎగతాళిగాదిది, ఏమిమజాఖ?
దాంపత్యమునకీవు తగవోయిమూర్ఖ,
యనుచు గూతురి దీసికొనియేగె దండ్రి.
పుట్టుకలోవేరు పెట్టినచెడ్డ
కాటికేగినదాక కనిపెట్టియుండు.

# 44

ఒకానొక శాస్త్రవేత్తకు నొక కుమారిక యుండెను. ఆ కన్య యందగత్తె కాదు. ఈడేరి కొంత కాలమయ్యెను.

హెచ్చుగ కన్యాహారణమిచ్చి కన్యాదానము చేసెదనని యే వరునికోరినను ఒక్కడైన ఆ కురూపవతిని పెండ్లియాడుటకు సమ్మతింపకుండెను.

చక్కదనములేని చానపై బట్టు
జలతారుచీరలు వెలవెలబోవు.

వేయేల, ఆవశ్యకమును బట్టి యాకన్యనొక యంధునకిచ్చి పెండ్లి చేసెను. అంతట కొలది కాలమునకు స్వర్ణద్వీపమునుండి గ్రుడ్డితనము బాగుసేయు వైద్యుడు అచ్చటికి వచ్చెనని చెప్పిరి. "నీ యల్లుని గ్రుడ్డికన్నులకు చికిత్స చేయింపరాదా" అని కొందరా శాస్త్రవేత్తనడిగిరి. "కంటి చూపు వచ్చిన ఆతడు నా కూతును వదలిపెట్టునని భయపడుచున్నాను" అని యాతడు చెప్పెను.

అందచందము లేని యువతిమగండు
అంధుడైయుండిన నదికొంత మేలు.

# 45

ఒక పాదుషా దర్వేసులను నీచముగ చూచుచుండెను. వారిలో నిగర్వజ్ఞుడొకడు ఈ సంగతి గమనించి పాదుషాతో నిట్లనియెను: "ప్రభూ, యీ లోకమున సంతోషమునందు మీకంటె మేము హెచ్చు. భోగభాగ్యములందు మాకంటెను మీరు హెచ్చు. మరణ మాసన్నమైనపుడు ఇరువురము సమానులము. అంత్య దినమున మీకన్నను మేము మేలు."

రాజ్యంబుల జయించి రాజేలవచ్చు;
కూటికై దరిబేసి కుంపంగవచ్చు;
ఇరువురు మరణించునెడ, శవపేటి
దప్ప నొండెద్దియు దమవెంటరాదు.

పరలోక యాత్రకు ద్వరపడువేళ
పరమ రిక్తుడుమేలు పాదుషాకంటె.

దరిబేసికి ప్రాతవడిన కుట్లబొంతయు బోడితలయు బాహ్య లక్షణములు. నిజమాలోచించిన ఆతని హృదయము సజీవము; అరిషడ్వర్గము మృతప్రాయము.

ప్రజల విడరాడి తన సొంత ప్రార్థనంబు
సేయుచునతడు, సమ్యక్కీడుసేయ నొగిలి
శయ్యములకు గాల్ద్రవ్వెడు కపట వేష
ధారి, దరిబేసిగా డనాచారి గాని.

కొండ నెత్తముమండి గుంద్రాయి దొరల
దప్పించుకొని పోవ దరిబేసి యగునె?

దైవసంకీర్తనము, కృతజ్ఞత, సేవాసక్తి, వినీతి, దానము, సంతృప్తి, ఐక్యమునందు నమ్మకము, మతవిశ్వాసము, పారతంత్ర్యము, సహనము, అను నీ సద్గుణములు కలిగియుండువారే యథార్థమైన సూఫీలు. వారే దరిబేసులు. అట్టి మహాసీయులు ఏ యుడుపుదొడిగికొనిన నేమి? అట్లుగాక వ్యర్థప్రలాపములు సేయుచు నమాజుచేయక, భోగలాలసలయి దినములు వెళ్లబుచ్చుచు, యింద్రియ సౌఖ్యములకు లోనయి రాత్రులు గడపుచు, మాంద్యమున పౌర

లాడుచు, చేతికి దొరికినదెల్ల తినుచు, నోటికి వచ్చినదెల్ల మాటాడుచు జీవితము వ్యర్థముసేయు కుమతులు దరిచేసి బొంత తొడిగికొని యుండియును అధములగుదురు.

అంతరంగంబు పుష్ప శూన్యంబునీకు,
కపటవేషంబుతో నేమి గాంచగలవు?
ఇంట గూర్చుండి జపము గావలట లేక
యేడురంగుల తెరయేల యింటి మొగను?

# 46

గరికపోచలు చుట్టి కట్టిన క్రొత్త
పన్నీరు పూగుత్తి బహికించి యంటి:
ఏమి యదృష్టంబొ యీ బీద గరిక
కన్నెగులాబీల కడనెపసించు!
కన్నీరువెట్టుచు గరిక యిట్లనియె:
మాటలాడకుమోయి, మఱచుమాపలేదె?
దయయు దాక్షిణ్యంబు పరిసరాదు
మతవరు మిత్రులౌ సుంచభాగ్యులను;
సౌరు సౌరభ్యంబు చక్కనిరంగు
అలర కుండినేమి, యీ దేవదేవు
వనభూమిలో నేను ప్రభవింపలేదె?
భువనేశ్వరుని కృప పోషింప బడితి,
ఆ తండ్రి దాస్యంబె యర్థించుకొంటి;
తెలివిలేకుండియు దేవుని దయకు
అంజలి ఘటియింతు గానతో నతము;
యోగ్యత వినయంబు నేర్పులేకున్న
తన సేవకుని కోర్కె తానెయెఱింగి
నవరించు, సన్వరక్షణలేని కతన;

పతనిర్వృతి పథాన బయనించుసాధి
నుద్ధరింపుము తండ్రి యోసృష్టి శిల్పి;
తమసేవ వృద్ధులౌ దాసుల బంధ
ముక్తి యొసర్తురు భూపాలవరులు;
విశ్వేశ, నీ ద్వారవిధి వర్జించు
ప్రాణికి గత్యంతరంబు లేదొకటి.

## 47

దాతృత్వ ధైర్యములలో నేది శ్రేష్ఠమైనదని యొక ప్రాజ్ఞుని ప్రశ్నించిరి. ఆయన యిట్లుచెప్పెను: "ఎవరికి దాతృత్వముండెనో వారికి ధైర్యము ఆవశ్యకము కాదు."

బలము శౌర్యముగల్గు బాహువుకంటె
నర్థులకిడుచేయి యత్యుత్తమంబు
అనుచు ముద్ర లిఖియించి రా బహరాము
గోరి గోరిమీద గుంటక్షరముల.
ఏగె హాతిముతాయి, యేండ్లుపూండ్లాయె
నైన బేరుప్రతిష్ఠ లఖిలకాలంబు
దైవారు దులలెని దాతయౌ కతన
నీకున్నయంతలో నిర్ధనార్థులకు
దానంబుసేయుము దైవంబుమెచ్చు;
వనపాలకుడు ద్రాక్షవల్లి శాఖలను
గత్తిరించిన గాయగాయు ఫట్టముగ.

# తృతీయాధ్యాయము

# సంతృప్తి

## 1

కడమటి సీమ బిచ్చగాడొకడు హాలబ్ పట్టణమున వర్తకసంఘమునందు ఇట్లు పలికెను: "ఓ భాగ్యవంతులారా, మీకు న్యాయబుద్ధియు మాకు సంతృప్తియు యుండె నేని లోకమునందు యాచనాచారము నిర్మూలమై యుండెడిది.

తను ధనికుని గావింపుము
నేను గొలిచెదనని తృప్తి, నీ నడిసిరి యెం
దును దుర్లభముగు; లకుమను
గనె నహనం; బోర్పులేక జ్ఞానముగలదే.

## 2

మిసరు దేశమున నిద్దరు రాజకుమారులుండిరి. వారిలో నొకడు శాస్త్రపాండిత్యము సంపాదించెను. మరి యొకడు ధనమార్జించెను. తుట్టతుదకు ప్రథముడు అప్రతిహూన విద్వాంసుడాయెను. ద్వితీయుడు మిసరురాజ్యమునకు అధిపతియాయెను. కొంతకాలము గడచిన వెనుక సంపన్నుడగు రాజు నిరుపేదయగు విద్వాంసుని నీచముగచూచి

యిట్లనియెను: "నేను రాజ్యపాలనము చేయుచున్నాను ఈతడన్ననో దారిద్ర్యమనుభవించుచున్నాడు."

ఈ మాటలకు పండితుడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "ఓయి సోదరుడా, దేవుడు నాకొసర్చిన మేలునకు నేను ఎక్కుడు కృతజ్ఞుడనుగ నుండవలయును. ఏలయన పైగంబరుల పైతృకమనందగు శాస్త్రపాండిత్యము నాకు లభించెను. నీకన్ననో ఫారోహామానుల పైతృకమగు మిసరు రాజ్యభాగము చేపడెను.

అడుగు క్రిందనలిగి మిడుకు చీమనెగాని
యేడ్వగుట్టు కందురీగగాను;
ప్రజల కష్టపెట్ట బలిమియునందుకు
దేవదేవు ఋణము దీర్పగలనె?

# 3

ఆకటిచిచ్చులో మలమలమాడుచు, చీరికపై చీరిక పెట్టి కుట్టుకొనుచు, సొంతయూరటకొరకు నిట్లు పాడుకొను నొక దరివేసిని గూర్చి నేను వినియుంటిని:

ఎండు రొట్టెమెసవి యెంతొ తృప్తివహింతు,
కుట్లబొంత దొడిగికొని సుఖింతు,
పరుల దయకు ఋణముపడియుండు గతికంటె
తన పరిశ్రమంబె తనకుమేలు.

ఒక డాతనితో నిట్లనియెను: "ఓయి, యేల యూరక కూర్చుంటివి? ఈ పట్టణమున దయాంతరంగుడును

సర్వసమకారుణ్యముగల యొక పెద్దమనుష్యుడు ముక్తుల పరిచర్యసలుపుటకు నడుముకట్టుకొని వారికొర్కెలీడేర్చుటకు కనిపెట్టుకొని యున్నాఁడు. నీ యిప్పటి స్థితిగతులు ఆయన కెరుకపడెనేని మీవంటి ప్రియుల యిష్టానుసారము వర్తింప సమయము చిక్కినందుకు మిక్కిలి సంతోషించును.'' ఈ మాటలు విని దరిబేసి యిట్లు పలికెను: ''నోరు మూసికొమ్ము. మన యక్కరల నొరులయొద్ద వెళ్ళబెట్టుటకంటె దారిద్ర్య కష్టముల ననుభవించుటయే మేలు.

క్రొత్త చొక్కాలులేవని గొణుగుకొనుచు
దాతకర్జీలు పెట్టెడు దానికంటె,
జీరికలుగుట్టి ధరియింప శ్రేష్ఠమగును;
దాన సహనంబు శాంతియు దక్కఁ బోకు.

ఇరుగుం బొరుగు మనుష్యుల
కరుణా సాహాయ్యలబ్ధి గడనస్వర్గంబుం
బొరయుట కంటెను మేలగు
నిరయాగ్నిం బడెడుబాధ, నిజమిది మిత్రా.

# 4

మహమ్మదు ముస్తఫాకు అందుబాటులోనుండి కావలసిన చికిత్స చేయుచుండుటకు నొక నిపుణుడైన వైద్యుని పారసీక నరపాలుడొకడు పంపెను. ఆతడు కొన్నేండ్లపాటు అరబ్బీ దేశమున నివసించెను. ఎంతకాలము చూచినను ఒక్క రోగియైన మందిమ్మని తనయొద్దకు రాకుండెను. అంతట ఆ వైద్యుడు మహమ్మదు ప్రవక్త సముఖమునకు

వచ్చి యిట్లు మొరపెట్టెను: "దేవరవారి యనుయాయు లకు చికిత్స చేయుటకు నన్నిచ్చటికి పంపిరి. ఈ గులాము నియుక్త కార్యము నిర్వహించుటకు నొక్కడైన నావద్దకు వచ్చుటలేదు." ఈ మాటలువిని మహమ్మదు ఇట్లనియెను: "చురుకుగ ఆకలెత్తనిదే భుజింపరాదనియు, ఆకలి కొంచెము మిగిలి యుండగనే భుజించుట మానవలయు ననియు మా సంఘము వారికి దాటరాని కట్టుబాటుగలదు." వారి యారోగ్యమునకు ఈ పద్ధతియె కారణమయ్యెండునని వచించి గౌరవ పురస్సరముగా భూమిని ముద్దిడి యా వైద్యుడు తన దేశమునకు వెడలెను.

అది భుజింపుము, యిదికూడ దనుచుఁజెప్పు
వైద్యుఁ డటు చెప్పకుండిన వచ్చుగీడు;
బొత్తిగా బస్తుపడి యున్న బోవు పటిమ;
వెజ్జునిపుణత హితమును వినుచుటందు,
ఆయురారోగ్యములు భోజ్యమందు గలవు.

# 5

అర్దిషీర్ బాబకాన్ చరిత్రమునందిట్లు వ్రాయబడి యున్నది: "దినమున కెంతమాత్ర మాహారము తినవచ్చు" నని యొకనాడు అర్దిషీరు అరబ్బీ వైద్యుని ప్రశ్నించెను. "నూరు దేరముల యెత్తుచాలును" అని వైద్యుడు చెప్పెను. "ఈ కొద్దిపాటి యాహారము ఏమి బలమిచ్చును" అని యర్దషీ రడిగెను. "ఈ కొద్దిపాటి యాహారము నిన్ను

మోయగలదు. ఇంతకన్న నెక్కుడు భుజింతువేని దానిని
నీవు మోయవలయును'' అని ఆతడు చెప్పెను.

బ్రతుకంగ బ్రార్థింప బ్రాజ్ఞుండు దినము,
తినుటకే బ్రతికెడు తిండిపోతన్న !

# 6

ఖురాసాను రాష్ట్రనివాసులగు నిద్దరు దరవేషులు తోటి
బాటసారులయి యాత్ర సల్పుచుండిరి. వారిలో నొకడు
బలహీనుడుగ నుండి రెండుదినములకొకతూరి భుజించు
చుండెను. మరియొకడు బలవంతుడయి దినమునకు మూడు
పూటలు మెక్కుచుండెను.

ఇట్లుండ నొకనాడు వారొక పట్టణము ప్రవేశించు
నప్పుడు వేగులవారని నేరముమోపబడి బంధింపబడిరి.
రాజభటులు వారి నొక గదిలోనికి నెట్టి, ద్వారమును
మంటితో మూసివేసిరి. తరువాత పదుదినములకు వారు
నిర్దోషులని తెలిసినది. మన్త్రివర్యు వారిని గదినుండి బయ
టికి తీసిరి. బలవంతుడు మరణించి యుండెను బలహీనుడు
బ్రతికియుండెను ఈ విపరీతమునకు నందరు ఆశ్చర్యపడిరి.
అంతట నచ్చటనుండిన యొక పండితుడు ఇట్లనియెను:
''ఇంతకన్న విపరీతముగ జరిగియుండిన మనము వింతపడ
వలసి యుండును. ఏలయన వాడు తిండిపోతు. పస్తుపడి
యుండుటకు శక్తిలేక మరణించెను. రెండవవాడు కొద్దిగ

తినువాడు. అందువలన తన యలవాటు చొప్పున ఆకలి నోర్చుకొని క్షేమముగ బ్రతికివచ్చెను.

కొలదిపాటిగ దినువాడు కొండయంత
కష్టములనైన సులువుగా గడచిపోవు;
విచ్చలవిడిగ దిని మేనుపెంచువాడు
పేదవడ, నిడుమలజిక్కి వీగిపోవు.

# 7

తనివితీర భుజించుట రోగహేతువగును. కావున నీవు మితిమీర తినరాదని వివేకియగు తండ్రి పుత్రుని కాజ్ఞ పెట్టెను.

"తండ్రీ, యాకటిబాధ ప్రజలను చంపును. ఆకటి మంటతో బ్రతుకుటకంటె సంతృప్తిగా తిని చచ్చుటయే మేలని బుద్ధిమంతులు చెప్పినమాట నీవు వినలేదా ?" అని కుమారుడడిగెను. "మేరమీరకుము. సర్వేశ్వరుడు ఖురానులో నిట్లు చెప్పియున్నాడు : ఎంత యావశ్యకమో యంత మాత్రమె తినుడు, త్రావుడు. మితిమీరకుడు."

క్రక్కవలసినట్లు కడుపు నింపకుము;
బక్కచిక్కగ మేను, పస్తులుండకుము.
అన్నకబళ మొడలి కాధారమయ్యును
అదియె రోగహేతువమితమైన;
కోర్కెలేక తిన్న గుల్కందు విషమౌను,
ఆకలెత్తి రొట్టె యమృతమగును.

# 8

"నీకు దేనిపై కోరికయున్నది" అని యొకరోగినడిగిరి. "నేనేమియు కోరక యుండవలయునను కోరికగలదు" అని యాతడు చెప్పెను.

కడుపొట్ట నవ్వంగ గడుపునింపినను
అన్నియు నరియయ్యు హాయిచేపడదు.

# 9

వాసిత్ నగరమున కొందరు సూఫీలు ఒక కసాయి వానికి కొన్ని దేరములు ఋణపడి యుండిరి. ప్రతిదినమును అతడు బాకీదండుచు కఠినముగ మాటాడుచుండెను. ఆ సూఫీలు వాని చురుకుముట్టుమాటలకు మనసు నొచ్చియు చేయునదేమిలేక సహించియుండిరి. వారిలో నొక పుణ్యాత్ము డిట్లనియెను: "ఆకట మలమల మాడుచున్న కడుపునకు అన్నము వేయుదునని సులువుగా వాయిదా వేయవచ్చును గాని కసాయివాని యప్పుతీర్చుటకు గడువుపెట్టుట యసాధ్యము."

తెలిసి పణిహరించే దిట్లుదినుటకంటె
ఉన్నతుల దర్శనము మానుకొన్న మేలు;
కటికవాని వసూలు నిక్కచ్చికంటె
అమిషపుటాన మరణించుటైన శుభము.

# 10

తార్తారుయుద్ధమునందు ఒక యువక వీరుడు గాయపడెను : "ఫలాని కోమటిశెట్టియొద్ద గంటెని మాన్పు మందున్నది. నీవు కోరుదువేని ఒకవేళ ఆతడిచ్చిన నీయవచ్చును. అయినను ఆ వర్తకుడు పిసినిగొట్టను ప్రతీతి."

శెట్టితను కంచమున నెండురొట్టె బదులు
భానుబింబంబె యుండిన, ప్రళయదినము
వరకులోకంబు సూర్యాతపంబు గోలు
పోపలనివచ్చు; బిసినారి పుట్టువతడు.

అంతట ఆ యువకు డిట్లనియెను : "ఒకవేళ నేను ఆతనిని మందడుగుదునేని యిచ్చిన నీయవచ్చును. లేదా లేదనవచ్చును. ఇచ్చునుపో అది యుపయోగపడవచ్చును. లేక నిరుపయోగము కావచ్చును. ఎట్లయినను అటువంటి వానియొద్ద మందు తెచ్చి పూసికొనుట విషము చరిమిన ట్లగును."

అధముని యాచించి యర్థించునెదియు
దనువు హెచ్చించును, తగ్గించునాత్మ.

పండితులిట్లు చెప్పిరి : "జీవనామృతము అమ్మబడు చున్నను ప్రాజ్ఞులు ఆత్మగౌరవమును వెచ్చించి దానిని విలువరు. ఏలయన నీచముగ బ్రతుకుటకంటె గౌరవముతో మరణించుటయె యుత్తమము."

ఆక్కరకువేడు సామాగ్రి యధమమగును;
కుండ పొయిమీదికెక్కెను, కూడుడికెను;
కాని ప్రియమైన నా యాత్మగౌరవంబు
బుడగలై చిట్లి యావిరై పోయెనయ్యో!

పెరిగెను బత్తెంబు, తరిగె మానంబు;
పాడు యాచనకంటె పస్తుంటమేలు.

# 12

ఒక దరిబేసికి ధనముతో నక్కరగలిగెను. "ఫలాని పెద్ద మనుష్యుడు అత్యంత భాగ్యవంతుడు. దయార్ద్ర స్వభావుడు. నీ యక్కర ఆయనకు తెలియవచ్చెనేని యెట్లయినను నీపని నెరవేర్చుటకు ఆలసింపడు" అని యొక మిత్రుడు చెప్పెను. "నేనాయనను ఎరుగను" అని దరిబేసి చెప్పెను. "అట్లయిన నేను తీసుకొని పోయెద" నని చెప్పి, చేయిపట్టుకొని యా పెద్ద మనుష్యుని యింటికి వాని దోడ్కొని పోయెను.

అచ్చట పెనుపులు వ్రేలాడవేసుకొని పప్పుముద్దవలె దనిసికొంబడి కుర్చీపడియున్న యింటిఖామందును చూచి దరిబేసి యేమియు మాటాడక తిరిగివచ్చెను. "ఇట్లేల చేసితివి?" అని మిత్రుడడిగెను. "ఆతడిచ్చు సంభావన ఆతని ముఖమండలమునకు కానుకగా సమర్పించితి" నని యా దరిబేసి చెప్పెను.

ఏడ్పు మొగమువాని నేమి యర్థింపకు
మతని దుఃస్వభావమాత్మ గలచు;
అడిగెదేని వాని నడుగుమా యెవ్వాని
యాస్య పద్మమీవి కానవాలొ.

# 13

ఒకయేడు సికందరియా నగరమున పెద్దకరువు సంభవించినది. దరిబేసులకు కష్టము లోర్చుకొనుశక్తి సన్నగిల్లినది. ఒక్క వాన చినుకైనా భూమిపై పడనియట్లు ఆకాశ ద్వారము మూతపడినది. రైతుల దీనాలాపములు మిన్నుముట్టినవి.

ప్రాకు పురుగు మొదలు పైనిబోవు ఖగంబు
వరకు గలుగు ప్రాణిపఙ్క్తియందు
మిన్నుజూచి చూచి మన్నైనయాసతో
నుమ్మలింపనట్టి దొకటిలేదు.

అన్నమో రహీమని యెప్పుడంగలార్చు
ప్రజల నిట్టూర్పు ధూమలంబు పైని మొగులు
గట్టి, కన్నీరువానయై కడవపోత
జడిగ వర్షింపకుంట విస్మయము గొల్పె.

ఇటువంటి సంవత్సరమున ఆ పట్టణమునందు పేడి యొకడుండెను. వాడు మిత్రులకు దూరస్థుడగునుగాక! వానిని వర్ణించుట మర్యాదకు లోపముగ నుండును. మీదు మిక్కిలి పెద్ద మనుష్యులకడ వర్ణించుట యింకను అనుచితము అట్లయిన నింద్యుడని వానిని వర్ణింపక బొత్తిగ వదలి

పెట్టుటయు సరికాదు. ఏలయన అట్లు వదలిపెట్టుట నా శక్తి దారిద్ర్యమని యితరులు లోపమారోపింతురు. సంక్షేపముగ ఈ పద్యమున వానిని వర్ణించెదను. అన్నమును పరీక్షింప నొక్క మెతుకును పట్టిచూచినట్లును, గోనెలోని ధాన్యమును మచ్చుచూచుటకు నొక పిడికెడు చాలినట్లుగను, ఈ పద్యమొకటి చాలును.

పెడిదార్తారి చంపిన విడువుమటని,
ప్రతివధసుమాను; మెన్నేండ్లు బ్రతుకునతడు
బాగదాద్ పంతెనపెథాన, బైని జనులు
క్రింద వాఃప్రపూరము ఝుంకరించి పార.

ఇంతపసను ఎవని పర్ణనమునందు మీరొక్క యక్షరము మాత్రమే విన్నారో అట్టివానికి ఈ కరవుకాలమున మితిలేని ధనరాసులుండెను. అతడు నిరుపేదలకు వెండి బంగారము నిచ్చుచుండెను; బాటసారులకు అన్నము పెట్టించుచుండెను. దరిబేసులు పస్తుపడియుండలేక సదావృత్తికొరకు నాతని యాచించు తలంపుతోనుండి నా యభిప్రాయమును కోరిరి. వారితలంపు నాకు అంగీకారము గాక యిట్లంటిని :

గుహను సింహ మశక్తమై కూలబడియు
గుక్క యెంగిలిదినగ గక్కురితపడునె?
ఆకటిని సహింపుముగాని, యధము నొద్ద
జేయిచాపకు మెంత యాదాయమున్న.

సంపదల ఫరీదూనుతో సమునినైన
దెలివిలోపింప నరుడంచు దలపబోకు;

పయినిదాలుచు నవివేకి పట్టుటంగి
మట్టిగోడకు పసిడి నీర్గొట్టినట్లు.

# 14

"మీకంటెను గొప్పబుద్ధిగలవానిని ఈ ప్రపంచమున నెచ్చటనైనను కని విని యున్నారా?" అని హాతీంతాయి నడిగిరి.

"అవును, కనియున్నాను. ఒకదినమున నలువది యొంటెలను బలిపెట్టి విందుచేసితిని. అరబ్బీ పాలెగాండ్రను ఆహ్వానించుటకు పోవుచుండ నెడారిలో నొకమూల కట్టెలు గొట్టువానిని గాంచి యిట్లంటిని: "హాతీంతాయికి అతిథివై నీవేల పోలేదు? ప్రజలు ఆయన విందునకు నలుదిక్కుల నుండి వచ్చుచున్నారు." కట్టెలమోపు తలపై కెత్తుకొనుచు ఆతడిట్లనియెను:

చేజేత కష్టించి జీవింమనతడు
తాయి ప్రసాదంబు దలపడెప్పుడును.

"నాకంటె అతడు గొప్పబుద్ధియందును శౌర్యము నందును మేల్తరమని నిశ్చయించుకొంటిని" అని హాతీము తాయి చెప్పెను.

# 15

కట్టగుడ్డలులేక దిసమొలతో బయట దిరుగుటకు సిగ్గుపడి, యిసుకలోదుకొని గుంటలో కూర్చుండియున్న

యొక దరిబేసిని మూసాప్రవక్త చూచెను. "అయ్యా, తినుటకన్నమును కట్టగుడ్డయు లేక నాబ్రతుకు దుర్భరమగుచున్నది. నాకు దినబత్తెము దొరకునట్లు మీరు సర్వేశ్వరుని ప్రార్థింపవలయును" అని యా దరిబేసి ప్రవక్తను వేడుకొనెను. అంతట మూసా "అల్లాకానిమ్మ"ని ప్రార్థించి వెడలిపోయెను.

కొన్ని దినముల కాదరిబేసి దుష్టుడయి సారాయిత్రాగి కయ్యమునకు కాలుచాపుచు నొకనిని చంపి పట్టువడెను. జనులు వాని చుట్టు మూగియుండిరి. అట్టిసమయమున మూసాప్రవక్త ఆదారిన వచ్చుచుండి "యిట్లేల తటస్థించినది" అని యడిగెను. "త్రాగి తలకుపోసుకొని యతడొకని హత్యగావించెను. వానికి ప్రతివధ యాజ్ఞయైనద"ని చెప్పిరి.

గండుపిల్లికి రెక్క జోడుండునేని
పిచ్చుకల గ్రుడ్లు మాయమౌ పృథ్వియందు;
గాడిదకు నావుకొమ్ములు గలిగెనేని
దగ్గరకు నేరిరానీక తరిమిపొడుచు.

దుష్టునకుఁడబ్బు చేవకుదోడుపడిన
అది యుపద్రవకరమైన హానియగును;
వాడు చెలరేగి బీదల గోడుగుడుపు,
వారి బలహీనకరముల వంచివిరుచు.

బత్తెంబు దేవుండు పంచిపెట్టినను
తగవుల మారులై దానులుండెదరు.

నీచునకు బైడిపదవియు నెగడునేని
తలకు జెప్పులిడుగు, గాలివన్నెగోరు;
చీమ కెరకలు లేకుంట శ్రేయమనెడు
పెద్దలాడిన సూక్తి వినవె నీవు.

నిను ధనికుని గావింపని
జగన్నాథుడు వెఱుంగు నీకు నేయది యుచిత
మని నీ కంటెను హెచ్చుగ;
ననయము నిర్ధనుడవె దేవు నారాధించుమా.

# 16

బస్రాపట్టణమున రత్నవ్యాపారులమధ్య కూర్చుండి యొక యరబ్బి యిట్లు చెప్పుచుండగ వింటిని: "ఒకానొక సమయమున ఎడారియందు దారితప్పితిని. నేను తెచ్చుకొన్న దారిబత్తెము వ్యయమైనది. మరణించుటకు సంసిద్ధుడనయి యుంటిని. ఇంతట నాకస్మికముగ ముత్యముల సంచి నాకు దారిలో దొరికెను. ఆ సంచిలోనివి గోదుమ గారుగులని యనుకొన్నప్పుడు నాకుగలిగిన యపరిమితానందమును, ముత్యములని తెలిసికొన్నప్పుడు నేను పొందిన నిరాశయు హృదయాకులత్వమును ఎప్పటికి నాకు మరపు రాదు."

ఇసుకరేగు నెడారిలో నెండ దప్పి
గొన్నతనినోట ముత్యాలు గుల్లలొకటె;
బత్తెముడుగంటి కూలిన బాటసారి
రొంటి బెంకులు రొక్కంబు రెండునొకటె.

# 17

ఒక యరబ్బి యెడారియందు మిక్కుటముగ దప్పిగొని యిట్లనియెను :

ఆశ ఫలియించునే నేను సంతమొందు
లోన, హైమా, యొక్కనాడేని యూట
పుట్టువలయును మోహాలిపాంత్ర సందు
నీటినంచైన కడుపైన నింపికొందు

ఇదేవిధముగ నొక దరిబేసి యెడారియందు దారితప్పి తినుట కన్నముగాని శ్రమసహించుటకు శక్తిగాని లేకుండెను. వాని యొద్ద రూకలుమాత్రము కొన్నియుండెను. తిరిగితిరిగి వేసారి సరిదారిగానక అతడు బడలికచే మరణించెను. కొంతసేపటికి బాటసారులు కొందరు ఆ మార్గమున వచ్చిరి. మరణించిన యరబ్బియెదుట రూకలు పరవబడి యుండుటయు, ఇసుకలో ఈ పద్యము వ్రాయబడి యుండుటయు వారు చూచిరి.

దారిబత్తెములేకున్న దాయుడెవడు
జాఫరు సువర్ణనిధులకు స్వామియయ్యు;
వేగెడు నెడారి గ్రాగిన భిక్షకునకు
ముదమొసగు గుందమణులు వెండిముద్దకంటె.

# 18

ఎపుడైనను నేను కాలదుర్గతికి కంట తడి వెట్టినది లేదు. దైవ దుర్విపాకమునకు మోము చిట్లించుకొన్నదియు

లేదు. అయినను ఒక సమయమున నా కాళ్లకు చెప్పులు లేక బాధపడుచుంటిని. వెలయిచ్చి కొనుటకు నాకు శక్తి లేకుండెను అట్టిస్థితిలో కూఫానగరము నందలి మసీదు ప్రవేశించితిని. అచ్చట కాలు లేని యొక దురదృష్టవంతుని చూచితిని. అంతట దేవుడు నాకొసరించిన మేలునకు కృతజ్ఞత దెల్పికొని సర్వేశ్వరుని కీర్తించితిని. కాలు లేని వాని కంటె చెప్పులు లేని వాడు అదృష్టవంతుడేగదా యని చెప్పులు లేని యిబ్బందిని సహించి యుంటిని.

మెక్కి తనసినవానికి నెక్కుమదిక
బొరుటు మాంసంబు కంటె నుప్పుల్ల హూర;
తిన మెతుకులేని పేదకు గెనుసుకుంప
తృప్తికలిగించు పారిటిని యొరచింటె.

# 19

ఒకానొకసుల్తాను శీతకాలమునందు కొందరాస్థానికుల తోడ వేటాడబోయెను. ప్రొద్దుగ్రుంకనప్పటికి విడిదియింటికి కాలదూరమున నుండిరి. అచ్చటనున్న యొక పల్లెటూరు వాని యింటినిచూచి "నాకు సడిశము పట్టుకొందునట్టుల రాత్రి ఆ యింట గడిపెదము" అని సుల్తాను చెప్పెను. అందుకు నొక వజీరిట్లనియెను: "పల్లెటూరి వానియింట బసచేయుట గౌరవస్థులగు పాదుషాలకు ఉచితముకాదు. ఇచ్చటనే డేరాకొట్టించి నగడివేయించెదను."

ఈ సంగతి యా పల్లెటూరి రైతునకు తెలిసి అప్పటికి నింటనున్న పదార్థములను ఆయుత్తపరచి సుల్తాను

ప్రోలనుంచి గౌరవ పురస్సరముగ భూమిని ముద్దిడి యిట్లు విన్నవించెను: "యింత మాత్రమునకే యేలినవారి గొప్పతనమునకు లోపము వాటిల్లదు. అయినను పల్లెటూరి రైతు గౌరవము హెచ్చుట వజీరులకు నిష్టము లేదు." ఈమాటలకు సుల్తాను సంతసించి రాత్రి వానియింటనే బస చేసెను. మరునాడు వానికి గౌరవసూచకమగు అంగీని ధనమును బహుమతి చేసెను.

కొన్ని యడుగులదూరము సుల్తాను కాలిక్రింది అంక వన్నెను పట్టుకొని నడచుచు నాతడిట్లనియెనని వింటిని:

గాజువారదు సుల్తాను గౌరవంబు
పల్లెరైతింట నొకరెయి బసయొనర్ప;
రైతు కుళ్లాయికొసకుచ్చు రవికి ముట్టె
దమరివంటి రాజులనీడ దగులుకతన.

# 20

మొండికట్టైయగు నొక పిసినారి బిచ్చగానిని గురించి యిట్లు చెప్పుదురు: ఒకానొక బిచ్చగాడు అపరిమితమైన ధనమును ఆర్జించెను. పాదుషా యాతని పిలువనంపి యిట్లనియెను: "నీ యొద్ద విశేష ధనమున్నదని తెలియవచ్చినది. మాకొక ముఖ్యమైన కార్యము తటస్థించినది. నీదగ్గరనున్న ధనములో కొంతభాగమిచ్చి మాకు తోడ్పడుదువేని శిస్తు వసూలైన వెంటనే నీ ఋణము తీర్చి, నీ మేలుమరవము." ఈ మాటలువిని బిచ్చగాడిట్లు విన్నవించెను:

"మహాప్రభూ, తమవంటి గౌరవస్థులగు పాదుషాలు, కొద్దికొద్దిగా బిచ్చమెత్తిన నాబోటి దరిద్రుని ధనముతో చేయి మలినము చేసికొనుట ఉచితము కాదు." "నీవు చింత పడవలసిన పని లేదు. మలినమునకు మలినమర్హము కావున నీడబ్బు కాఫరులకే యిచ్చెదను. క్రైస్తవు బావినీరు మైలపడునేని దానితో యూదుని శవము కడిగిన దోషముండదు." అని సుల్తాను పలికెను.

అంతట ఆ బిచ్చగాడు రాజాజ్ఞను తిరస్కరించి యన్యాయముగ వాదించి ధనమీయక ప్రతిఘటించెనని వింటిని. సుల్తాను కోపగించుకొని "కోశ శాసనము" ను వానిపై దారుణముగ ప్రయోగింపుడని యాజ్ఞాపించెను.

మంచిమాటల ఫలము లభింపకున్న
బలిమి కార్యంబు సాధింప వలసివచ్చు;
తానె యియ్యని పిసినారి వానిబట్టి
యొరులు బలవంతపెట్టుట యుచితమగును.

# 21

వ్యాపార సామగ్రిమోయు నూటయేబది యొంటెలును నలుబది గులాములును సేవకులుగను గల యొక వణిజుని గాంచితిని. కైష్ ద్వీపమున నొకనాటి రేయి యాయన నన్ను తన విడిదికి కొనిపోయి నాకొక్క నిమిషమైన నూరట చేపడకుండునట్లు తన సొత్తు గొడవ నిట్లు బయలుపెట్టెను: "నాకు తుర్కిస్తానమున ధాన్యపుకొట్లు గలవు. ఫలాని

వ్యాపార వస్తువులు హిందూస్తానమునందున్నవి. ఇది ఫలాని భూమియొక్క విక్రయ పత్రము. ఇది ఫలాని వస్తువు నకుగా ఫలాని మనుష్యుడు వ్రాసియిచ్చిన జామీనుపత్రము'' మరల కొంతసేపిట్లు చెప్పసాగెను: ''సికందరియా నగరము నకు పోవుటకు నేను ఉత్సాహము చెందును. ఏలయన అచ్చటి శీతోష్ణస్థితి హృదయ రంజకముగ నుండును. అయినను ఆ ప్రయాణము కొనసాగదు. పడమటి సముద్రము కలత వారియున్నది. ఓసాధీ, నాకొక్క ప్రయాణము కొరవ చిక్కియున్నది. అది పూర్తియగు నేని నా జీవిత శేషమంతయు తృప్తితో నొకమూల కూర్చుండి కాలము గడపెదను.

'' అది యే ప్రయాణము ? '' అని నేనడిగితిని. ఆత డిట్లనియెను : '' పారసీ దేశపు గంధకమును చీనాకు తీసుకొని పోయెదను. వానికక్కడ వెల హెచ్చుగ లభించును. చీనా పింగాణీ పాత్రలను గ్రీసు దేశమునకు కొనిపోవుదును. ఆ దేశపు జలతారు హిందూ దేశమునకును, అచ్చటి యుక్కు హాలబ్ పట్టణమునకును, ఆ పట్టణములోని యద్దములను అరబ్బీ దేశమునకును, అచ్చటి గీరల గుడ్డలు పారశీ దేశమునకును కొనిపోయెదను. తర్వాత పర దేశ యాత్రలు చాలించుకొని నెమ్మదిగ సంగడిలో కూర్చుండెదను. ఈ విధముగ చెప్పి చెప్పి యింకను చెప్పుటకు శక్తి చాలక, ''సాదీ, నీవుకూడ కని వినియున్న సంగతులు చెప్పు''మని నన్నుకోరెను. నేనిట్లంటిని :

ఘౌరెడారిని బోవు వ్యాపారి ముఖ్యు
డొంటిపైనుండి బడలిక నుర్విఁగూలి
యనియె: ప్రాపంచికుని కన్నులందు దృష్టి
గాని, తుదగోరి మన్నైనగాని నింపు

# 22

హాతింతాయి యౌదార్యమున నెంత ప్రసిద్ధుడో పిసినిగొట్టు తనమున నంత పేరెల్లిన యొక ధనికునిగూర్చి విని యుంటిని. ఆతని బాహ్యస్థితి ఐహిక సంపదలచే నలంకృతమై యున్నది. కాని యాతని స్వభావమున నీచత్వమెంత లోతునను వేళ్లుపారియున్న దనగా, ప్రాణము పోవనున్నను తన చేతితో ఆకొన్న వారికి నొక రొట్టెముక్క నైన పెట్టడు. అబూహురీరా పిల్లికైనను పిడికెడన్నము పెట్టడు. సప్త నిద్రాళువుల కుక్కకేనియు నొక యెముకను విసి వేయడు. వేయేల, యతని యింటితలుపు తెరువబడియుండుట ఎవ్వరును చూచి యెరుగరు, ఆతని యన్నమును ఒక్కడైన ఎంగిలి చేసి యెరుగడు

వాసనయె తప్ప నతని వంటకముల
చవియెరుంగడు పరివేసి పిచ్చుకయును;
మరచియు విదల్చబోడొక్క నారుగాని
కాకి కెంగిలిచేతిని; కఠినుడితడు.

పశ్చిమ సముద్రమును దాటి మిసరు దేశమునకు పోవలసినట్లు ఆతనికొక ప్రయాణము తటస్థించినది. దేవుని

వాక్యము ప్రకారము "వాడు మునిగిపోవునంతవరకు" ఫారూనువలె మిథ్యాగర్వమును భావమున చిత్రించుకొని సముద్రయాత్ర చేయుచుండెను. మరునాడు ఎదురుగాలికొట్టి యోడ ఉయ్యెలలూగుచుండెను.

కప్పగూలిన నిస్పృంశ గుస్తరింప
హృదయమెటు ప్రోత్సహించిన నేమిఫలము?
యానమున కనుకూలమై యనుదినంబు
కోరినట్టుల తెరగాలి గొట్టబోదు.

అతడు చేతులు పైకెత్తి మాటిమాటికి దైవమును ప్రార్థించెనుగాని యేమియు ప్రయోజనము లేకపోయెను. ఓడ పగిలెను. దేవుడిటు సెలవిచ్చి యుండెనుగదా· "సముద్ర యాత్ర చేయునపుడు మీరు సర్వేశ్వరుని ప్రార్థింతురు."

పరమదాతృత్వమును బూనవలసినపుడు
కక్షవిన్యస్తహస్తులై, కష్టవేళ
దైవమునకు చేతులుచాపు దాసజనులు
ప్రార్థనాంజలి యిడనేమి ఫలముగలుగు?

ధనము ననుభవించు; తనువుమర్త్యులకిచ్చి;
ధరణి నీకు శాశ్వతంబుగాదు;
ఇంట వెండి పైడి యిటుక లొక్కొకటిగా
దీయుమోయి; గాలికి వ్రేబతుకును.

ఆతనికి మిసరుదేశమున నిరుపేదలైన చుట్టములుండి రని చెప్పుకొనిరి. వారి మరణానంతరము ఆభాగ్యము సంక్ర మించి వారు ధనికులైరి. వారు ప్రాతయుడుపులను చించి

వేసి సన్నని మిసరు దేశపు వస్త్రములను ధరించిరి. వారము దినములు గడవకి పూర్వమె వానిలో నొకడు గాలివలె దౌడుతీయు గుర్రము నెక్కి యందమైన చందముగల గులాము వెనువెంట పరుగెత్తుచుండ సవారి చేయుచుండెను.

మృతుడు క్రమ్మఱనింటికి నేగుదెంచి
యాస్తినాయది, లెంటు పొందుటను నయ్యొ!
వారసుల దుఃఖమింతని పలుకఁగలమె?
యిష్టబంధుల మృతికంటె గష్టతరము.

ఘాన్వాము యీతం కనుపఱచిన చనవువలన ఆతని చొక్కాయిగొంగు పట్టుకొని యిట్లనెను:

తాననుభవింప కొంచలకు
దానము సేయుకయు దినిని తనమున గరుణా
హీనుడు చేర్చినవిధి ము
ర్త్రా, నిత్యము ననుభవింపు ధన్యాత్ముడవై

## 23

దుర్బలుడైన యొక బెస్తవానివలలో బలముగల పెద్దచేప పడెను. దానిని పైకీడ్చుటకు వానికి సత్తువ లేకుండెను. ఆ చేప వానిని గుటకాయించి వలను నీటిలోనికీడ్చుకొని పోయెను.

నీటికొరకు బాసిన సెలయేటికరుగ
నేట నీరుబ్బి వెల్లువ నేగె నతడు;
ఎన్నిమారులో వల చేఁనిచ్చెగాని
యీ తడవ జేప యడుగునకీడ్చె వలను.

"అటువంటి యరుదైనచేప నీ వలలో పడినది. దానిని నీవు బయటికి లాగ లేక పోతివి" అని తోడిజాలరులు ఆతనిపై విసుగుకొని చీవాట్లుపెట్టిరి.

"ఓ యన్నలారా, నేనేమిచేయగలను? నాకీవేళ దురదృష్టము పట్టినది. దానికింక నొకదినము ఆయుష్యము న్నది." అని యాతడనెను. అదృష్టము లేనిదే 'దిజ్లా' నది యందు జాలరి చేపలు పట్టలేడు. దురదృష్టము నెట్టుకొని రానిదే చేప గట్టుపై నెగిరిపడి మరణింపదు.

# 24

కాలుసేతులు లేని వాడొకడు నేయికాళ్ళ జెఱ్ఱిని చంపెను. పుణ్యాత్ముడొకడా తట్టునపోవుచుండి యిట్లనియెను: "పరాత్పరుడు కీర్తింప బడుగాక! తనకు వేయికాళ్లుండియు మృత్యువు దాపురించి యున్నందున. కాలుసేతులు లేని వానికి చిక్కక పరుగెత్తుటకు శక్తి చాలక యుండెను"

ప్రాణములు తీసెడు విరోధి పదము వెంట
బడిన, బరుగెత్త నీయక పాటు ప్రాప్తి
యడుగు లరికట్టు; నరిపైన బడిన యపుడు
గాండివము పంచిననేమి కార్యముండు?

# 25

విద్యావివేక శూన్యుడొకడు జలతారు పువ్వుల యంగీ దొడుగుకొని, మిసరు మస్లీను తలపాగ చుట్టుకొని

యరబ్బీ గుఱ్ఱము నెక్కి వచ్చుచుండ నేను చూచితిని. నా ప్రక్కనుండిన యొక మిత్రుడిట్లనియెను: "ఓ సాదీ! విద్యావంతుల కుచితమైన యుడుపులను ఆ పశుప్రాయుడు ధరించుకొని యుండ నీ కెట్లగపడుచున్నాడు?"

"వేయి జలతారు అంగీలకంటె కొలదిపాటి సహజ సౌందర్యమే శ్రేష్ఠమని పెద్దలు చెప్పిరి."

అంగి తలగుడ్డ బయిటి బెడంగువప్పు
నతని మూసవుడని చెప్ప నలవిగాదు;
ఆస్తిపాస్తులు వెదకిన నందు మనకు
గ్రాహ్య మగునది యాతని తక్త మొకటె!

నత్కులీనుడు తగ్గి యుశస్తుడైన
నతని యౌన్నత్యమున కేమి హానిలేదు;
వెండి వాకిటికిం బైడి కొండియున్న
యూదుడు కులీను డౌనని యూహ గొనకు.

# 26

ఒక దొంగ బిచ్చగానితో నిట్లనియెను: "యవబీజమంత వెండికైనను కన్నకన్నవారి కాళ్లు కడుపులు పట్టుకొని దేబిరించుటకు నీకు సిగ్గులేదా!" అందుకు బిచ్చగాడిట్లు జవాబు చెప్పెను:

పావులాబేడ దొంగిలి పట్టుపడుచు:
జేయి నరికించుకొను నీదు జీవనంబు
కంటె, వేడంగ, దాతలు కనికరించి
యీయ జేచాపు నా స్థితి యెంతొ మేలు.

# 27

బాహు బలాఢ్యుడగు నొకయువకుడు కాలదుర్గతికి చింతిల్లు చుండెను. మిక్కుటమగు ఆకటిచిచ్చువల్లను పేద రికము చేతను ప్రాణములు విసిగి యొకనాడు తండ్రియొద్దకు వచ్చెను. తనదుఃస్థితిని గురించి మొరపెట్టి దేశాటనమునకు అనుమతి వేడుచు ఆతడిట్లనియెను: ''నేను యాత్ర సేయుటకు నుద్దేశించి యున్నాను, బాహుబల సాహాయ్యమువలన నా కోరికలు నెరవేర్చుకొందును. పెద్దలిట్లు చెప్పియున్నారు గదా.

కళలు శాస్త్రంబులు మరెట్టి జ్ఞానమైన
అప్రయుక్తంబుగా నున్న వ్యర్థమగును;
అగరు నిప్పున బడకున్న, సరుగ జొద
కున్న గస్తూరి, నెత్తావియుట్టి పడునె?''

ఈ మాటలకు తండ్రి యిట్లనియెను: ''కుమారా, యీ పిచ్చితలంపులు నీ మనమునుండి వెడలింపుము. ఉన్న దానితో తనివిచెంది క్షేమముగ బ్రతుకుము. ఏలయన ప్రాజ్ఞులిట్లు చెప్పియుండిరి: ''ఐశ్వర్యము ప్రయత్న సాధ్యము గాదు. దానిని గురించి పరితాపపడకుండుటయె అందుకు తగిన ప్రతిక్రియ.''

పట్టి బలవంతముగ నెట్టివాడుగాని
లక్ష్మి జలతారు పయ్యెద లాగలేడు;
గ్రుడ్డివాని కన్బొమ్మల గుంచెతోడ
శిల్పి మసిరేక దిద్దిన చెలువు గనునె?

నీకు దలవెంట్రుకలయన్ని నేర్పులున్న
కాని కాలాని కేవి యక్కరకు రావు
ఎంత శక్తియుండి యభాగ్యుడేమి సేయు?
బాహూబలము కంటె నదృష్ట బలమె బలము!

ఈ మాటలువిని కుమారుడిట్లనియెను: "నాయనా, యాత్రవలన ననేకలాభములు సమకూడును. మనస్సునకు సంతోషము హెచ్చును. చిత్రవిచిత్ర సంఘటనముల చూడవచ్చును. ఆశ్చర్యకర మగు వార్తలు వినవచ్చును. ఉబు సుషోకకు పట్టణములలో విహరింపవచ్చును. ప్రియమిత్రులతో సంభాషింపవచ్చును. మట్టుమర్యాదల నేర్చుకొనవచ్చును. ధనమార్జింపవచ్చును. క్రొత్తమిత్రుల పరిచయము చేసికొనవచ్చును. సమకాలీనమైన లోకానుభవము పొందవచ్చును. మరియు సన్మార్గ ప్రవర్తకులిట్లు చెప్పియున్నారుగదా:

కుదువ పడినయట్లు కదలక నీవింట
నుండ, మానవత్వ మొనరదెపుడు;
దేశదేశములను దిరిగి వేడుకచూడు,
పుడమి పీడినీవు పోకమున్నె.

ఈ మాటలకు తండ్రి యిట్లనియెను: "కుమారా, నీవు చెప్పినట్లుగనె యాత్రవలన ననేకలాభములు చేకూరును. అయినను అది యైదువర్గముల మనుష్యులకే సౌఖ్యప్రదముగ నుండును. మొదటివాడు వర్తకుడు. అతడు భాగ్యవంతుడు. శక్తిమంతుడు. దాసదాసీజనము, జాగరూకులగు సేవకులు ఆతని కాచుకొని యుందురు. దినమునకొక పట్టణము,

రాత్రికొక విడిది. గడియకొక వినోదస్థానము, క్షణమునకొక సంతోషము చొప్పున వణిజుడు యాత్రా సౌఖ్యము ననుభవించును.

భాగ్యవంతునకు నెడారి బయల, వనుల,
గొండ కోనల నెందునే కొదవలేదు;
ఎచట విడియు, గుడారంబు లచట లేచు;
నఖిల భోగంబు లాజ్ఞన నవతరించు.

కాంక్ష లీడేర్చుకొన చిల్లిగవ్వ లేక
యుత్త చేతుల నిరుపేద యోగ్యుడయ్యు
వాడెవండని యడుగరు తోడిజనులు;
అతడు స్వస్థానమందైన నన్యుడగును.

రెండవవాడు పండితుడు మధురమైన వక్తృత్వము అనర్గళమైన వాక్చాతుర్యము విజ్ఞానసంపన్నత కలిగియుండుటవలన పండితుడు ఎచ్చటికి పోయినను లోకులాతని నాదరించి మర్యాదచూపు చుందురు.

శాస్త్ర పాండితి బంగారు నవర యట్టు
లెచటజూపిన దన్మూల్య మెరుకపడును;
అక్షరాస్యుడుగాని ధనాఢ్యసుతుడు
తోలునాణెంబు, పరభూమి గేలగొనరు.

మూడవవాడు సౌందర్యవంతుడు. రూపవంతుని జూచినపుడు పుణ్యాత్ములును వానితో కలిసిమెలసి యుండ గోరుదురు. "అపరిమిత ధనముకంటె పరిమితమయ్యు సౌందర్యము మేలు" అని పెద్దలు చెప్పిరి. రమణీయ

వదనము సంతప్త హృదయులకు జీవనౌషధము వంటిదనియు, మూయబడియున్న తలుపులు తెరచుటకు కుంచె కోలవంటిదనియు పెద్దలు చెప్పిరి. వేయేల, ఆగాని సాంగత్యమబ్బుట మహాభాగ్యమని తలపోసి లోకులు వానిని కన్నుల నద్దికొందురు.

తల్లిదండ్రులు చీకొట్టి యిల్లు వెడల
గొట్టినను నందగాని కేకొరతలేదు;
ప్రేమ గౌరవములు చూపి ప్రియుని పోల్కి,
నాత డెచ్చోటి కేగిన నాదరింత్రు.

నెమిలియాక 'ఖురాను'లో నేను గాంచి
యిట్టులంటిని: "తగదు నీకిట్టి పదవి"
"మాటలాడకు, సౌందర్య మహిమవనర
నెటకు బోయిన జేయూత కేమిలోటు?"

మోహనుండు మంచిముత్యమౌ; ఆదిశుక్తి
గర్భమందెయుండ గనదుశోభ;
అణిముత్యమైన నత్యంత మూల్యంబు
నిచ్చి కొందు రెవ్వరేని నంత.

నాలుగువవాడు గాయకుడు. ఆతని మధురగానము దావీదు తిత్త్రిక్రోవి పాటవలె హృదయరంజకమయి ఎగురు పక్షిని పారుసిటిని అడ్డగించును. ఆతడు సంగీత కళానైపుణ్యము వలన శ్రోతల చిత్తమును హరించును. దైవభక్తులును వానితోడ కూర్చుండి వివిధ పరిచర్యలు సలుపుటకు నిచ్ఛగింతురు.

ప్రత్యూషంబున గై పెక్క ద్రావునఖుల
చెవుల కమృతంపు టూట రుచింమపాట!
నాణెమగు మోముకంటె గానంబు మేలు;
దాన గామంబు, దీనసాత్మకు సుఖంబు.

అయిదవవాడు పనిపాటు సేయువాడు. ఆతడు తన చేతుల కష్టముతో అన్నము సంపాదించుకొనును. తాను ఆత్మగౌరవమును బలియిచ్చి కడుపు నింపుకొనవలసిన యవసరముండదు. పెద్దలిట్లు చెప్పియున్నారు:

సాచికుండన్య దేశమున చనిన జేత
గాసులేకున్న దిండికి గాసిపడడు;
రాజ్య విప్లవమున బద భ్రష్టుడైన,
రొట్టెముక్క దొరకక నమ్రూజు చచ్చు.

కుమారా, నేనిప్పుడు వివరించిన గుణములు యాత్ర యందు మనస్సుకు శాంతి చేకూర్చును. సంతోషమునకు తావలమగును. వీనిలో నొక్క గుణమైన లేనివాడు పిచ్చి తలంపులు పెట్టుకొని పర దేశ మేగునేని వాని ఊరూ పేరు విచారించువారుండరు.

కాలచక్రము వ్యతిరేకగతి భ్రమింప
గలసి రాకుండు ననుకూల కార్యమేని;
క్రమ్మఱ కులాయమునుగాంచు ప్రాప్తిలేక
పావురము ధాన్యలుబ్ధమై వలను జిక్కు.

అంతట కుమారు డిట్లనియెను: "తండ్రీ, పండితుల వాక్యములకు నే నెట్లు విరుద్ధముగ ప్రవర్తింపగలను!" వారిట్లు చెప్పిరి:

"మన దినబత్తెము దైవ నిర్ణీతమయ్యెను దాని నార్జింప వలసిన భారము మనపైనున్నది. మన మనుభవించు కష్టములు విధి కృతములయ్యెను వాని యెడ జాగరూకులమై యుండుట ఆవశ్యకము."

మన తలవులేక తిండి సంప్రాప్తమయ్యె
నార్జనము సేయ దెలివికి సర్థమగును;
వ్రాత దిరుగనిదే చావురాదటంచు
బామునోటను జెయివెట్ట బాడియగునె?

నేనిప్పుడుండు స్థితిలో మదగజము తోడనైన పోరాడ గలను. భయంకరమగు సింహముతో పెనగులాడ గలను. కావున నాయనా, యాత్ర చేయుటయే నాకు హితమని తోచుచున్నది. యిక మీద పేదరికము నోర్చుకొనుటకు నాకుశక్తి లేదు.

పరువును బ్రతిష్ఠ దొలగినవానికంక
భరమగునదేది? జగమెల్లవానియిల్లె!
ప్రొద్దుక్రుంకిన నింటికిబోవు ధనికు,
డెచట నిసియౌనొదరిజేసి కచట విడిది.

యిట్లుచెప్పి జనకుని యాశీర్వాదము పడసి సెలవు పుచ్చుకొని పయనించుచు యువకుడిట్లు వచించెను :

కాల మెదురు దిరిగి కాంక్ష లీడేరక
పోవునేని, నేర్పు పొనగువాడు
ఎవరుగాని తన్ను నెరుగని పరదేశ
మందు బ్రతుక నెంచి యచటికేగు.

ఆతడట్లు నడచి నడచి సముద్రతీరము చేరెను. తరంగ తాడితములై గండశిలలు ఒకదానిపై నొకటి పడియుండెను. సముద్రఘోష మూడు మైళ్ళవరకు వినబడు చుండెను.

అనిల సంక్షుబ్ధ వార్ధి భయంకరోర్మి
మాలికా డోలికల నీటి కోళులైన
క్షేమముగ నిల్వలే; వెక్క చిన్న యలయె
వెలికి గానుగ రాతిని విసర గలదు.

పడవ రేవుకడ మూగియుండిన యాత్రికుల సమూహ మును యువకుడు చూచెను. అందు నొక రొక్కరును మూటా ముల్లెకట్టుకొని కేవిచ్చి పడవలలో నెక్కి కూర్చుం డిరి. పడవకూలి యిచ్చుటకు వానియొద్ద పైసా యైన లేక వారి నెంత బతిమాలుకొన్నను కనికరము చూపకుండిరి. కఠినాత్ముడగు నొక నావికుడు మొగము చిట్లించుకొని యిట్లనియెను : "ధనము లేకున్న మమ్ము బలవంత పెట్ట లేవు. ధనముండిన బలిమితో నావశ్యక ముండదు."

ధనము లేకున్న బాధోధి దాటలేవు
బాహు బలమెంతయుండిన బైత్య్హకాడ,
పదుగురి బలంబు మావద్ధ బయలు పెట్ట
నేమికార్య! మొక్కనికేప్ర నిచ్చుకొమ్ము.

నావికుని మాటలు యువకుని చెవులలో ములుకులై గ్రుచ్చుకొని వానిపై కసి దీర్చుకొన దలచెను గాని యంతలో పడవ కొంతదూరమేగెను. "నేను తొడుగుకొని

యున్న చొక్కాను కేవుకు బదులు నీవు తీసుకొని తృప్తి పడుదువేని యిచ్చుటకు నాకేమి యభ్యంతరము లేదు,” అని యువకుడు బిగ్గరగ నరచి చెప్పెను. ఆ మాటలు విని నావికుడు చొక్కాపైని యాసతో పడవను వెనుకకు మరలించి గట్టు చేరెను.

> అత్యాశనిద్రిద్రు సంధునిజేయు
> బులుగులం జేపల వలలజిక్కించు.

నావికుని మెడపట్టయు గడ్డపు పీచులును చేతికంద గనే ముందుకులాగి మెడకరచుకొని క్రిందపడద్రోసి నిర్దయముగ యువకు డాతని మర్దించెను. దీనిని జూచు చుండిన నావికుని స్నేహితుడొకడు తోడ్పడుటకుగా పడవదిగివచ్చి యువకుని నెదుర్కొనెను. వానికిని నావికుని కైనంత మర్యాద జరిగినది. అతడు వెనుకకు మరలి కాలికి బుద్ధి చెప్పెను. ఇట్టి బలవంతునితో రాజీ చేసుకొని కేవు నడుగ కుండుటయే యుచితమని పడవవాండ్రు కలబలుకుకొనిరి.

> తగవురానున్న దొనకక తాల్మిగొనుము;
> బొత్తిగ వివాదములమాన్పు మెత్తవనము;
> మంచిమాటలనెయ్యాన మదగజంబు
> నైనవెంట్రుకతో గట్టనలవియౌను.
> తిట్టుకయ్యముగల్గ తియ్యగాపలుకు;
> పచ్చిపట్టునుగోయ బాకుతరంబె?

నావికులు యువకుని పాదములపైబడి మన్నన వేడు కొని తెచ్చినోలు వలపుచూపి మొగమునను కన్నులపైని ముద్దులు గురిపించి యాతని పడవలో కూర్చుండబెట్టుకొని ప్రయాణము సాగించిరి.

కొంత దూరము పోయి నీటిలో పాడుపడియుండిన యూనాను సౌధస్తంభము ప్రక్కన పడవ నిలిపి నావికు డిట్లుచెప్పెను: "పడవ అపాయకర స్థితిలో నున్నది. మనలో బాహు బలాఢ్యుడు ఎవ్వడైనను ఆ స్తంభమెక్కి మోకును దానికి ఉచ్చువేసిన మనము పడవను రక్షించుకొన వచ్చును." యీ మాటలు విని బాహుబల గర్వితుడగు నాయువకుడు పరాజితుల ప్రతీకారమునైన తలంపక, "నీవు మొట్టమొదట దుఃఖపెట్టినవాళ్లని అటుతర్వాతనూరుమారులు సంతోషపెట్టినను వాని ప్రతీకారమునెడ జాగరూకుడవై యుండుము. హృదయమునుండి బల్లెమును పెరికివేసినను గాయము పచ్చిగనే యుండును." ఒక సేనాధిపతి సైనికు లతో నిట్లు చెప్పెను:

"పరసైనికుల గాయ పడజేతురేని
మరచిపోకుడు వారి పతి రాజు గనిని
యితరుల హృదయంబు నీవు నొప్పింప
హటనుకై వేచి నిష్కృతి నొప్పింతు;
కోటకుప్పైను రాత గొట్టినవేని
కొట్టిద రొకరాయి కోటపైనుండి."

అను నిట్టి పెద్దలవాక్యములను సడ్డచేయక ఆ యువ కుడు మోకును చేతికి తగిలించుకొని స్తంభము పైకెక్కెను. తక్షణమె నావికుడు వాని చేతిలోనుండిన త్రాటిని లాగు కొని పడవను వేగముగ కదలించెను.

యీ మోసమున కాతడు వెరగందిచూచి యేమి చేయునది లేక రెండు దినములా స్తంభముపై గాసిపడి

యలసి సొలసి మూడవనాడు నిదుర తబ్బిబ్బున నీటిలో పడెను. తరువాత నొక రాత్రియు నొక పగలును ఈది యీది యెట్లో యాపద తప్పించుకొని కొనయూపిరితో నొడ్డునబడెను. ఆకటి మంట తీర్చుకొనుటకు ఆకలములు వేరు వెల్లంకులు తిని కొంత సేదదేరి నడువ శక్తిగలిగిన వెంటనే యా మందభాగ్యుడు ఎడారి దారి పట్టెను

కొంతసేపటికి ఎండ తాపమునకు దప్పి హెచ్చి కాలు మెదల్ప దిటువులేక సమీపమున పథిక సమూహమును గాంచి యచ్చటి కేగెను. ఆచోట నొక బావి యుండెను. బాటసారు లొక్కొక్కరును సొంతగానికి నొక్కొక రూక యిచ్చి పర్బతుకంటె ప్రియముగా నొక గిన్నెడు మంచి నీటిని త్రాగుచుండిరి యీ యువకునిచేత కాసైన లేదు. ఆతడెంత బతిమాలి భంగపడినను ఎవ్వారును కనికరింప కుండిరి. అంతట దౌర్జన్యము వహించి కొందర క్రింద పడ మొత్తెను. పథికులందరు నొక కట్టుగట్టి యాతని నిర్దయ ముగ మర్దించి గాయపరచిరి.

లావు పొడుగెత్తు కండబలంబుగలుగు
కరిని జోరీగలొకటైన గాసివెట్టు
గండుచీమలు దొంతర గట్టిక్రమ్మి
భీకరమృగేంద్రు చర్మంబు ఒప్పిసేయు.

ఆయువకుడు కొంతసేపువర కట్లే కూర్చుండి యక్క రనుబట్టి వర్తకుల బిడారు వెంటబడి పోవుచుండెను. రాత్రి యగునప్పటికి దొంగల యలజడి మిక్కుటముగనుండు నొక మజిలీ చేరిరి. సార్థవాహులకు నొడలు దడపుట్టెను, ప్రతి

క్షణము మరణము నిరీక్షించుచుండిరి. ఈ సంగతి తెలిసి కొని "మీరు భయపడకుడు. మీ మధ్య నేనొకడ నున్నాను. నేనొకడనే యేబదిమంది మనుష్యులకు జవాబు చెప్పగలను. మీలోని తక్కిన బలవంతులు నాకు తోడ్పడ గలరు" అని యువకుడు వారికి ధైర్యము చెప్పెను.

వర్తకు లాతని ప్రగల్భములకు మనసు కుదుటపడి యతని సహవాసమునకు సంతోషించి అన్నపానీయముల నొసగుట యావశ్యకమని తలచిరి. యువకుని యాకటిమంట చెల రేగినది; ఓపికగొను శక్తి సన్నగిల్లినది. యాకలిదీర కొన్ని బొక్కలు బొక్కి పయింబయి నీరు ద్రావి కడుపు లోని దయ్యమును శాంతింప జేసెను. కడుపు నిండినంతనే నిద్దుర పైకొనెను.

వర్తకులలో ననుభవజ్ఞుడగు నొక వృద్ధుడుండెను. ఆతడు వారితో నిట్లనియెను: "దొంగల భయముకంటె మీ సహవాసగాని భయమె నాకు మిక్కుటముగ నున్నది. అదెట్లన, ఒక బీదవా డెట్లో కొంత ద్రవ్యము సంపాదించెను. ఆతనికి లూరియాన్ దొంగల భయముచే రాత్రులు నిద్రపట్టకుండెను. యొంటిపాటునకు భయపడి తనకు తోడుగానుండుటకు నొక స్నేహితుని పిలిచెను. కొన్ని రాత్రులు వాడు ఆతనికి తోడుగా నుండుకొనెను. ఇట్లు కొంత కాలము జరిగిన వెనుక బీదవాడు డబ్బు దాచియుంచిన చోటు తెలిసికొని యా స్నేహితుడు దానిని దొంగలించి ఖర్చు పెట్టుకొని యెచ్చటికో పయనించెను.

ప్రొద్దున లేచి చూచుకొని యా బీదవాడు లబో దిబోయని కొట్టుకొనుచుండ నొకడు విని, "యెందుకట్లు దుఃఖించుచున్నావు? నీ ధనమును దొంగలెవరైన దోచుకొనిరా?" యని యడిగెను "అయ్యో దేవుడా! దొంగలు కారు. నా స్నేహితుడే దొంగిలించుకొని పోయెను," అని చెప్పెను.

చెలిమికాని స్వభావంబు దెలియునంత
వరకు నొకకంట గనిపెట్టవలయు వాని;
చెలిమినెపమునదగ్గర జేరికరచు
శత్రువులపంటిగాటులు చాలచురుకు.

ఈతడు దొంగల గుంపులోనివాడు కావచ్చును. నిజము నెవరెరుంగఁగలరు? కపట వేషముతో మన మధ్య ప్రవేశించి యంతు పొంతు లసి యొళ్ళెరింగి సరియదును వేచి వీడు తన సహచరులకు తెలుపవచ్చును. కావున నిద్ర పోవుచున్న వీనిని వదలిపెట్టి మూటా ముల్లెలు కట్టుకొని మనము పయనించుటయే యుచితమని నాకు తోచుచున్నది." వృద్ధుని యీ హితబోధ తక్కిన వారందరు నంగీకరించిరి. యువకుని బాహుబలమునకు వారందరు వెరపుగొని సామాను కదలించుకొని నిదురించుచున్న యాతని విడిచిపెట్టి పోయిరి.

అతడు నిద్రలేచు నప్పటికి సూర్యుడు నడిమింట నుండెను. తలయెత్తిచూడ వణిజుల బిడారు లేచిపోయి యుండెను. ఈ దురదృష్టవంతుడు ఎడారిలో తిరిగి తిరిగి సరిదారి గానక యాకలి దప్పులచే తపించి చావునకు సిద్ధ

మయి మోమునిసుకపై మోపి యిట్లనియెను: "ఒంటెలు కదలి పోయినవి. నాతోడ నెవ్వరు సంభాషింతురు? అన్యు నకు నన్యుడు తప్ప స్నేహితులు మరెవ్వరును లేరు. పలు మారు పయనించి యాత్రలోని కష్టసుఖము లెరుగనివాడు పరులను కష్టపెట్టును" యీ నిర్భాగ్యు డిట్లు పలుకు చుండగా పాదుషా కుమారుడొకడు వేటతమకమున అనుచ రులను దూరమున వీడి, యీ మార్గమున పోవుచుండి, వాని తల తట్టు నిలిచి, యీ మాటలు విని, వానిని నిదానించి చూచెను.

రూప సౌష్ఠవ మున్నను ప్రస్తుత స్థితి శోచనీయముగ నుండుట యెరిగి, "ఎచ్చటనుండి వచ్చితివి? ఈ స్థలమున కెట్లు చేరితివి?" అని రాజకుమారుడు ప్రశ్నించెను. తనకు సంప్రాప్తమైన కష్టములను యువకుడు సంక్షేపముగ విన్న వించెను. ఆతని దుఃస్థితికి జాలిగొని ద్రవ్యమును అంగీని యిచ్చి నమ్మకమైన బంటును దారి తోడిచ్చి యువకుని స్వస్థానమునకు సాగనంపెను.

కుమారుడు క్షేమముగ తిరిగి వచ్చినందుకు తండ్రి సంతోషించి దేవునికి వందనము లర్పించెను. రాత్రి భోజనా నంతరము యువకుడు పడవ వృత్తాంతము, నావికుల దౌర న్యము, బావిదగ్గర బాటసారుల దుడుకుతనము, వర్తకుల మోసము, మరియు యాత్రయందు తనకు సంభవించిన కష్ట పరంపరలను తండ్రితో పూస గ్రుచ్చినటుల వివరించెను. అంతట తండ్రి యిట్లనియెను: "కుమారా, నీవు ఇల్లు వెడలు

నప్పుడు ధనహీనుని ముంజేయి శౌర్యవంతమయ్యు నిగళ బద్ధమనియు, సింహముష్టి పోసగియున్నను అది భగ్నమగు ననియు నీతో చెప్పియుండ లేదా ?" "యేబది మణుగుల బలమునకంటె నొక యవయెత్తు బంగారమే మేల"ని రిక్త హస్తుడగు సిపాయి చెప్పెను. యీ మాటలకు కుమారు డిట్లనియెను: "నాయనా, యెట్లయినను కష్టపడకున్న, ఆప దలకగ్గము కాకున్న విరోధుల జయింప నేరవు. ధాన్యము చల్లకుండిన పంట లభింపదు కొంచెము దుఃఖమునకు ప్రతి ఫలముగ నేనెంత సంతోషము నార్జించినదియు, తేనెటీగ కాటున కోర్చుకొన్నందుకు ఎంత తేనెను సేకరించినదియు నీవు చూడ లేదా ?"

అన్నమీశ్వర నిర్ణీతమయ్యు, గడన
యందు నలసులమైయుంట న్యాయమగునె?
చోరచేపరంపపు వెరగూరునేని
ధీవరుడు ముత్యముల నెట్లు దేగలండు?

తిరుగలి క్రిందిరాయి తిరుగక యున్నందుకు మిక్కుటమైన భారము మోయుచున్నది.

గుహనుబడియున్న సింహము కుడుచుటెట్లు?
రెక్కలొలచికడేగ యే దిక్కు కెగురు?
ఇంటగూర్చుండి వేటాడనెంతువేని
కాలుసేతులు సాలీడు కాళ్ళగును.

ఈ మాటలకు తండ్రి యిట్లనెను: "ఈ పట్టున దైవము నీకు ననుకూలపడినది. నీ యదృష్ట వశమున రాజకుమారుడు నీ వద్దకు వచ్చుట తటస్థించి నీ మంచి సెబ్బ

రలు విచారించి కరుణించెను. ఎల్లకాల మదే విధముగ సంఘటింపదు. కావున నిట్టి విచిత్ర సంఘటనలపై నాధార పడి యుండకుము.

అనుదినము వేటకానికి
వనమున జంబుకము నేయవచ్చునె? యెపుడో
కనిపెట్టి చిరుతపులి యా
తని డొక్కనుజీల్చి నల్లద్రావగవచ్చున్.

సందర్భోచితముగనున్న యీ కథను వినుము : పార సీక ప్రభువునకు అమూల్య రత్నము పొదుగబడియున్న యొక యుంగర ముండెను. ఆయన యొకనాడు వినోదార్థ ముగ కొందరు యాస్థానికులతోడ షీరాజు పట్టణ ప్రాంతముననున్న 'ముసల్ల' యను పట్టణమునకు పోయెను. తన వ్రేలి యుంగరము తీసి 'అజద్' గోపురముపై నిలబెట్టించి, యుంగరముగుండ దూరిపోవునట్లు ఎవడు బాణము విడుచునో వాడీ యుంగరము తీసికొనవచ్చునని చాటింప జేసెను.

రాజ దళములో నుండిన నన్నూరుమంది గడితేరిన విలుకాండ్రు గురిపెట్టి తప్పగొట్టిరి. యొక మేడపై నాడు కొనుచుండిన బాలుడు ఆటకాయ తనమున నుద్దేశ రహిత ముగ బాణమును వదలెను. అనుకూలముగ వీచుచున్న ప్రాతర్వాయువు ఆ బాణము వుంగరములో దూరునట్లు విసరెను. ఆ బాలునకు నుంగరము ధనము అంగీయు నాద రణ పూర్వకముగ బహూకరింపబడెను.

అంతట నా బాలుడు వింటెని అంబును కాల్చివేసెనని చెప్పుకొనిరి. "ఇట్లేల చేసితివి?" అని వాని నడుగగా, "మొదటికీర్తి శాశ్వతముగ నుండుటకు" అని యాతడు చెప్పెను.

ఒక్కొకప్పుడు ప్రతిభాసముజ్జ్వలుండు
పలుకు హితము కృతార్థత పడయుకుండు;
అజ్ఞుడగు బాలకుడు వేసినట్టి యంబు
తప్పిదారి లక్ష్యంబును దాకునెపుడొ.

# 28

బాహ్య ప్రపంచ సంబంధము వదలుకొని కొండ గుహాలో వహించుచు కాలము గడపు దరివేసినిగురించి నేను వినియుంటిని. పాదుషాలును, భాగ్యవంతులును ఆతని కంటికి తృణప్రాయులుగ నగపడుచుండిరి.

యాచనంబున కొడిగట్టు నతడు చచ్చు
వరకు దిండికి జేచాపవలసివచ్చు;
ఆసవీడి నృపాలత్వ మందుమోయి,
తృప్తిపరుకంత మున్నతస్థితివహించు.

ఆ ప్రాంతపు పాదుషా ఆ సన్యాసిని సందర్శించి యిట్లు విన్నవించెను: "మీ దయార్ద్రమగు మానవ స్వభావముపై నాధారపడి, మా యింట నొకపూట మా కున్న యుప్పు పులుసు రుచి చూడవలయునని ప్రార్థించుచున్నాను." మహమ్మద్ ప్రవక్త యాచారమునకు నిట్టి యాహ్వానము అనుకూలము కావున ఆయన యంగీకరించెను. మరునాడు, తా నొసంగిన శ్రమకు మన్నన వేడుటకుగా పాదుషా సన్యా

సిని దర్శింప వచ్చినపుడు ఆయన యెదురుకోలొసగి కౌగి లించుకొని యాదరించి సన్నుతించెను. పాదుషా పోయిన వెనుక యచ్చటనున్న వారిలో నొకడు ఇట్లడిగెను: "యీవేళ పాదుషాకు మీరు చూపిన దయ మీ యభ్యాస మునకు వ్యతిరిక్తముగ నున్నది. ఇట్టిది మరి యెప్పుడును నేను చూచి యెరుగను." అందుకు షేకు ఇట్లనియెను: "ఒక పుణ్యాత్ముడు సెలవిచ్చిన సూక్తిని నీవు వినలేదా?

పిలచిపెద్దజేసి ప్రియముగా దినబెట్టి
నతడు; మరలనీకు నతిథియైన,
ఎదురుకోలొసంగి యెదమెచ్చ బరిచర్య
నలుపు; మదియు బ్రాజ్ఞసమ్మతంబు.

ప్రాణముండినదాక వేణువీణా గీతి
విననీకచెవుల లోగొనదవచ్చు;
ఉద్యానవనదర్శనోత్సాహ మక్షుల
కలతనీయక యాజ్ఞ నిలుపవచ్చు;
ముద్దుగులాబిల మూర్కొననీయక
ఘ్రాణేంద్రియంబును గట్టవచ్చు;
పట్టెమంచము దిండ్లు పరుపులు లేకున్న
బండపైదలమోపి పండవచ్చు;

పడుకతోడుగ బూబోణి బడయకున్న
జేతు లెదగట్టుకొని నిద్రచెందవచ్చు;
గాని కొరగాని యీపాడు కడుపునెపుడు
అదనుకేదైనవేయక యణచలేము.

# చతుర్థాధ్యాయము

# మౌనమువలని లాభములు

## 1

"మిత భాషిత్వమె నాకు సమ్మతముగ నుండెను. ఏలయన, చాల సమయములందు మనము మాటాడున ప్పుడు మంచి మాటలును చెడ్డమాటలును దొరలుచుండును. విరోధులదృష్టి చెడ్డమాటలపై దప్ప వేరొంటిపైకి ప్రసరిం పదు" అని నే నొక స్నేహితునితో చెప్పితిని. ఆత డిట్లని యెను : "సోదరుడా, నీయందు మంచితనమును చూడని విరోధియే మేలైననాడు."

ఎపుడు వైరుధ్య కలుషిత దృష్టిజూడ
నొప్పులునుదోచు కొండంత తప్పులట్లు;
విరియు పన్నీరుపుష్పని వినుమసాది,
కంటకంబుగ వైరికి గానబడును.

భువనంబుగాంతితో బూరించు రవిని
అధమాకృతిగ నెంచు నంధమూషికము.

## 2

ఒక వర్తకునకు వేయి దీనారములు నష్టముచ్చెను. "ఈ సంగతి యెవ్వనితో చెప్పవద్దు" అని అతడు కుమా రునికి తెల్పెను. "నాయనా, నీ వాజ్ఞ పెట్టినందువలన నే నెవ్వరితో చెప్పను. అయినను ఈ రహస్యమును దాచి

యుంచుటవలన ఏమి లాభము గలుగునో దానిని నాకు తెలియ జెప్పుము" అని కుమారుడడిగెను.

"మన కష్టము రెండింతలు కాకుండుటయె లాభము: ఒకటి: ధన నష్టము. రెండు: మన దురదృష్టమునుగూర్చి యిరుగు పొరుగువారు సంతోషించుట," యని తండ్రి చెప్పెను.

ప్రత్యర్థితోనీవు భాషింపబోకు
మాత్మదుఃఖము; నాతడానందమొందు.

## 3

తెలివితేటలుగల యొక యువకుడు కళలయందును శాస్త్రములందును ఎక్కుడు ప్రవేశము అభిరుచియు గలిగి యుండెను. కాని యాతడు కొంచెము పిరికి గుండె కలవాడు. పండిత సభలలోకూర్చుండునేగాని నోరెత్తి మాటాడడు. ఒకనాడు తండ్రి యాతనితో నిట్లనియెను: "కుమారా, నీవుకూడ నీకు తెలిసిన దానిని గురించి యుపన్యసింపుము."

"వారు నాకు తెలియని దానిని గురించి ప్రశ్నింతురేని సిగ్గుపడవలసి వచ్చునని నాకు భయము కలుగుచున్నది," యని యువకుడు బదులు చెప్పెను.

చెప్పుమడిమను భక్తుండు చీలగొట్టు
చుండ, నదిగాంచి సైనికుఁ'డోయి, నాదు
గుర్రమునకునాడంబు గొట్టదమ్ము
కదలు'మని కొంగులాగిన కథనువినవె?

మౌనము వహింప నీతో
నేనరుసకుగాని యుండవేకాత్యంబుం
గాని, వచింపదలంచిన
దాని బ్రమాణీకరించి తగజెప్పవలెక్.

4

ఒకానొక యోగ్యుడగు పండితునకును నిరీశ్వరవాది కిని వివాదము తటస్థించినది. పండితుడు వాద ప్రతివాద ములందు ఆతనితో నెగ్గలేక డాలూ డవాలు విసరికొట్టి వెడలిపోయెను. "మీకింత శిక్షణము శాస్త్రపాండిత్యము న్నను ఆ మతహీనుని వాదమునందు ప్రతిఘటించి జయింప లేక పోయితిరిగదా," యని యొకడా పండితుని నడిగెను. "నా పాండిత్యము ఖురాను. పురాణములు, మత గురువుల శ్రీ సూక్తులకు సంబంధించినది. కాని యీ మతహీనునకు వీనిపై ప్రమాణబుద్ధి లేదు. వానిని వినడు. అందువలన వాని మతవిరుద్ధ ప్రసంగము వినుటవలన నాకేమి ప్రయోజ నముకలదు?" అని యా పండితుడు చెప్పెను.

ఎవడు 'ఖురాను' ప్రమాణము
నవివేకత నమ్మకుండు నతనికి భక్తుం
డెవడును బ్రత్యుత్తర మి
య్యవలదు; దదే తగుజవాబటంచు దలపుమీ.

5

బుద్ధిహీనుడొకడు పండితుని మొకపట్టు పట్టుకొని లాగుచు నవమాన పరచుచుండుట జాలీనూస్ చూచి

యిట్లనియెను: "ఈతడు ప్రాజ్ఞుడే యైనయెడల, ఏమియు తెలియని మూర్ఖునిచేతిలో నిట్టి స్థితికి పాల్పడడు."

ఇరువురుప్రాజ్ఞులెప్డు కలహింపరు; మూర్ఖునితోడ జివ్వకుం
ద్వరపడిపోడు పండితుడు; నాడొకవేళ బశుస్వభావుడై
పరుషములాడినన్ సహనభావముతో మృదులోక్తులన్ మనో
హరముగ బల్కు వానిహృదయంబున గోపము నన్నగిల్లగన్.

నిరతంబు వాదులాడెడు
నిరువురు సజ్జనుల నొక్కయెరకను గట్టం
దరమగు; వారిరువురు ము
ష్కరులైనను గొలుసులేని చాలవు పట్టన్.

ఒక సజ్జనుని నొక దుర్జనుడు దూషించెను ఆతడు ఆ మాటలకు కోపపడక యోర్పు వహించి యిట్లనియెను: "ఓయీ, నీ వన్నదానికన్నను నేను చెడ్డవాడను. నే నిదివరకెఱుగని నా తప్పులను నే నిప్పుడు తెలిసికొంటిని."

# 6

సుహాబాన్ వాయిల్ అను పండితుడు వక్తృత్వమున అప్రతిమానుడని పేరుపొందెను. యేలయన, నొక సభయందు సంవత్సర మిుపన్యసించినను చెప్పినమాట మరల చెప్పడు. ఒకవేళ చెప్పవలసి వచ్చిన ఆ మాటను వేరర్థమున నుపయోగించును. రాజాస్థానమున నుండు సచివుల కుండవలసిన గుణములలో నిదియొకటి.

మధురమైనను హృదయంగమంబునైన
జిత్రమైనను విశ్వాసపాత్రమైన
బ్రమద మొనగదు పునరుక్త భాషణంబు,
తియ్య హల్వాను నొకసారి తిన్నజాలు.

# 7

ఒక పండితుడిట్లు చెప్పుచుండ నేనువింటిని: "ఒకడు మాటాడుచుండగా ఆ సంభాషణము పూర్తి కాక పూర్వమె మధ్యలో మాటాడువాడుతప్ప తన యజ్ఞానమును రుజువు చేసికొనువాడు మరియొకడుండడు.

ఓయి, సంభాషణంబున కుండు మొదలు
తుదయు, మధ్యలోమాటాడ దుడుకుపడకు;
విశ్రుత వివేకచిత్తులౌ విజ్ఞులొరులు
పలికి నిలిపినయందాక పలుకరెపుడు.

# 8

మహమూదు నౌకరులలో కొందరు, "ఫలాని విషయమును గురించి సుల్తానువారు మీతో నేమిచెప్పిరి?" అని హసన్ మైమందీని అడిగిరి. "ఆ విషయము మీకుగూడ తెలిసియుండవచ్చును" అని యాయన చెప్పెను.

"మీతో నేవిషయములు చెప్పుదురో యట్టి విషయములు మాబోటివారితో సుల్తానువారు చెప్పరు." అని వారనిరి.

"నే నితరులతో చెప్పనను నమ్మకముచేత నే సుల్తా నువారు నాతో చెప్పిరి. అట్లగుట మీరేల నన్ను ప్రశ్నించెదరు ?" అని ఆయన యడిగెను.

తెలిసినంతమాత్ర బలుకడు ప్రాజ్ఞుండు
పరులతోడ నెట్టి వార్తలైన,
ప్రభురహస్యములను బయలుపెట్టుట తల
నాధివెట్టి జూదమాడినట్లు.

# 9

ఒక యిల్లుకొనదలచి వెల తీర్మానము చేసికొనుటలో ముందు వెనుకలాడుచుంటిని. యొక యూదు డిట్లు చెప్పెను : "ఈ యింటిని కొనుడు. నే నీ ప్రదేశమున ప్రాత కాపును. ఈ యింటి మంచిసెబ్బరలు నన్నడుగుడు. ఇది చాల మంచి యిల్లు. ఏ లోపమును లేదు."

"నీవు నాకు నిరుగు పొరుగుల నుందువను లోపము తప్ప మరియొకటి యుండదు," అని నేనంటిని.

ఈవు పొరుగున నుండిన యింటివిలువ
తగ్గు బదిదేరములదాక, తథ్యమిదియు;
అసపడియెవ నీకృతియైన పిదప
వేయివరకైనహెచ్చును విలువయనుచు.

# 10

ఒక కవీశ్వరుడు దొంగల నాయకునియొద్దకు పోయి పద్యము చెప్పి ప్రస్తుతించెను. అంతట నాయకుడు, "ఈ కవి

యంగీని ఒలుచుకొని యూరు దాటగొట్టుడు" అని దొంగల కాజ్ఞాపించెను.

పాపమా దరిద్రుడు విగత వస్త్రుడయి చలిలో వడకుచుపోవుచుండ కుక్కలు వాని వెనువెంట తగుల్కొనెను. కుక్కల నదలించుటకు రాతికై వెదకెను. కాని భూమిపై నంతయు మంచు పేరుకొని యుండెను. ఏమియుం దోపక దిక్కులేనివాడయి కవి యిట్లనియెను: "అబ్బా వీరు ఏటువంటి దొంగలురా! కుక్కలను వదలిపెట్టి రాళ్ళను కట్టివేసిరి.

దొంగల నాయకుడు కిటికీగుండ ఆతని చూచి యీ మాటలకు నవ్వి యిట్లనియెను: "ఓయీ కవీ, నావద్ద నీ కేమైన కావలసియున్న కోరుకొనుము."

"మహాప్రభూ, నాకు కానుక యియ్యవలదు రేని నా చొక్కాయి నాకు పారవేయించుడు" అని కవి మొర పెట్టెను.

పరులనుండి ధనము బడయుంగవాంఛింతు
రర్థిజనులు; నాకు నాశలేదు
నీ ధనంబుపైని; నిష్ఠురకష్టంబు
పెట్టిపంపకుంట పెద్దకాన్క.

ఈ మాటలువిని దొంగల నాయకునికి కవిపై జాలి గలిగి యాతని చొక్కాను మరల నిప్పించి దానితోడ ఉన్ని చొక్కాయిని కొన్ని దేరములను కానుకగా నిచ్చెను.

# 11

జోస్యుడు తనయింట ప్రవేశించునప్పటికి తన భార్యయొద్ద పరాయివాడొకడు కూర్చుండి సరస సల్లాపము లాడుచుండుట గని దూషింపసాగెను. రచ్చా రావిడీ యైనది. పెద్దమనుష్యుడొకడు ఈ సంగతి తెలిసికొని యిట్లనియెను :

ఇంటనేమైనది యెరుగంగలేవు
గగనగుప్తము నెట్లు కనిపెట్టగలవు?

# 12

శ్రవణ దారుణమైన కంఠస్వరముగల యొక మత బోధకుడు తన కంఠము మృదు మధురమైనదను భ్రాంతితో నుండి వ్యర్థ బోధనము చేయుచుండెను. వాని గానమున నెడారిలోని మాలకాకి యరపులు దాగియున్నవని నీవు చెప్పవచ్చును. ఖురానులోని "ఆపురమునందెల్ల నింద్యమైనది గాడిద యోండ్ర యొక్కటియె," అను సూక్తి యాతని తరహాకు సరిపోవును. గాడిదవంటి యీ బోధకుడు ఓండ్ర పెట్టుటకు ప్రారంభించినపుడెల్ల ఆతని కఠోర రావము ఫరస్ పట్టణమును పునాదిలోనికి కంపింప జేయును.

ఆ బోధకునకున్న గౌరవము వలన ఊరివారు ఆతని లోపమును సహించి, కష్ట పెట్టుట యుచితము కాదని యూరకుండిరి. కాని, యాతనిపై రహస్య విరోధమున్న మరియొక

బోధకుడు అచ్చటికివచ్చి యిట్లు చెప్పెను: "మిమ్ము స్వప్నమున చూచితిని. మంగళమగుగాక!"

"ఏమి చూచితివి" అని ఆయన యడిగెను.

"మీకంఠ స్వరము మధురముగ మారినట్లును అందువలన ప్రజలు ఆనంద భరితులైనట్లును నేను కల గంటిని."

అంతట నాబోధకుడు ఈ విషయమై కొంత యాలోచించి యిట్లనియెను: "దేవుడు నిన్ను సంతృప్తి పరచుగాక! యెటువంటి శ్రేయస్కరమైన కలగంటివి దీనిమూలమున నా లోపములు నాకు బోధపడినవి. కర్ణకఠోరమైన కంఠ స్వరము గలవాడననియు నేను గొంతెత్తి యరచి చదువుట వలన ప్రజలు విసుగుకొని కష్టపడిరనియు నేనిప్పుడు తెలిసికొంటిని. యీనాడు మొదలు మెల్లగ ప్రార్థనము చేయుదునని ప్రతిజ్ఞ చేసికొంటిని."

తప్పులెల్లను నొప్పుల కుప్పలనుచు
ముల్లుగాంచి గులాబీలు మల్లెలనుచు,
బొగడుమిత్రుల సాంగత్యమున విసిగితి
క్షుద్రశత్రువు లోపంబు జూపువరకు.

ఎవడైన దనతప్పు లెరిగించుదాక
దనతప్పునొప్పని తలచునజ్ఞుండు.

# 13

సంజార్యా నగరపు మసీదున నొక మునాది గొంతెత్తి యరచి నమాజు చేయుచుండెను. ఆ కఠిన రావము విన్న వారందరు ద్వేషముతో వెడలిపోవుచుండిరి. ఆ మసీదునకు స్వామియైన యమీరు సుస్వభావుడు. న్యాయబుద్ధి గలవాడు. ఇతరుల మనస్సు నొప్పించుటకు నిష్టము లేనివాడు గావున యమీ రిట్లనియెను: "యీ మసీదున పూర్వమునుండి సేవచేసిన మునాదులున్నారు. వారిలో నొక్కొకనికి అయిదు దీనారముల బత్తె మిచ్చుచున్నాను. నీ విం కొక చోటు చూచుకొందువేని నీకు పది దీనారముల నిచ్చెదను." యీ మాటలకు మునాది సమ్మతించి వెడలిపోయెను.

తరువాత కొంత కాలమునకు ఆతడు అమీరువద్దకు వచ్చి యిట్లనెను: "స్వామి, మీరునన్ను మోసము చేసితిరి. పది దీనారములకే నన్ను ఆ యుద్యోగమునుండి వెడలనంపితిరి. నేనిప్పుడున్న చోటినుండి వేరొక చోటికి పోదునేని వారు ఇరువది దీనారముల నిచ్చెదమని చెప్పుచున్నారు. అయినను నేనొప్పుకొనలేదు."

అమీరు నవ్వి యిట్లనెను: "జాగ్రత్త నీ వొప్పుకొనవద్దు ఏబది దీనారముల నిచ్చుటకు వారెట్లయిన నంగీకరింతురు!

కొండచరిమట్టి గొడ్డటగొకుచుండ
వెడలు గరుగరు శబ్దంబువిధము నీదు

బొంగుగొంతుకలోబుట్టి భోయకొల్పు
కరినరావంబు మాయెప గదలగోకు.

## 14

కఠోర కంఠుడొకడు గొంతెత్తి ఖురాను చదువుచుండ నొక పెద్ద మనుష్యుడు ఆ కారిని పోవుచుండి యిట్లడిగెను:

"నీకు నెలజీత మెంత?"

"ఏదో కొద్ది."

"అట్లయిన నీవేల యింత శ్రమపడు చున్నావు?"

"దైవ ప్రీత్యర్థము."

"మరల నీ విట్లు చదువకుంటయె దైవమునకు ప్రీతికరముగ నుండును."

ఈవు ఖురానుసూక్తులిట్లు పఠింప
న్యాసమౌను ముసలిమాని యందంబు.

## పంచమాధ్యాయము

# ప్రేమ యౌవనములు

## 1

హాసన్ మైమందీని యిట్లడిగిరి: "సుల్తాను మహాత్ముడునకు చాలమంది చక్కని బానిసలు గలరు. వారిలో నొక్కొకడును లోకాద్భుత రూపవంతుడు. అట్లయ్యును సుల్తాను అంతగా నంద చందములు లేని అయ్యాజును ప్రేమించినట్లు వారిలో నొక్కనినైన నేల ప్రేమింపడు?" ఆయన యిట్లు చెప్పెను: "హృదయమున కెక్కినది కంటికిని ఇంపుగ నుండును."

ఎవ్వడేనియు నీరాగ దృష్టిజూడ
'యూసబు' కురూపిగా దోచుచుండు; గామి
ప్రణయదృష్టికి దయ్యావుబాడు రూపు
కానిపించు దివ్యాకృతి గాగనెపుడు.

ప్రభువునకు నిష్టుడైన యెవ్వాడు గాని
తప్పులొనరింప నవియెల్ల నొప్పులగును;
రాజు త్రోసిపుచ్చిన వానిత్రాతయేమొ
యింటివారైన నాదరదృష్టిగనరు.

## 2

ఒక పెద్దమనుష్యునివద్ద రమణీయవతియగు దాసి యుండెను. దానిపై నతడు మోజుపడి యుండెను. "యెంత

శోచనీయము! నా యీ దాసికి అంత చక్కదనమున్నం దుకు, గట్టి వాయితనము నిర్లక్ష్యభావము లేకుండిన నెంత సంతోషకరముగ నుండెడిది?" అని ఆయన యొక స్నేహి తునితో ననెను. అంతట మిత్రుడిట్లు చెప్పెను: "సోదరుడా, స్నేహము నంగీకరించినపుడు దాస్యమును కోరకుము. ప్రేయసీ ప్రేయసుల సంబంధమునందు, దాసి యొడయడు అను భేదమంతరించును."

యింటిఖామందు తెరగంటి వంటిదాని
తోడ సయ్యాటలాడ నా తొత్తుకూతు
రాజ్ఞవెట్టును స్వామినియట్లు; లతఁడు
ప్రణయభారంబు మోయు సేవకునిభంగి.

యిటిక కంకరగొట్టుటో యింటవలయు
నీరుదెచ్చుటొ దాసికి నియతవృత్తి;
యట్లుగాకది ప్రేయసి యయ్యెనేని,
చెనటియజమాని చెంపకు జేటుమూడు.

## 3

ఒక పుణ్యాత్ము డొకనియందు ప్రేమబద్ధుడై యుండుట చూచితిని. ఆతనికి సహించుకొను శక్తిగాని ప్రణయము తెల్పికొను ధైర్యముగాని లేకుండెను. అతని నెన్ని చీవాట్లుపెట్టి మందలించినను వానిపై వ్యామోహము వదలక యిట్లనెను:

నీ యుడుపుకొంగుపై జేయి నేనువదల
గత్తితో నీవె నామేన గాటులిడిన;

నాకు నీకన్న నెవ్వరున్నారు దిక్కు?
వత్తునేని నీవాకిట వచ్చిపడుదు.

ఒకనాడాతనికి బుద్ధిచెప్పి యిట్లంటిని: "నీచమైన యీ వ్యామోహామునకు లొంగిపోవుటకు నీ ప్రశస్తమైన తెలివియేమైనది?" అతడు కొంత తడవాలోచించి యిట్లనియెను:

ప్రణయ భూపాలుడెచ్చోట బవములిడునొ
భక్తిభుజబలంబున కట బట్టులేదు;
కంఠదఘ్నంబుగా నవీకర్దమమున
బూడినయతండు మురికిని బూసికొనడె?

# 4

ఒకనాడొకడు చిత్తము పరవశమయి ప్రాణములపై నాశ వదలుకొనెను. ఆతడు కోరిన విషయము అపాయకరమై నదియు, సుడిగుండమువలె ప్రాణసంశయము గొల్పునది యునై యుండెను. అది నోటబడుటకు వీలులేని యూహా కబళముగను, ఉచ్చుల కెలయింపరాని పక్షిగను పొంద రానిదై యుండెను.

ప్రణయిని నీసొమ్ము పాటింపకున్న
దుమ్మైన సొమ్మైన దుదకు నీకొకటె.

ఒకతూరి యాతని కిట్లు సలహాచెప్పిరి: "నిష్ప్రయోజనమైన యీ పిచ్చితలంపు వదలుము. నీవలెనే కొందరు ప్రజలు సైతము వ్యామోహామునకు చిక్కిరి.

వారి హృదయము శృంఖలాబద్ధ మైనది.'' యీ మాటల కాతడు దుఃఖించి యిట్లనియెను:

నాకు హితబోధవలదని నా సఖులకు
దెలుపు; మవ్వానియందె నా దృష్టిచిక్కె;
బాహుబలమున యోధులు పరుల, జక్క
దనముగలవారు ప్రియుల, నిర్దయతనొంత్రు.

ప్రాణభీతిచే ప్రియురాండ్రనుండి హృదయము మరలించుట ప్రేమధర్మముగాదు,

స్వప్రయోజన బంధాల బడిననీవు
వంచకుడవౌదు వనురాగ పాలనమున,
సకియ చెంగటజేర నసాధ్యమైన
దత్ప్రయత్నమునఁ మృతిధర్మమగును.
వీత్రైసనీకొంగు విడకచేకొందు
గాకున్న నీ యింటికడకేగి చత్తు.

ఆతని మంచి సెబ్బరల నరయవలసిన బంధువులు వాని శోచనీయ స్థితికి జాలిగొని నీతి బోధించి కట్టుదిట్టము లలో నుంచిరి.

వైద్యుండురోగికి బంచతిక్తంబు
నీయ నాతనికోర్కె యెగురుజక్కెరకు.
ప్రణయ విహ్వాలచిత్తుడౌ వానిచెవిని
జెలిసు గుసగుసలాడిన పలుకువినవె?
యాత్మగౌరవ పరుడవౌ నంతవరకు
నాదుగౌరవమొక లెక్కగాదు నీకు.

అతని కోర్కెకు తావలమైన రాజకుమారునికి వాని విషయమై యిట్లుచెప్పిరి: "ఎవడో యొక యువకుడు మైదానమున నిరంతరము కనుపించుచుండును. మధురమైన భాషయు చమత్కారోక్తులును పలుకుచుండును. ప్రజలు యాతని యుపన్యాసముల వినుచుందురు. కాని మనస్సులో వేదనయు ప్రేవులలో మంటయు వలపుపిచ్చియు నతని యందు గనపడుచుండును." ఈ మాటలువిని తనయందే యా యువకుని చిత్తము లగ్నమై యున్నదనియు, తన్ను గురించియే దుఃఖధూళిని సుడిగాలివలె రేపెననియు నెరింగి రాజకుమారుడు ఆతని వైపునకు గుర్రమును పరుగెత్తించెను.

రాజకుమారుడు తనయొద్దకే వచ్చుచున్నాడని తెలిసికొని యాయువకుడేడ్చుచు నిట్లు పలికెను:

నన్ను జంపినవాడు ననుజేరవచ్చె
ధనబలి పశువుపై దయగల్గెనేమొ!

"ఎట్లున్నావు? యెచ్చటనుండి వచ్చితివి? నీపేరేమి? వృత్తియేమి?" యని రాజకుమారుడు ఎంత దయతో నడిగినను ఆ యువకుడు ప్రేమ సముద్ర తరంగములలో నమాంతముగ మునిగిపోయి యుండుటవలన నూపిరి విడచుటకైన శక్తిలేక యుండెను.

కడదాకగ ఖురాను కంఠస్థమయ్యు
బలుకలేడొనమాట ప్రణయవిహ్వలుడు!

రాజకుమారుడిట్లనెను: "నాతో మాటాడవేల? నేనును దరిచేసి సంఘమునకు జేరినవాడనె. అదియునుగాక వారికి నేను దాసుడను."

స్నేహితుని యాదరోక్తుల ప్రోత్సాహమువలన ఎట్టకేలకు ప్రేమతరంగ సంక్షోభమునుండి తలయెత్తి యువకు డిట్లనియె:

ఈవు నావద్దనిలుచుండ నింతవరకె
ప్రాణములు వీడపోకుంబ యద్భుతంబు!
నీవుమాటాడవచ్చిన నిమిషమందె
పలుకశక్తియు మిగులుట గొలుపువింత.

ఆ యువకుడిట్లు పలుకుచు ఎలుగెత్తి యరచి ప్రాణము దేవుని కర్పించెను.

ప్రేయసిగుడారు వాకిట ప్రేమపర్గు
డస్తమింపక యుండిన నక్కజంబు!
ఆతడొకవేళ బ్రతికిన బ్రాణములను
క్షేమముగ జిక్కబట్టుట చిత్రమగును!

# 5

ఒకవిద్యార్థి రూపవంతుడుగను మృదుమధుర భాషిగ నుండెను. మానవ స్వభావ దౌర్బల్యము వలన నుపాధ్యాయుడు వానిపై ననురాగము చూపుచు నితర బాలురను శిక్షించినట్లు వానిని శిక్షింపక యొంటరిపాటున కనబడినపు డిట్లు చెప్పుచుండెను:

నన్ను నేనెమఱచిపోవుచున్న యాటుల
మగ్నమయ్యెను నీయందె మనసునాకు;
ఓయి దివ్యాన్య, నినుగాంచుచున్నయపుడు
బాణమెదురైన గన్నులవాల్పబోను.

ఒకానొక సమయమున ఆబాలుడిట్లు చెప్పెను: "మీరు నా పాఠముల విషయమున నెట్లు శ్రద్ధతీసికొందురో అట్లే నా ప్రవర్తనమును గురించియు శిక్షించుచుండు. నా కిష్టమైనదియు మీ కిష్టము కానిదియు నా స్వభావమున మీకేదైన తోచినయెడ నన్ను హెచ్చరింపుడు. నేను సరిదిద్దుకొనుటకు యత్నించెదను. యీ మాటలకు నుపాధ్యాయుడిట్లనియెను: "ఓయీ, యీ మాటలు వేరొకనితో చెప్పుము. ఏలయన నిన్ను చూచుచున్న నాకంటికి ఒప్పులు తప్ప మరేదియు గానరాదు."

ఒప్పులను దప్పులని నొక్కిచెప్పుచుండు
నీ విరోధి కనీనికల్ నేలబడుత!
ఒప్పొకటియుండి డెబ్బదితప్పులున్న
నొప్పొకటితప్ప సఖుడెద్దియుంగనడు.

# 6

ఒకనాటిరేయి నా ప్రాణమిత్రు డొకడు ఇంట ప్రవేశింపగా చూచి యొడలు మరచి లేచునప్పుడు నా చొక్కాయి కొంగు తగిలి దీపమారిపోవుట నాకు జ్ఞప్తి యున్నది. యాతడు కూర్చుండి, "నన్ను చూచినంతనే దీపమునేల యార్పితివి" యని నిందించెను. నే నిట్లంటిని:

"యేలయన, సూర్యోదుదయించెనని సందేహించుట మొదటి కారణము, యీ పద్యము నా మనస్సునకు వచ్చుట రెండవ కారణము:

హేయరూపుడుదీపిక యెదుటనిలువ,
లెమ్ము, వానిని సభవెడలింపు మపుడె;
తేనెవాతెర నగుమోముతెత్వ యైన
పైట చెంగునుబట్టి దీపంబునార్పు.

# 7

చాలకాలమునుండి యగపడని యొక స్నేహితుని చూచి, "యెచ్చటనుంటివి? నీకొరకు నిరీక్షించుచుంటిని" యని యొకడు పల్కెను. "విసుగు పుట్టించుటకంటె నిరీక్షింపబడుటయే మేలు." అని యాతడనెను.

మోహపుంగైపు పుట్టించు ముద్దులాడి
వచ్చినావాలసించి; నీ పైటవిడువ,
ఆనదీతంగ ప్రియురాలి నరయుకంటె
నెప్పుడో యొకప్పుడుఁ గాంచ నెంతొప్రియము.

యితర మిత్రులతోడ వచ్చునేని వలపులాడి తగవులాడుటకే వచ్చును. యేలయన, ఈర్ష్యయు పత్యర్థితయు నశింపదు.

అన్యులా వలపుకాంద్రతో నరకణంబు
చెలియ నయ్యాటల గలసిమెలసియున్న
నెంతసేపాపట్టదు దహియించిపైవ
నంతరంగము నీర్ష్యా దవానలంబు.

పిన్ననవ్వులు మోమున బెనగులాడ
నకియ యిట్లువచించె; నోసాధ్వి, నేను
సభను వెలుగొందు దీపికాజ్వాల; నందు
నెన్నొపురుగులుచావ నాకేమిలెక్క?

# 8

చాలకాలము క్రిందట నేనును మరియొక స్నేహితు డును బాదముకాయలోని రెండుపప్పులవలె కలసిమెలసి వసించుచుంటిమి. అకస్మాత్తుగ నతడు పయనింపవలసి వచ్చెను. కొంతకాలమునకు తిరిగి వచ్చి "యీలోపల క్షేమసమాచారములు తెలుపుట కెవ్వనినైన వార్తావహుని పంపగూడదా?" యని నాతో నిష్ఠురములాడెను.

"నీ సౌందర్యమునుగాంచి యా ప్రేషితుని కన్నులు ఆనందించుచుండ నేనుమాత్రము భగ్నాశుడనయి యుందు నన్న తలంపు నన్ను వేధించె" నని నేనంటిని.

ఎవ్వడైనను నీమోము తృప్తిదీర
గాంచ నీర్ష్యాగ్ని నామది గడలుకొనును;
అయిన ననుకొందు గ్రమ్మర నంతలోన
నిన్నుగని తృప్తిబెందుట సున్నయనుచు.

# 9

ఒకానొక పండితునకు నొకనిపై మనసు తగిలియుం డెను. యీ రహస్యము బహిరంగమాయెను. అతడు ప్రజల

దౌర్జన్యము వలన బాధపడుచు మితిలేని యోర్పువహించి యుండెను. ఒకనాడు నేనాతని నిట్లుమందలించితిని: ఆతని తోడి నీస్నేహము నిష్కల్మషమనియు గర్హ్యమైనది కాదనియు నేనెరుగుదును. అయినను తాము ప్రజల యెడ కలకు పాల్పడుటయు మట్టుమర్యాద లెరుగని మొరకల దౌర్జన్యమునకు అగ్గమగుటయు పండితుల గౌరవమునకు నర్హముగాదు.'' అంతట నా పండితుడిట్లనియెను: ''మిత్రుడా, నన్ను నిందింపకుము, చాల సారులు దీని యౌచిత్యమును గురించి యాలోచించితిని యాతని చూడకయుండెడు కష్టమునకంటె దౌర్జన్యము సహించుటయే మేలుగ తోచినది ప్రేమపాత్రమైనదానిని చూడనీయక కన్నుల మురల్చుటకంటె, దానిని పొందుటకుపడు కష్టము నందు హృదయము నిల్పుటయె తేలికగ నుండునని తత్త్వవేత్తలు చెప్పిరి.''

ప్రియురాలిపై మతిపెట్టిన యతడు
తనగడ్డమొరులకు దాబట్టియిచ్చు;
వలపుపెట్టిన జింక పరుగెత్తలేదు;
ఎవతె లేకుండిన నిహము శూన్యంబొ
యట్టినెచ్చెలి కష్టపెట్టిననేమి?
ఒకనాడు ప్రియురాలి నొకయొడంబడిక
నడిగితి; నదిమొద లనుతాపమునను
పలుమారు నే క్షమార్పణము గోరితిని;
హృదయంబు పెట్టితి నుదకొకట్టియుట:
నేమిచేసినగాని యింతియిష్టంబె,
ప్రియమునబిల్చుటో వెడలగొట్టుటయొ
యెట్లుచేసిన మేలో యెఱుగునాచెలియ.

# 10

నా నిండుజవ్వనమున నిట్టిది తటస్థించెనని, నీ వెరుగుదువు. ఒక ప్రియమిత్రునితో నన్యోన్యరహస్యములు చెప్పు కొనదగినంత సంబంధముండెను. యేలయన అతని కంఠస్వరము మృదుమధురముగను వదనబింబము పూర్ణచంద్రసదృశముగ నుండెను.

అతని చెక్కుల సొంపారు నాకలంబు
జీవనామృతముంగ్రోలి చివురువెట్టు,
న ్ని తంతీపువాతెర నరయుదేని
కండచక్కెర రుచిచూడగల్గినట్లు.

యిట్లుండ ఆతని ప్రవర్తనము నా స్వభావమునకు వ్యతిరిక్తమయి నా కంగీకారము గాకయుండుట సంభవించెను. అంతట స్నేహబంధము సడల్చి యాతనితో నిట్లంటిని:

పదవోయి నీయిచ్చవచ్చినదారి.
నాతలంపొల్లవు, నీతాతతోడు.

అతడు వెడలిపోవుచు నిట్లనుచుండ వింటిని:

అరుణు సాంగత్యంబు నల దివాంధంబు
విడనేమి, రవికాంతి విలువకులోటె ?

యిట్లువచియించి యాతడు పయనించెను. వాని దుఃస్థితికి నా మనసు నొచ్చుకొనెను.

సాంగత్యలాభంబు సమసె; గష్టంబు
పడుదాక దెలియము ప్రమదంపు విలువ.
క్రమ్మరవచ్చి నన్ గడతేర్పుమోయి,
నీవెన్క ప్రాణంబు నిలబెట్టుకంటె
నీముందు మరణింప నెగడు మోదంబు.

అయినను దైవవశమ్మున, కొంతకాలము గడచిన పిదప నతడు తిరిగి వచ్చెను. దావీదు కంఠమువలె మధుర మైన యాతని గొంతు బొంగురువోయెను. యూసబువలె రమణీయమైన యాతని రూపము పసచెడెను. సీమరేగు పండువలె నున్ననైన యాతని చిబుకము ఉరువెక్కి దుమ్ముపట్టి యుండెను. ఆతని సౌందర్యమూల్యము తగ్గెను. నేనాతని చూచినంతనే కౌగిలింతునని యాసపడియుండెను. కాని నేను ప్రక్కకుతొలగి యిట్లంటిని:

అలరు నూనూగుమిసాల యౌవనమున
నరయవచ్చినవారల దరిమితీవు;
ఈత మొక్క గడ్డంబుతో నింపుదరిగి
చేరినాడవె యీనాడు చెలిమిగోరి.

ఆతయగ నీదుజవ్వనపు టామనిపచ్చలు పాలిపోయె; నె
ప్పరుసున జింతిలన్ మరలవచ్చునె పూర్వపు సోయగంబు? ని
ప్పారవయులేదు ప్రాయ్యి; నిదబోకటపాత్రను; జెక్కులేల నీ
నరసనుగోరువారికడ నల్పుము చెల్వగు ముద్దుముచ్చటల్.

అకలంబులు తోట నందంబుగొలుపు,
నటు వచించినవాని కంతయుందెలియు;
అనగ :-సుందరు చెక్కులందు మోసెత్తు
పచ్చల జొంపంబు ప్రణయవిహ్వాలుల

యుల్లంబు వెడఁకంత నుప్పొంగుచుండు;
నీ గడ్డపుఁ జ మడినిండె తోటాకు,
కోసిన కొలదియుం గొనరిపైకెదుగు;
గడ్డంబు పెంచిన గత్తిరించినను
యౌవనప్రాభవం బంతరించెడిని;
గడ్డంబుపైనీకు గలయంత ప్రభుత
బ్రతుకుపైనాకున్న, బ్రళయంబుపరకు
జేవీడకద్దాని జిక్కఁబట్టెదను
యిటుల బ్రశ్నించితి: నేమయ్యె నీదు
వదనసౌందర్యంబు? పరివృతంబయ్యె
జంద్రబింబము చీమఁచాలుఁలచేత;
నిటువల్కె: నామొగమేమాయనేమొ!
గళిత సౌందర్యదుఃఖము చూపుపొంటె
నలఁపుదాలిచెనంచు నాకు దోచెడిని.

## 11

"సుందరులైన యువకులను గురించి నీ యభిప్రాయ మేమి" యని రొకొ బాగదాదు అరబ్బీని ప్రశ్నించితిని. అతడిట్లుచెప్పెను: "చూడచక్కనైన శరీరముగల యంత వరకు బిరుసుదనమును గట్టితనమును పూనుదురు. వారికి బిరుసుదనమువచ్చి నిప్ప్రయోజకులయినప్పుడు దయచూపి చెలిమి పాటింతురు."

అందచందములొనరు ప్రాయఁపువాడు
బిరబిగిసి కటూక్తుల పినుగుగొలుపు;
మీసమును గడ్డమునువచ్చి మిసిమితరుగ,
గలసిమెలసి వర్తించు సఖ్యంబుగోరి.

# 12

“ఒకడొక చంద్రవదనతోడ రహస్యగృహమున కూరుచుండియుండ, ద్వారములు మూయబడియుండ, సేవకులు నిద్రించుచుండ, కామోద్రేకము దుర్దమమైయుండ నొకయరబ్బి చెప్పినట్లు ‘ఖర్జూరములు పండియున్నవి, తోటకాపరి నిరోధింపడు’ అన్నట్లు అంతయు ననుకూలముగ నుండ, వాడు సంయతబుద్ధి బలముచేత చిత్తచాపల్యము నుండి తన్ను రక్షించుకొనగలడా?” యని యొక పండితుని ప్రశ్నించిరి. ఆతడిట్లు చెప్పెను: “ఒకవేళ ఆతడు చంద్రాశ్యలకు వశ్యుడుగాక తప్పించుకొన్నను పరనిందాపరాయణుల విమర్శనములకు గురికాకమానడు.”

సాధ్యమౌ దమమతి శాసించిపిలువ;
నయిన లోకుల నాల్కలరికట్టదరమె?

## సాదృశ్యము

చిలుకను కాకితోడ నొకపంజరమున బంధించిరి. చిలుక కాకి వికారరూపమునకు నీసడించుకొని యిట్లనియెను: “యేమి యసహ్యమైన స్వరూపము! యెటువంటి యభిశప్త ముఖము! ఎట్టి యనాగరక స్వభావము!”

ప్రొద్దుపొడుపునలేచి నీ మోముజూడ
శాంతదివసోదయం బంధసంధ్యయగును

నీకునీవంటి నిర్భాగ్యు నెయ్యమొప్పు;
కాని, నీకుబోలువాడు జగానలేడు!

యిందు వింత యేమనగా, కాకియు చిలుక సహవాసమునకు ప్రాణము విసిగి తన కాలదుర్గతికి దీనముగా పలవరించుచు ఆశాభంగముతో చేతులునలుపుకొనుచు నిట్లనియెను: "నా యదృష్ట మెంత తలక్రిందైనది! కాలము ఊసరవిల్లివలె మారుచుండును! తోడి కాకులతోడ తోట గోడలపై నొయ్యారముగ పచారుచేయుటయె నాగౌరవమునకు తగియుండును.

భక్తుదుర్మతులతో వసియింపజేయ
నతనికయ్యదియె కారాగారశిక్ష.

ఇటువంటి తెలివితక్కువదియు, మొండిపట్టుగలదియు, పనికి మాలినదియునగు వదరుబోతు చిలుక సహవాసబంధమున జిక్కి, గోడుగుడుచుచు నాకాలమెల్ల శిక్షననుభవించుటకు నేనెట్టిపాపము చేసియుంటినోగదా!"

పాడునీరూపు చిత్రింపబడినగోడ
ప్రక్కకేనియు నెవ్వారు పదములిడరు;
నీవు స్వర్గాననుండ నిర్ణీతమైన
గొంకకితరులు నరకంబు గోరుకొంద్రు.

పండితులు పామరుల నెట్లు ద్వేషింతురో అట్లే పామరులు కూడ పండితులను ద్వేషింతురన్న విషయము నీవు తెలిసుకొందువుగాక యని యీ సాదృశ్యము నుదాహరించితిని:

కోడెషోదామూక గోష్ఠిలోనుండె
పరమభక్తుం; డంత బల్లవూపోణి
యతనితో వచియించె: ననఘాత్మ, మీకు
మాగోష్ఠినుండ సమ్మతిగాకయున్న
మటమటమని మోము మాడ్చబోకుండు,
అది యంతకుజ్ఞమున్న యతివికర్షకము!
లాతెలు పన్నీరు పూలమధ్యమున
నిలనాటిపట్టి యెండిన కట్టెవీవు,
ఎదురుగాలివొ, లేక యెనలేని చలివొ!
పేరిగడ్డగనుండు పెనుగుంచుశిలవొ!

# 13

నేనును మరియొక స్నేహితుడును కలసి కొన్ని యేండ్లు ఒకరి కొకరు తోడునీడగా యాత్రసల్పుచుంటిమి. ఒక కంచమున దిని యొక మంచమున పరుండుచుంటిమి. మిత్రుల మితిలేని హక్కులను ఇరువురము అనుభవించు చుంటిమి. తుదకు కొంచెము లాభము కారణముగా అతడు నా హృదయమును నొప్పించుట కియ్యకొనెను. సహవాస మంతరించినది. యిట్లయ్యును ఇరువురియందు హృదయాను బంధము బొత్తిగా తెగిపోలేదు. యేలన, పూర్వము నేను రచించిన యీ రెండు ద్విపదలను ఆతడొక సభయందు చదివెనని వింటిని.

ఎలనవ్వుతోడ నెచ్చెలి వచ్చినంత
పుంటిలో నుప్పిడు పోల్చిబాధించు;
చెలిముంగురులుచేత జిక్కనెట్లుండు?
చాతకొం గర్దిచే దవిలినట్లుండు.

అచ్చట వినుచుండిన మిత్రబృందము ఈ ద్విపదలను మెచ్చుకొనిరి. ఇందలి భావచమత్కారమునకు గాకపోయినను ఆ మెచ్చుకోలు వారి మధురమైన సహృదయత్వమునకు సాక్ష్యమగుచున్నది.

అంతట ఆ స్నేహితుడు ఆ సభయందు నన్ను అతిశయోక్తులతో ప్రశంసించి, మా పూర్వసహవాస మంతరించినందులకు వగచి యందుకు కారణమైన తన తప్పిదమును ఒప్పుకొనెను. ఆతనికి గూడ కోరికయున్నదని యెఱిగి యీ ద్విపదలను వ్రాసిపంపి రాజీచేసుకొంటిని.

మనకు నన్యోన్యంబు మైత్రిబంధంబు
గలదు; దానిని నీవె ఖండించినావు;
మరల నీపై జిక్కె మనసు; మున్నట్లు
మారెదవంచు నే మదిసంశయింప;
నింకరాజీనీకు నిష్టంబయేని
ప్రియతరుండగుదువు; వెండిరారమ్ము.

# 14

ఒకనికి చక్కని యిల్లాలుండెను. ఆమె మరణించెను. వికృతాంగియైన ముసలియత్త మాత్రము ఓలెపైకము వసూలు చేయువరకు అల్లునియింటనే నివసించుచుండెను. ఆమె సహవాసము తొలగించుకొనుటకు ఆతనికే యుపాయమును తోపలేదు.

ఇట్లుండ స్నేహితులు కొందరు ఆతని విచారించి యోదార్చుటకు వచ్చిరి. వారిలో నొకడు "నీ ప్రియురాలి వియోగము నెట్లు సహించుచున్నావని" అడిగెను.

"భార్య తల్లిని చూచుచుండుటకంటె భార్యా వియోగమంత కష్టముగాదు," అని ఆతడు బదులు చెప్పెను.

తొగరుగులాబీలు దొంగిలిపోవ
కంటకనిచయంబె కడకులభించె;
బంగారు పెన్నిధి పరులుగొంపోవ
పామొక్కటియె గుంటబున్నుండి మిగిలె;
కానివారల మోముగాంచుటకంటె
కనులు బల్లెమున కగ్గముసేయువచ్చు;
ఒకవిరోధిని జూచుచుండుటకంటె
వేయిమిత్రులతోడ విడివడవచ్చు.

# 15

నా యౌవనకాల మందొకనాడు ఒక వీథియందు సంచరించుచు నొక చంద్రముఖిని గాంచితిని. యొడతాపము నోరెండ జేయుచుండెను. యెడారి వేడిగాలి యెముకలలోని మూలగను ఉడికించి కరగజేయుచుండెను. బలహీనతవలన నిశితమైన సూర్యాతపము సహింప లేక, యెవరైన నా తాపము తొలగింపవచ్చుననియు గుటికెడునీళ్లు త్రావనిచ్చి నా దాహము నుపశమింప జేయుదురనియు ఆశించి యొక గోడ నీడ నాశ్రయించితిని.

అంతనే యొకయింటి మొగసాల చీకటిలో చుక్క వంటి చక్కని పూబోణి ప్రకాశించెను. ఆ కాంత సౌందర్యమును వర్ణించుటకు అనర్గళ వాగ్ధోరణిగల నాలుకయైన అశక్తమని చెప్పవచ్చును. చీకటిరాత్రిలో ప్రొద్దుపొడుచుచున్నదా లేక, జీవనామృతము చీకటి కోనలోనుండి వెలికుబుకుచున్నదా యనునట్లుండెను.

ఆ యువతి మంచినీటిగిన్నను చేకొని దానిలో కొంచెము పంచదార చిలకరించి ఫ్రాలయాసవము కలిపెను. పన్నీరుచిల్కి సువాసన గుబుల్కొన జేసెనో లేక తన కపోలములందలి గులాబీలను కొంచెము కలిపెనో నేనెరుగను. ఎట్లయిననేమి, మొత్తముమీద ఆ రమణీమణి చేతినుండి పానకము నందుకొని త్రాగితిని. పోవనున్న ప్రాణము మరల కుదుటబడెను.

దోసెడు నీటితో తొలగునే దప్పి
యాపగా జలమైన నణపలేదన్న.

ప్రతి ప్రభాతమునందు నీవంటి రమణి
దివ్యవదనంబుగాంచు నదృష్టమున్న
పుణ్యపురుషుని యానంద పూర్ణహృదయ
మెట్టులుండునొ వర్ణింప నెవరితరము?

అనవమత్తుడౌ నతడు మేల్కనును
అర్ధరాత్రము దాట; ఆసాఖి ప్రణయ
పానీయమత్తుడౌ పావనాత్ముండు
అంత్యదినోదయమందె మేల్కనును.

# 16

మహమ్మదు ఖవారజంషాహి ఖతా ప్రభువుతో హితాభిప్రాయానుసారముగ రాజీచేసుకొన్న సంవత్సరమున, నేను కాష్ఘర్ నగరపు ముఖ్యమసీదునందు ప్రవేశించితిని. అచ్చట చక్కని దేహసౌష్ఠవమును అందచందములుగల యొక బాలుని చూచితిని. ఆతడిట్లు వర్ణింపదగియుండెను :

గురువు శిక్షించె నీకు పోకులపనందు
హృద్వశీకరణంబు, గారించునేర్పు,
లాలనము, సకిచాలన లాఘవంబు
అడ్డులేని దౌర్జన్య, మనాదరంబు.

యిట్టి యున్నతిరూపంబు నిట్టి ప్రకృతి
గల మనుష్యుని నెందు నే గాంచనైతి;
అయిన దేవదూతయె యవియన్ని నీకు
నేర్పియుండునటంచు నే నిశ్చయింతు

ఆ బాలుడు "జమక్ షరీ" అను అరబ్బీ వ్యాకరణమును చేతబట్టుకొని "జయదు అమరూను కొట్టెను. మరియు అమరూను క్షతగాత్రుని చేసెను" అని వాక్యపరిచ్ఛేదము యొక్క యవతారికను వల్లించుచుండెను. ఆ మాటలువిని నేనిట్లంటిని : "అబ్బాయీ ఖవారజంషాహియు ఖతా ప్రభువును రాజీపడిరి. జయదు అమరూల విరోధమింకను కొరవయున్నదా ?"

ఇందుకు ఆ బాలుడు నవ్వి నా యూరిపేరడిగెను. "పవిత్రమగు షీరాజ్ పట్టణము" అని చెప్పితిని.

"అట్లయిన సాదీపద్యములలో నీ కేవైన గొన్ని తెలి యునా?" అని నన్నాతడు ప్రశ్నించెను. నేనిట్లు అరబ్బీలో జవాబు చెప్పితిని:

వ్యాకృతి పఠించు విద్యార్థి వలతుగాని
జైదు అమరూనునట్లు నజ జదువునతడు;
పఠన వినియుక్తచిత్తత బిక్కనున్న
వారి దలయెత్తిచూడడు పాలకుండు.

కొంచెమాలోచించి యాతడిట్లనియెను: "ఈ దేశ మున వ్యాప్తిలోనున్న సాదీకవిత్వము చాలవరకు పారసీ భాషలో నున్నది. కావున మీరు పారసీపద్యములు చదివిన అర్థము సులభమగును." అంతట నేనిటు చెప్పితిని

నీదుభావంబు వ్యాకృతి నిహితమగుట
మాయెడంద వివేకమ్ము మాసిపోయె;
ప్రియుని హృదయంబు నీయురిబిట్టయయ్యె;
మాకు నీవును, వ్యాకృతి నీకు బ్రియము.

మేము పయనింప నిశ్చయించుకొన్ననాటి ప్రొద్దున మాతోడి యాత్రికులలో నెవడైన నొకడు ఫలానియతడు సాదీయని చెప్పియుండవచ్చును. ఆ బాలుడు పరుగెత్తుకొని వచ్చి ఆదరముచూపి మనమున నొచ్చుకొనుచు "ఇంతకా లము మీరేల చెప్పక యూరకుంటిరి. నేను కృతజ్ఞత తెలు

పుకొని మీబోటి పెద్దలసేవకు సంసిద్ధుడనుగ నుండియుం దును,'' అని చెప్పెను.

''నీ యెదుట నేను ఫలానివాడనని చెప్పుకొనుటకు నోరాడక యూరకుంటిని'' అని నేనంటిని. ''మేము మిమ్ము శ్రద్ధాభక్తులతో సేవించునట్లు మీరేల కొంత కాలము ఇచ్చట నుండరాదు'' అని యాతడడిగెను.

''ఏలయన నీ క్రిందికథ ననుసరించి'' యని నేనంటిని:

మనుజసంఘమువీడి మమతవోనాడి
పర్వతగుహయందు పరమసంతృప్తి
కాలంబుగడపెడు ఘనునిదర్శించి
యిట్లంటి: పుణ్యాత్మ, యెపుడ దాన్యంబు
విడిపోవ బట్నంబు వేంచేయరాదె?
అన బూజ్యుడిట్లనె : ఆ పట్టణమున
అచ్చరలంబోలు నతివలున్నారు;
బురవగుంటను నెన్ను పూసి కాల్మెట్ట
గంతదఘ్నంబుగా కాయంబుక్రుంగు.

యీ కథ చెప్పి యొకరినొకరు మొగము ముద్దిడు కొని వీడుకోలొసగికొంటిమి.

ఇంపు చెలికాని ముద్దిడ నేమిఫలము
త్వరిగ వీడ్కొల్పి పంపించపలసినను న్న;
అట్టి వీడ్కోలు 'సెమిని' ననుసరించు
ఒక్క చెంపకు నెరుపు వేరొకట బనుపు.

విడొక్కన్ననాడె నే వేదనామృతుడ
గాశయుండిన నా యగాధంపు జెలిమి
యెంతొ బూటకమని యెత్తిపోసెదవు.

# 17

బొంతలు తొడుగుకొన్న దరిబేసి యొకడు మక్కా కేగుచున్న సార్థవాహమును కలసికొని మాతోడ యాత్ర చేయుచుండెను. అరబ్బీరాజొకడు కుటుంబపోషణమునకయి యా దరిబేసికి నూరుసీనారముల బహుమతి చేసెను. 'కఫాచే' దారిదోపిడిగాండ్రు సార్థవాహమును కనిపెట్టి యుండి దానిని శుద్ధపూజ్యముగ దోచుకొనిరి. వణిజులు లబోదెబోయని కొట్టుకొనిరి. కాని యేమి ప్రయోజనము లేకపోయెను.

ఏడిచి వెడినా యెంత కుయ్యిడిన
దొంగ లిత్తురెమల్లి దోచిన ధనము?

పుణ్యాత్ముడైన యొక దరిబేసి మాత్రము కలత చెందక శాంతముగ నుండెను. "దొంగలు నీ ధనమును దోచుకొనలేదేమొ" యని నేనంటిని. "నా ద్రవ్యమునుకూడ వారపహరించిరి. ధనము పోయినప్పుడు కష్టపడవలసినంత వ్యామోహము నాకు దానిపై లేదు," అని యా పుణ్యాత్ముడు వచించెను.

ఎట్టివస్తులపైని యెవ్వారిపైని
మనసుపెట్టకుము; త్రిమ్మరుపంగలేవు.

యిప్పుడు మీరు చెప్పినది నా పూర్వస్థితి కెంతయు నన్వయించుచున్నది. నా యౌవనకాలమున నొక యువకుని తోడ నత్యంత మైత్రితో కలసిమెలసి యుండుట తటస్థించెను. పొరపొచ్చె మెరుగని మా స్నేహమెంత గాఢమైన దనగా ఆతని సౌందర్యము నా కన్నులకు మక్కావలెను ఆతనితోడి సాంగత్యము నా జీవిత మూలధనముగను ఉండెను.

ఒకవేళ స్వర్గాననుండిన నుండు
నట్టి సుందరమూర్తి యవనిలోలేడు;
ఆతడుమరణింప నన్యులచెలిమి
వెలియయ్యె, నటువంటి వేరొక్కని నిల
గాలించిచూచిన గనలేనికతన.

ఆకస్మికముగా ఆతని జీవిత మూలధనము మృత్యు పంకమున మునిగిపోయెను. వియోగదుఃఖపు నిట్టూర్పు పొగలు వాని కుటుంబమునుండి వెలువడెను.

కొన్ని దినములు నేనాతని గోరీయొద్ద స్నేహాబద్ధుడనై కూర్చుండియుంటిని. ఆతని వియోగమును గురించి నేను రచించిన పద్యములలో నీ క్రిందివి కొన్ని :

మరణపు ముల్లు నీ పదసుమంబునుదాకిననాడె, కాలపుం
గరకు కటారి నా తల దెగం బరిమార్చిన, నీవులేని యీ
నిరయమువంటిలోకమును నే గనకుందును; నీవు గోరిముం
దర నిపుడున్నవాడనయొ, నా మృతికెంతయు వేచియుండియుః.

పడుకపైనిగులాబీలు పరవకున్న
గన్నుమోడిచి విశ్రాంతి గనడునఖుడు ;
కాలము హరించెనతని కపోలరక్తి,
అతని మృత్తికబల్లేరు లంకురించె.

ఆ స్నేహితుని వియోగానంతరము సంతోషానుభవమును ఇతరుల సాంగత్యమును కోరనని దృఢముగ నిశ్చయించుకొంటిని.

నిన్న నెయ్యంపుదోటలో నెమ్మిలీల
రమ్యగతినుంటి; నేడు సత్వంబుపోల్క
ముడుచుకొనియుందునయ్యో! సముద్రయాత్ర
దతగ వెతలేకయున్న నాదాయకథమె.

ప్రొద్దుపొడుపున బన్నీరుపూలచెలిమి
ముల్లువెరలేకయున్న నామోదకథమె.

# 18

ఒక యరబ్బిరాజునకు లయిలామజ్నానుల కథ చెప్పుచు మజ్నాను ఉన్మాదావస్థను గురించి యిట్లువర్ణించిరి: "మంచి తెలివితేటలు పాండిత్యము కలిగియు నతడు చిత్తమును చిక్కబట్టు కష్టమునువదలి యెడారి దారిపట్టెను." రాజు నాతని నిచ్చటికి రప్పింపుడని యాజ్ఞాపింపగా వారు మజ్నానును హాజరుపెట్టిరి. అంతట రాజిట్లు మందలించెను: "మృగత్వము వహించి, మానవసాంగత్యము బహిష్కరించి, యేకాకివై యెడారిలో క్రుమ్మరుటకు, నుదారమైన

మానవస్వభావమున నీకేమి దోషము గోచరించినది?''
అంతట మజ్నూను దుఃఖించి యిట్లనియెను:

> నేను లైలాను ప్రేమించినానటంచు
> నాదుమిత్రులు నిందింత్రునన్ను, గాని
> చెలియనొకమారు వారు వీక్షింతురేని
> యిట్టినాస్థితి హేతువూహింపగలరు.
>
> పదిగ నాదోషములు పారబట్టువారు
> హృదయమోహిని, నిన్ను దర్శింతురేని
> చేతి నారింజకున్మారు చేతివ్రేళ్లు
> చెనటులై కోసికొనుటలో జిత్రమేమి?

ఈతనికింతటి దురవస్థ తెచ్చిపెట్టిన లైలా రూప లావణ్యము లెట్టివోయని యామె సౌందర్యమును స్వయముగ చూచుటకు రాజు మనము ఉవ్విళ్లూరుచుండెను. లైలాను రప్పించుట కాజ్ఞయైనది. 'హాయా' తెగవారి కుటుంబము లలో వెదకి వెదకి తుదకు ఆమెను కనుగొని తీసుకొనివచ్చి రాజాంతఃపురమున నడిమిచౌకమున నిలబెట్టిరి. రాజు ఆమె రూపమును కొంతసేపు నిదానించి పరికించెను. కాని రాజు కంటి కాయువతిరూపము అమిత సామాన్యమైనదిగ కని పించెను. ఏలయన, తన యంతఃపుర పరిచారికలలో నధము రాలైనను అందచందముల లైలాకన్న మిన్నగనుండెను.

మజ్నూను ఇంగితజ్ఞుడుకావున రాజు మనసులోని భావమూహించి యిట్లనియెను. ''మహాప్రభూ, మజ్నూను కంటిద్వారముననే లైలా సౌందర్యమును దర్శింపవలయును.

అట్లయిననే ఆ దివ్యదృశ్యముయొక్క రహస్యము మహిమ మీ హృదయమున ప్రకాశించును.''

అరోగ్యవంతుడై యలరుమానవుడు
వ్రణబాధ తత్త్వంబు భావింపగలడె?
నావంటివానికే నాబాధవినుతు :
కాటుపొందనివాని కడ గందురీగ
కథజెప్ప వ్యర్థంబుగా దోసుగాదె!
సరిగ నాస్థితీనీకు సమకూడుదాక
వ్యర్థగాథగ నాయవస్థ గన్పట్టు.

# 19

హందాన్ నగరపు న్యాయాధిపతినిగురించి యిట్లు చెప్పుకొనిరి : లాడములు కొట్టువాని కూతురిపై ఆ పెద్ద మనుష్యునకు వలపుగలిగెను. కామప్రేరితమైన యాతని హృదయము కొలిమిలోని గుర్రపు లాడమువలె నెర్రగ గ్రాగెను.

కొంతకాలము చంచలచిత్తుడై యతడు ఆ యువతిని వెదకుచు, నిరీక్షించుచు, తనకు తటస్థించిన విషయములు చెప్పుకొనుచు నిట్లనియెను :

నిడుపగు దేవదారుధరణీజము నా గనువిందుచేసి యో
పడతి, మదీయహృత్కుసుమ బాదములం జెనద్రొక్కెదేల, నా
యెడదను నీ విలోల లలితేక్షణముల్ చెరవెట్టు; నెవ్వరుం
బుడమిని నీ మనంబు గొనబోలనిచో గనుమోడ్చు మీదయన్.

ఒకనాడాయువతి దారిలో న్యాయాధిపతి కెదురు పడెను. ఈతని వ్యవహారములు గాలివార్తగా తన చెవిని పడియుండుటవలన, మితిమీరి కోపగించుకొని కఠినముగా దూషించెను. రాళ్లు రువ్వెను. ఆతని యవమానమునకు కావలసిన ప్రయోగములలో నేదియు వదలిపెట్టలేదు. అంతట అ న్యాయాధిపతి విశ్వాసపాత్రుడైన యొక మిత్రునితో నిట్లనియెను :

యిటుచూడు ప్రేయసి యెటులగా ంచెడినో
కుటిలభ్రుకుటిగూడ గూర్చనందంబు!
మనము ప్రేమించెడు వనిత చేదెబ్బ
ఖర్జూరఫలమట్లు కడుతియ్యనౌను.

నోటనీపిడికిటి పోటులందినుట
వెన్నరొట్టెలదినుకన్న ప్రియంబు.

నిజముగా నా కాంత లజ్జావిహీన చేష్టలందు కౌదార్య సౌరభము గుబులొ్కొనుచున్నది.

క్రొత్తగాదెచ్చినట్టి యంగూరుఫలము
చప్పరించిన పుల్లని చవినొసంగు;
రెండుమూన్నాళ్లు నోర్పుతో నుండుమోయి,
యదియె వితబండి మధురసన్యందియగును.

ఇట్లు వచించి ఆయన న్యాయస్థానమునకు వచ్చి గద్దెపై కూర్చుండెను. అంతట తనయాజ్ఞకు లోబడి యుద్యోగము చేయుచుండిన కొందరు పెద్దమనుష్యులు వినయపూర్వకముగ భూమిని ముద్దిడి యిట్లు విన్నవించిరి :

"ఒకవేళ మర్యాదాలోపమని యనిపించుకొన్నను దేవర వారి యనుమతితో నొకమాట మనవిచేయ దలచుకొంటిమి. పెద్దల యభిప్రాయ మిట్లున్నది :

ప్రతిమాటకుందప్పు పట్టుటతగదు;
మనులతప్పరయుట ఘనమైనతప్పు.

అయినను పూర్వమునుండియు దేవరవారి యౌదార్యము మాబోటి దాసుల సుఖజీవనమునకు కారణమైయున్నదన్న కృతజ్ఞతవలన నిట్లు విన్నవింపవలసి వచ్చినది. మాకు న్యాయమైనదని తెలిసియు మీకు తెలుపనియెడల అది యొకవిధమగు విశ్వాస ఘాతుకమగును. మీరు ఆ లాడాల వారి యువతిపై మోహమువదలి కోరిక మరలించుకొనవలయును. న్యాయాధిపతి పదవి యున్నతమైనది; అనన్యగమ్యమైనది. అట్టి పవిత్రపదవిని పాపపంకముచే కళంకితము చేయకుడు. ఆ కాంత యిట్టిదని మీ రెరుంగుదురు; చూచి యున్నారు. మాటలును వినియున్నారు.

ఎన్నియవమానములు పడ్డహీనమతికి
నొకరిమానంబుపై శ్రద్ధయుండుటెట్లు ?
ఏబదేండ్లుగడించిన దేనికీర్తి
నొక్కనాటి దుష్కృత్యము మొక్కలించు."

స్నేహితు లేకగ్రీవముగ నొసంగిన హితోపదేశము న్యాయాధిపతికి సమ్మతముగ నుండెను. వినదగవైన వారి యభిప్రాయములను కొనియాడుచు ఆతడిట్లనియెను : "నా

ప్రాణమిత్రులదృష్టి నా స్థితిని కాపాడుటయందు నియుక్తమై యుండుట యెంతయు న్యాయముగను ప్రత్యుత్తరము లేని ప్రశ్నగను ఉన్నది. అయినను హితము బోధించినందుకు స్నేహము త్యజింపబడునేని సత్యవంతులను దగాకోరులని నిందింపవలసి వచ్చును.''

"యిచ్చువచ్చినయంత హితముబోధించు
కాని జంగీ నల్పు గడుగంగపశమె
నినుదలంచుట మాన్పనేర రిందెవరు;
తలదెబ్బతగిలిన త్రాచును నేను;
బలమరిచుట్టగా బసియున్న వాత.''

యిట్లునుడివి ఆ యెమ్మెలాడి స్థితిగతు లరయుటకు కొందర నియోగించి ధనము మితిమీర వెచ్చించెను. తక్కెడలో ధనముండు వారికి రెట్టలలో బలముండునని చెప్పుదురుగదా!

ధనముజూచినవాడు తలవంచు ద్రాను
వలె, లోహబాహులబలము గల్గియును.

ఎట్లయిననేమి, మొత్తముమీద నొకనాటి రేయి న్యాయాధిపతియు ఆ వలపులాడియు రహస్య కేళీవిలాసముల దేలియాడిరి. ఈ విషయమెవ్వరో ఆ రాత్రియే రక్షకభటాధిపతికి తెలుకపరచిరి. రాత్రియెల్ల న్యాయాధిపతి తలయందు ద్రాక్షాసారాయి కైపును, కౌగిట ఆ ప్రియురాలును ఉండెను. సంతోషాతిశయముచేత నిద్రపట్టక కూనరాగములు తీయుచుండెను.

ఒకవేళ నిరాత్రి యుక్తకాలంబున
గూయకుండును గాక కుక్కుటంబు;
కాముకీ కాముకుల్ కౌగిట ముద్దుల
నిసుమంత తనివొంద రింతవనుక;
తనుమోడ్చినా రొక్కక్షణము విరోధులు
అనువయ్యె దరి; కోర్కెలనుభవింపు;
తెలివితేటలతోడ మెలకువనుండుము
బ్రతుకిక్కటులపాలు పడక యుండ;

రాచనగళుల దొలిభేరి రణనములును
బెనుమసీదున దొలికూయి వినెడుపతకు
పెదవి పెదవినివీడుట పిచ్చితనము,
తెలివిమాలినకోడి కూతలనునమ్మి.

న్యాయాధిపతి యీ స్థితిలోనుండగా సేవకుడొకడు పరుగెత్తుకొనివచ్చి "ఇంకను మీరిట్లు కూర్చుండియున్నా రేల? లెండు లెండు అనుకూల సమయమున్నప్పుడే త్వర పడుడు. అసూయాపరులు మీపై నపనిందలు మోపు చున్నారు. అయినను నిజమే చెప్పుకొనుచున్నారు. ఈ కీడు ప్రస్తుతము కొద్దిగనే యున్నది. వివేకముతో వర్తించితి మేని దాని నణగద్రొక్కవచ్చును. అట్లుగాదేని రేపు మాపుల నీవార్త లోకమున వ్యాపించును," అని విన్న వించెను. అంత న్యాయాధిపతినవ్వుచు వానితట్టుచూచి యిట్లనియెను:

మృగరాజుహస్తంబు మృగముపైనుండ
కుక్కలు లొల్పెట్ట గొరగానితనము;

మోముమోమునజేర్చి మఃదితతోనుండు,
మరులు గ్రేల్కురచి భగ్నాశులైకుంద.

"ఏలినవారి రాజ్యమున క్రొత్తగా నిట్టిచెడ్డతనము జరిగినది. యేమియాజ్ఞ పెట్టెదరు!" అని ఆనాటిరాత్రియే రాజునకెరిగింపిరి. అంతట రాజిట్లనియెను: "ఆ పెద్దమనుష్యుడు ఈనాటివారిలో అద్వితీయుడగు పండితుడు అని నేనెరుంగుదును ఒకవేళ విరోధులెవ్వరైనను ఆతని యోగ్యతను మాపుటకు నిశ్చయించుకొని యుండవచ్చును. నాకు ప్రత్యక్షముగ రుజువుకానిదే యీ మాటలు నేను చెవినిబెట్టను. ఏలయన విద్వాంసులిట్లు చెప్పియున్నారు:

త్వరపడి కుపితుడై కరవాలుపూన
బరితాపమున వెన్క బంటగ్రేల్గరచు."

ప్రొద్దుపొడువగనే కొందరాస్థానికులతోడ రాజు న్యాయాధిపతి పడుకటింటికి వచ్చెను. దీపములు వెలుగుచుండినవి. ప్రియురాలు కూర్చుండియుండినది. ద్రాక్షాసవము చిందియుండెను. ఆసవపాత్రికలు పగిలియుండెను. న్యాయాధిపతి కై పునిద్రలోనుండి రాజువచ్చినదే యెరుగడు.

అంతటరాజు "లెమ్ము, సూర్యుడుదయించెను" అని మెత్తగా పల్కి యాతని మేల్కొల్పెను. అతడు మేల్కని తానున్న యవస్థను తెలపోసికొని "సూర్యుడేదిక్కున నుదయించెను!" అని ప్రశ్నించెను.

రాజు ఆశ్చర్యపడి "తూర్పుదిక్కున" అని జవాబు చెప్పెను.

"దేవుడు స్తుతింపబడుగాక! అనుతాపద్వారము ఇంకను తెరువబడియున్నది. పురాణమిట్లు చెప్పుచున్నది: సూర్యుడు పడమట పొడుచువరకు దాసులకు అనుతాప ద్వారము మూయబడదు. మరియు నిట్లనెను: దేవుని క్షమార్పణము వేడుచున్నాను. అనుతాపము నొందుదునని దేవునియెదుట శపథము చేయుచున్నాను.

తెలివికొరతయు దురదృష్టములును గలసి
పాపపంకంబుౘ నన్ను బడగవినరె;
శిక్షయర్హంబె; యైన నా చిన్నతప్పు
కరుణమన్నింప, ప్రతిహింసకంటె మేలు.

అంతట రాజిట్లువచించెను: "ఇప్పటి నీ స్థితియందు పాప పరిహారముగ అనుతాపము నొందుదునని తెలుపు కొనుటలో నేమియు లాభము లేదు.

మేడపై మోకువిసర జేయాడనపుడు
దొంగ యనుతాపమొంద నెబ్బంగిమేలు?
పాడుగువానికె ఫలమంట బోలవనిన
గుజ్జువా డందుకొనలేడు కొమ్మ దానె.

చక్కగా రుజువుకాబడిన యిట్టి దుష్కార్య మొనర్చిన నీకు క్షమార్పణము దుస్సాధ్యము," అని రాజువచించి నంతనే రక్షకభటులు నేరస్తుని చుట్టుముట్టిరి.

"నేను ఏలినవారికి మనవి చేసుకొనవలసినమాట యొకటి మిగిలియున్నది" అని యాతడనెను. "అదియేదని" రాజడిగెను.

నన్నువిసుగెత్తి నిరసించినను, దలంప
వలదు మీకొంగువిడనాడు వాడననుచు;
అరయ దుస్సాధ్యమన్యు క్షమూర్పణంబు
మీ కృపాచిత్తవృత్తి సమ్మితిని ప్రభువ.

"ఈ చమత్కార వాక్యములు మెచ్చుకొన తగి యున్నవి. అయినను నీ పాండిత్యమునకును వాచాలత్వము నకును సంతసించి యీ దినము నిన్ను నా శిక్షానఖముల నుండి విముక్తుని చేయుదునేని యది యన్యాయముగను అవిచారమూలకముగ నుండును. కావుననిన్ను కోటపైనుండి క్రిందికి త్రోయించుటయె యుక్తమని నాకు తోచుచున్నది. యేలయన నితరులు నిన్ను నుదాహరణముగ గొని నీతి నేర్చు కొందురు." అని రాజువచించెను.

"జగత్ప్రభూ, నేను మీ కుటుంబ దాతృత్వమువలన పోషింప బడితిని. లోకమున నేనొక్కడనే యిట్టితప్పు చేసినవాడనుగాను. వేరొకని త్రోయించుడు. వానినిచూచి నేను నీతి నేర్చుకొందును" అని న్యాయాధిపతి విన్నవించెను. ఈ మాటలకు రాజు కడుపుబ్బనవ్వి శిక్షనుపసంహరించి ఆతని మరణమున కెదురుచూచుచుండిన యసూయాగ్రస్తులతో నిట్లనియెను:

తప్పుసేయనివాడు ధరలోనలేడు
ఒరులతప్పులుచూపి పరిహసింపకుము.

## 20

చక్కనియువకుండు సత్ప్రవర్తనుడు
చంద్రాస్యయుంగూడి జలధియానంబు
నలిపిరి; యా నావ నలిలవీచికల
దుళ్లింతలాడుచు నల్లనంజనియె;
ఒకనాడు నావపై నొరగానిల్చి
యువతియు యువకుండు నుదధికల్లోల
గంభీరనాట్యంబు గాంచుచునుండ
సొరిగెనోడయు, వారు సుడిగుండమందు
చిరుచుకొనిపడిరి విధిచేష్టకతన,
ఆవర్తజలవేగ మతిశయింపంగ
నంచజంటపిధాన నందుచుట్టెదరు;
అదిగాంచి నావికుడబ్ధిలో దుమికి
యువకుని బాహువు నొడిసిపట్టంగ
"ననువీడి ప్రియురాలి మనుగావు" మంచు
సలలమధ్యమునుండి యరచెనా ప్రియుడు;
అపల్కులకు లోకమతని ప్రేమించె;
"ప్రియను కష్టములలో విడనాడినట్టి
పాపినడుగకుమీవు ప్రణయతత్త్వంబు"
అని యదృశ్యుండయ్యె నంబుగర్భమున;
ప్రణయతంత్రంబుల బహువిధానములు
అంతుపొంతులెరుంగ నయ్యోసాదికి;
బగదాదున నతట్టి భాషనందమున,
హృదయదంజనియంగా హృదయంబునిల్పు,
కన తెతిమూదను కడమలోకంబు;
మరలజీవించురేజా షుజ్యాసుకైల,
ప్రణయతత్త్వంబిందు బడయంగగలదు.

# షష్ఠాధ్యాయము

# వార్ధక్య దౌర్బల్యము

## 1

దిమిష్క నగరమునందలి పెద్దమసీదున కూడియున్న పండిత సభయందు నేను శాస్త్రవాదము చేయుచుండగా నొక యువకుడు ప్రవేశించి "ఇచ్చటనున్న వారిలో పారసీ భాష తెలిసిన వారెవరైన నున్నారా" అని ప్రశ్నించెను. వారు నన్ను చూపిరి. "విషయమేమి?" యని నేనడిగితిని. ఆతడిట్లనియెను: "నూటయేబది సంవత్సరముల వయస్సుగల యొక వృద్ధుడు మరణావస్థలోనున్నాడు. ఆతడు పారసీభాషలో ఏమో చెప్పుచున్నాడు. మాకర్థమగుట లేదు. మీరు దయచేసి కొంచెము శ్రమతీసుకొని యచ్చటికి వత్తురేని మీకు ప్రతిఫలముకూడ ముట్టనచ్చును. ఆతడొకవేళ వీలునామా వ్రాయించవచ్చును."

నేనా వృద్ధునివద్దకుపోయి తలదిండుపై వంగితిని. ఆతడిట్లు తిన్నగా చెప్పెను:

> కొన్నినాళ్లైన గోర్కెలు గుడుతుననుచు
> దలచితిని, ప్రాణమయ్యో! పైబారిపట్టె;
> పలువగలజీవితపు బైడిపళ్లెమున
> క్షణము చవిచూచితినొలేదొ, చాలుననిరి!

ఈ పద్యములోని భావమును దిమిష్కనగరవాసులకు అరబ్బీ భాషలో వివరించితిని. ఇంత దీర్ఘ కాలము బ్రతికియుండియు, ఐహిక జీవితముపై ఆతనికిగల కోర్కెను విని వారాశ్చర్యపడిరి.

" నీస్థితి ఎట్లున్నది? " అని ఆముదుసలిని ప్రశ్నించితిని. ఆతడొక నిట్టూర్పువిడిచి యిట్లనియెను: " ఏమని చెప్పుదును ?

పన్నుపెరికెడునప్పుడు పడెడుబాధ
నొక్కసారి యనుభవించి యుందువేని
ప్రాణము ప్రియాంగమునువీడి పరమస్థితియు
నెట్టులుండునొ నీవె యూహింపగలవు."

అంతట నేనిట్లంటిని: " మరణముతలంపును నీ మనమునుండి వెడలింపుము. నీ శరీరస్థితిపైని సంశయము వదలుము. ఏలయన, దేహస్థితి దృఢముగనున్నను చిరంజీవత్వమున కది హామీకాదనియు ఒకవేళ రోగము హెచ్చినన్న మాత్రమున అది మృత్యువునకు అమోఘమైన సూచనకాదనియు యూనానీ తత్త్వవేత్తలు వచించియున్నారు. సెలవిత్తురేని, మీరోగము కుదుర్చుటకు వైద్యుని పిలిపించెదను. " ఈ మాటలకు ఆ వృద్ధుడు కనులెత్తి చూచి నవ్వి యిట్లనియెను

భాండమట్టుల వృద్ధుండుపగిలిపోవ
జేయి విదలించు విగతాశచేత వెజ్జు;

గోడకాలు లోలోపల గ్రుంగుచుండ
గృహముగళల శృంగారించు నింటిపెద్ద.

చరమదశ బాధకడలు నశక్తవృద్ధు
కాళులకు దాది ముసలమ్మ గంధమలదు;
ఉలుకుదిన్న కొయ్యాటు దేహముడుటుచక్క
మందుమాకులు మంత్రంబు లెందుకెక్కు.

## 2

ఒక వృద్ధునిగురించి యిట్లు చెప్పుకొనిరి : ఆతడొక యౌలప్రాయపు టందకత్తెను పెండ్లియాడెను. పడుకటిల్లు పన్నీరుపూవులతో సింగారింపబడెను. ఆతడు ఏకాంతమున ఆ కాంతతోడ కూర్చుండి, హృదయమును కన్నులను ఆమెయందు లగ్నము చేసియుండెను క్రొత్త కోడంట్రికపుసిగ్గు, భయము, అనిష్టము వదలించిన సహవాసము దృఢమగునని తలంచి రాత్రులయందు కన్నుమూల్పక ఆమెతోడ సరససల్లాపము లాడుచుండెను.

ఇట్లుండ నొకనాటిరాత్రి యాతడీవిధముగ నుపన్యసింపసాగెను : నీపైని అదృష్టము చెలిమిచూపినది; వైభవముకన్ను తెరచినది ఏలయన నావంటి ముసలిమగని సాంగత్యము నీకు ప్రాప్తించెను. నేను లోకజ్ఞానము కలవాడను. గొప్పగా బ్రతికినవాడను. సుఖదుఃఖము లను భవించినవాడను. మంచి సెబ్బరలు గోష్ఠిమర్యాదలు

స్నేహానియమములు చక్కగ నెరుంగుదును. దయాదాక్షిణ్యములు, సంతోషస్వభావము కలదు. మధురభాషిని.

చేతనైనంతవరకు నీచిత్తమరసి
కన్నులను గప్పుకొందు నో కలికిమిన్న;
చిలుకకటుతిండి కలకండ పలుకులైన
దియ్యనౌ నాదుబ్రతుకు నీ తిండికిత్తు.

మొరకతనము, తెలివి తక్కువతనము, కోపదారితనము గల యొకయువకుని చేతిలో దైవవశమున నీవు పడకుండుట మంచిదయ్యెను. అట్టి చంచలచిత్తుడు ప్రతిక్షణము ఇంద్రియలోలుడై యుండును. నిమిషనిమిషము అభిప్రాయములు మార్చుకొనును. ప్రతి రాత్రియు నొక్కొకచోట నిద్రించును. ప్రతిదినమును ఒక్కొక క్రియురాలిని చేపట్టును.

ముక్కు మొగమందమును దెల్పపొనరుగాని
యువకుల కెడంద యచలమై యుండదొకట;
ప్రతినిమిష మన్యరోజాలపైకి నెగురు
బుల్బులికి బ్రేమవిశ్వాసముల్ తిరంబె!

అయినను నావంటివృద్ధుల కెకకు సంబంధించిన పెద్దమనుష్యులు తెలివితేటలతోను మట్టుమర్యాదలతోను జీవనయాత్ర సాగింతురుగాని యువకులవలె అజ్ఞానవంచితులు గారు.

చాన, నీకన్నమేలైనవాని గొనుము;
అదను వృథసేయ కాదాయమంతగనుము;
నిన్నుబోలినవాని వాంఛింతువేని
నన్నుగిలు భాగ్యరేఖా ప్రసన్నపథము.

"ఆ యువతి హృదయమును వశపరచుకొని నాయందు బద్ధానురాగను నొనర్చికొనగలను," అని తలంచి యాధోరణిలో వచించితిని. ఆ తరుణి తటాలున వేదనాభరితమైన హృదయాంతరాళమునుండి వేడినిట్టూర్పు వెడలించి యిట్లనియెను: "మీరు చెప్పినమాటలను తెలివితో నెంత విమర్శించి చూచినను అందొక్కటియు పూర్వమొకప్పుడు నాదాది చెప్పిన వాక్యములతో తులతూగదు. అవి యేవన: "జవ్వనముగల చిన్నది ముసలివాని ప్రక్కలో పరుండినయప్పటి వేదనకంటె ప్రక్కలోని బాణక్షతి బాధయే మేలుగ నుండును."

మగని పేరెద దనియని మగువయింట
నణుగుగొణుగులు ఘర్షణ స్పర్ధ లెనగు;
క్రతమోపునలేచెము త్రొరిసిగ్గు
తెలవ పడుకింటిమోజులు దీర్పగలదె?

మొత్తముమీద సారాంశమేమనగా, వారిరువురికి పొత్తుకుదురక సంబంధము తెగదెంపుచేసుకొనిరి. నిర్ణీత కాలము దాటినవెనుక ఆ యువతిని ఒక యువకునికిచ్చి పెండ్లి చేసిరి. ఆతడు కోపదారి. చేతిలో పైసా లేనివాడు. దుఃస్వభావుడు. అందువలన పాపమా యిల్లాలు దౌర్జన్యమునకు కష్టములకు పాల్పడియును దేవునికి కృతజ్ఞతాపూర్వకముగ నిట్లనియెను: "దేవుడు స్తుతింపబడుగాక! ఆ నరక బాధలు తప్పించుకొని యిప్పటి స్థిరసౌఖ్యమును పొందితిని."

మధురవదనంబు, పట్టుజామాలు, నూదు
పొడియు, గంధము, రంగును, భోగలిప్స
పొలతులకు నివ్వియెల్లను భూషణములు;
పురుషులకు బూరుషత్వమే భూషణంబు.

కోపగింపులు దుడుకులు కోటులున్న
అనమ సౌందర్యమూర్తి వీవౌట వలతు;
నితరులంగూడి స్వర్గాన బ్రతుకుకంటె
నతన నీవుంట నరకవానంబు మేలు!

పాటలాధరముద్దు నోటవెల్వడిన
యుల్లివాననయైన నొప్పిదంబగును
వికృతాంగిచేతి గుల్విరిబంతికంటె

# 3

'బకర్' దేశమున భాగ్యవంతుడైన యొకవృద్ధునకు నేను అతిథినైయుంటిని. ఆతనికి రూపవంతుడైన యొక కుమారుడుండెను. వృద్ధుడు తన చరిత్ర మిట్లు చెప్పెను: "నాకీ జీవితమందు ఈ బిడ్డ యొక్కడు తప్ప మరెవ్వరు కలుగలేదు. ఆ కోనలో నొక చెట్టున్నది. దానివలన ఆ ప్రదేశము యాత్రాస్థలమైనది. ప్రజలు వరములడుగుటకు అచ్చటికి వచ్చుచుందురు. నేను కొన్ని రాత్రులు ఆ చెట్టు దగ్గర వరపడి దేవుని ప్రార్థించుచుంటిని. అంతట వరప్రసాదము వలన ఈ బిడ్డ పుట్టెను."

ఆ కుమారుడు మెల్లగా మిత్రులతో నిట్లుచెప్పెనని వింటిని "ఆ చెట్టున్నచోటు నాకు తెలిసియున్న ఎంత

బాగుగ నుండును? మా తండ్రి చావుకొరకు నేను ప్రార్థించి యుండును.''

పిల్లవాడు తెలివిగలవాడాయెనని తండ్రి సంతోషించు చుండ, తండ్రి తెలివిమాలిన ముసలిగొడ్డని కొడుకు నిందించుచుండెను.

తరలి బెక్కండ్లు నీ జీవితంబునందు
తండ్రిగోరీనిగాంచ నాతట్టుచనవు:
పితరులరుసింప జెయిచాచిపెట్టినావె?
కొడుకు నీకేమి యొనరింపగోరుకొనెదు?

# 4

ఒకనాడు దారిపట్టి యౌవనగర్వమున పరుగెత్తి రాత్రికాలమున ఒక తిప్పమొదట అలసిసొలసి పడియుంటిని. సార్థవాహమును వెన్నంటివచ్చిన యశక్తుడైన ముసలివా డొకడు నన్నుచూచి ''ఏల నిద్రించుచున్నావు? ఇది నిద్రించుటకు తగిన స్థలముకాదు,'' అని నన్ను హెచ్చరించెను. ''నడచుటకు కాళ్ళురావు. నేనెట్లు నడవగలను'' అని నేనంటిని. ''పరుగెత్తి యలసి కూలబడుట కంటె కొంత నడచుచు కొంత విశ్రాంతిగొనుచు పోవుటయే మేలు'' అని పెద్దలు చెప్పినవాక్యము నీవు వినలేదా?

అంచెజేరుతలంపున్న నాత్రపడకు,
ఓర్పువహియించు; నాదు హితోక్తివినుము;
తయమునంబోవు నొకజా మరబ్బిహయము,
తడబడక రేలునుబవళ్లు నడచునొంటె.

# 5

మా సంతోష గోష్ఠియందొక చురుకైన యువకు డుండెను. ఆతడు చతుర మధురభాషి. దరహాసవదనుడు. ఏవిధమైన దుఃఖమును ఆతని హృదయము నంటలేదు. ఎప్పుడైనను చిరునవ్వు పెదవులను వదలలేదు. ఆతడు వెడలిపోయి చాల కాలమయ్యెను మేమిరువురము కలసికొనుట తటస్థింపకుండెను. తర్వాత కొంత కాలమునకు చూచినప్పటికి ఆతడు పెండ్లియాడి బిడ్డలతండ్రియై యుండెను. ఆతని సంతోషము మూలచ్ఛేదమై మోముగులాబి వాడియుండెను. ఆ మార్పు గమనించి "నీ స్థితిగతులేమి" అని ప్రశ్నించితిని. "పిల్లల తండ్రి నైతిని, కావున పిల్లతనము మానితి" నని ఆతడు చెప్పెను.

వృద్ధుడవైనంత విడుపిల్లతనము;
ఆటపాటలు వీడుమయ్యా బాలుతకు.

యువకుని యుత్సాహముండునే ముదుకకు
ఎక్కడనే వెనుకకు నేటినీరు?
పంటకారున దంటుపనలేని వరిచేలు
పడకనిల్చునె పచ్చపైరులటుల?
హస్తసంచ్యుతమయ్యె యౌవనమయ్యయ్యో!
ఎంతమోహనమైన ఋతువుచనియె!
సింహముష్టిబలంబు జీర్ణించె బాహుల
చిరుతనాజూన్కుతో గరతుత్పత్తి;

తలకు రంగువేసిన యవ్వతట్టు చూచి
నే నిటంటిని: ముసలమ్మ, నెరకలేమొ

కప్పుపొడిపూతతో నల్పుగాంచెగాని
వంక వీపును సరిచక్క పరచలేవు.

# 6

యౌవనపుటజ్ఞానమున ఒకనాడు మా తల్లిని అరచి కసరితిని. ఆమె హృదయమున వేదనపడుచు ఒకమూల కూర్చుండి ఏడ్చుచు నిట్లనియెను: "నీకు బాల్యము జ్ఞప్తి యున్నయెడల ఇప్పుడు నన్నిట్లు కష్టపెట్టి యుండవు."

పులివలె శౌర్యంబు బలమును గల్గి
గున్నయేను గుబోలు కొడుకునుగాంచి
ముదముతో నిట్లనె ముదునలి తల్లి
పాల్(దావి నా యెద బన్నున్ననాటి
నిస్సహాయస్థితి నీ స్మృతినున్న
గసరికొట్టవునన్ను; గాని యీనాడు
సింహసత్త్వుడవీవు; జీర్ణాంగి నేను.

# 7

పిసినిగొట్టు భాగ్యవంతుడొకడుండెను. ఆతని కుమారుడు వ్యాధిగ్రస్తుడాయెను. మేలుగోరు మిత్రులిట్లనిరి: "పిల్లవాని రోగము కుదురుటకు ఖురాను పారాయణము చేయుము, లేదా జంతువునైన బలియిమ్ము" కొంతసేపాలోచించి యా లోభి యిట్లనియెను: "మంద దూరమున నున్నది. కావున ఖురాను పారాయణమే మేలని తలంచెదను." ఈ మాటలువిన్న యొక పెద్దమనుష్యు డిట్లనియెను: "ఆతనికి ఖురాను పారాయణమేల యిష్టమైనదనగా,

ఖురాను నాలుక కొనయందున్నది. ధనము ప్రాణకోశము నందున్నది."

దానహస్తంబుజాపని మానవుండు
భక్తిమెడవంచినంతనే ఫలితమేమి?
రూకయిమ్మన్న, గాడిద రొంపినట్లు
కదలడు; ఖురాను గోరిన జదువు శతము.

## 8

"నీవేల పెండ్లి చేసికొనవు?" అని యొక ముసలివాని నడిగిరి. "నాకు ముసలిదానిపై కోరిక లేదు."

"నీకు భాగ్యమున్నది కావున యువతినే యేల పెండ్లి యాడరాదు?"

"ఏలయన, అది యువతియేయైన నావంటి ముస లాతని ఎట్లు ప్రేమింపగలదు?" అని ఆయన చెప్పెను.

దెబ్బదేడుల తాతయ్య నిబ్బరంపు
యౌవన రసానుభూతిపై నాసగొనుట
కలను నంధుండు కన్నులు గాంచినట్లు;
తరుణి బలమునుగోరు, నీ ధనముగాదు.

## 9

కడచన్నాళుల గడువృద్ధుడొకడు
తరుణిని జేపట్ట దలపోసి యొక్క
ముద్దుల మూటను, మోహంపు బరణి,

ఎలప్రాయపుంగల్కి, వలరాచముల్కి
'ముత్యా' మనెడి పేరి ముగ్ధను దెచ్చి,
ముత్తెంబు బరణిలో మూసినపోల్కి
మగపురుగుల కంటికగపడనీక
అంతిపురంబున కామెనర్పించె.

ఆ నిషేకముహూర్త మతి వైభవముగ
జరిగె; పూవ్వులపాన్పు సంసిద్ధమయ్యె;
పడుకటింటను వెల్గె పటికలన్తరులు;
అత్తరు జవ్వాది యగరు గంధములు,
పన్నీరుపూవ్వుల పచ్చివాసనలు
కామాగ్ని నెగమూదు గాలియైవినరె;
శయనమందిర మిహ స్వర్గమై యొప్పె.

యుద్ధసన్నద్ధుడై యుద్ధవీరుండు
నంగబలంబెల్ల నాయత్తపఱచె;
ప్రథమ యత్నముననే ధ్వజభంగమయ్యె;
విల్లెక్కుపెట్టి యే విధము చూచినను
గురిదాకునట్లుగా గొట్టలేడతడు;

ముతకబొంతనుగుట్ట మొనగలసూది
యుక్కుదిగాకున్న యుపయోగపడదు.

తన మానమర్యాద తనవంశకీర్తి
తన జీవితసుఖంబు తనప్రేమరక్తి
యీ మాయలచినారి యింతియొల్లమిని
అంతయు నశియించె నని నిందమోపె;

అలుమగలయందు నధికఘర్షణము
తిట్టుకొట్టులు నింట తీరనిపోరు
బలిసి, రక్షకభట స్వామికిందెలిసె.

సాదియిట్లు వచియించె: చాలించునింద;
తరుణిదీ యేలాటి తప్పులేదిందు;
వార్ధక్యమున చేయి వడకుచునుండ
ముత్యంబునకు బొంద బొడుచ నీతరమె?

---

# సప్తమాధ్యాయము

# విద్యాప్రయోజనములు

## 1

ఒకానొక వజీరునకు మందబుద్ధియగు కుమారుడుండెను. విద్యాభ్యాసమువలన బుద్ధి వికసించునని తలంచి, తండ్రి కుమారుని ఒక పండితునియొద్దకు చదువ బంపెను. అతడు కొంతకాలము బాలునకు విద్యనేర్పెను. కాని ప్రయోజన మేమియు గాన్పించనందున "ఈతడు బుద్ధిమంతుడు కాకపోవుటయేగాక నన్నుగూడ వెఱ్ఱివానిని చేసెను" అనిచెప్పి ఆ బాలుని మరల తండ్రియొద్దకు పంపెను.

పదనులేని యినుము బలుసాన వెట్టియు
జక్కజేయఁగలడె శాణికుండు;
సహజ బుద్ధిశక్తి సంపన్నుడైనచో
శిక్షణమున మేలు చెందవచ్చు.

ఏడుమార్లు కుక్క నేటిలో గడిగిన
తడిగనుస్సవరకు దాల్చు మురికి;
మారబోదు తాను మక్కాకునేగియు
ఏసుక్రీస్తు వెక్క రాసభంబు.

## 2

ఒక తత్వవేత్త తనబిడ్డలకిట్లు నీతిబోధించెను. "ప్రియపుత్రులార, కళలు: శాస్త్రములు నేర్చుకొనుడు.

లౌకిక ప్రాభవములు ఆస్తిపాస్తులు నమ్మియుండ తగినవి కావు. ఒకచోటినుండి మరియొక చోటికి పయనించునప్పుడు ధనము ఆపదలకు అపాయములకు మూల మగును. లేదా దొంగలు దోచుకొనవచ్చును. అట్లుకాదేని అను భుక్తమయి క్రమక్రమముగ క్షీణింపవచ్చును. అయితే, విద్యయట్టిది కాక యింకిపోని సెలయేటివలెను, స్థిరమైన ప్రాభవము-వలెను, మరణపర్యంతము సొంతమైయుండును. విద్యావంతు డొక వేళ పదభ్రష్టుడైనను చింత లేదు. ఏలయన విద్య తనంతదానేయొక యైశ్వర్యము. పండితుడెక్కడికి పోయినను గౌరవింపబడును; ఉన్నతస్థాన మలంకరించును. విద్యా విహీనుడు పొట్టకూటికై యి తిరుగులాడుచు కష్టపడుచుండును.

పదవి యధికారముండిన వాడు మరల
నాజ్ఞకనువర్తియై దాస్యమందునుంట,
బ్రతుకు సుఖముగ బుచ్చినవాడు పరుల
కటికిరాపిడికోర్చుట కష్టతరము.

శ్యామదేశంబున జరిగె విప్లవము
తమవృత్తులనువీడి తరలిరి ప్రజలు;
విద్యావివేకంబు వెలయుట కతన
పడుచు రైతులు మంత్రిపదవులంగొనిరి;
మున్నటి మంత్రుల మురిపెంపు సుతులు
తెలివితేటలులేని దేబెలౌకతన
ఇంటింట బిచ్చంబునెత్తి జీవింత్రు.

# 3

రాజకుమారునికి విద్య నేర్పుటకై యొక విద్వాంసుడు నియమింపబడెను. ఆ పండితుడు రాజకుమారుడన్న గౌరవమైన చూపక వానిని కఠినముగ దండించుచుండెను. అంతట నొకనాడు బాలుడీ దారుణ శిక్షనోర్చుకొనలేక చొక్కాయి నూడబెరికి నొప్పిపుట్టుచున్న తన శరీరమును తండ్రికిచూపి మొరపెట్టెను.

అంతట తండ్రి కోపోద్రిక్తచిత్తుడయి ఉపాధ్యాయుని రావించి యిట్లనియెను. "నా కుమారుని ఇంత దారుణముగ దండించునట్లు సామాన్యులగు రైతు బిడ్డలనైన దండింపవు. కారణమేమి?" "ఏలయన, ఆలోచించి మాటలాడుటయు పదుగురు మెచ్చునట్లు ప్రవర్తించుటయు సర్వజనసామాన్యమునకు తగవై యున్నది; అందుముఖ్యముగ పాదుపాలకు ఆవశ్యకము. వారు ఏకార్యము చేసినను ఏమాట మాటాడినను ఏదోయొక విధముగ లోకమున వ్యాపించును. సామాన్యుల చేతలకు మాటలకు అంత వెల్లడి యుండదు.

ధరను సిరుపేదకొకనూరు తప్పులున్న
నందునొకటియు నెరుగబోరతనినఖిలు,
రాజుపాతబడి యొక యకార్యంబుసేయ
దిక్కుదిక్కులనదియు బ్రతిధ్వనించు;

కావున ఉపాధ్యాయుడు సామాన్యజనుల బిడ్డల శిక్షణము కంటె రాజకుమారుల నీతిప్రవర్తనములు శిక్షించుటయందు ఎక్కువ శ్రద్ధపూనుట ఆవశ్యకము.

పసితనంబున సద్వృత్తి పట్టువడిన
బెద్దతనమున భాగ్యంబు వీడకుండు;
పచ్చికట్టె గోరినయట్లు వంచవచ్చు.
ఆరినను నిప్పుచూపక యలవిగాదు.

ఆ పండితుని ప్రత్యుత్తరములోని సమంజసమైన విశదీకరణమున రాజు సమ్మతించి అతనికి గౌరవసూచకమగు అంగీని ధనమును బహుమతిచేసి పదవిని హెచ్చుచేయించి పంపెను.

# 4

పడమటిదేశమున నొక యుపాధ్యాయుని చూచితిని. ఆతని మొగమెప్పుడును మటమటలాడు చుండును. మాట కటువు. దుఃస్వభావుడు. ప్రజల పీడించువాడు. మితిమీర తిని త్రావెడువాడు. ఆతని గాంచినంతనే ముసల్మానుల సంతోషము నశించును. అతడు ఖురాను పఠించువిధము మానవ హృదయమును శోకాంధకారమున ముంచును. ముద్దులొలుకు బాలబాలికలు ఆతని క్రౌర్యమునకు లొంగి నవ్వుటకు శక్తిగాని మాటలాడుటకు చనవుగాని లేకయుండిరి. ఒకతూరి యొకనిపాలబుగ్గలపై లెంపకాయలు వేయును. మరొకసారి యింకొకని స్ఫటికమువంటి కాళులను చిరుత అలో చొనిపి యొత్తును.

తుదకు ఆ యుపాధ్యాయుని దుష్టస్వభావమునందు లేశమాత్రము పిల్లల తల్లిదండ్రులకు తెలియవచ్చి ఆతని బాగు,,॰ మర్దించి యూరు వెడలగొట్టిరి.

అంతట ఆ పాఠశాల నొకసజ్జనునికి అప్పగించిరి. అతడు సత్స్వభావము గలవాడు. తత్త్వవేత్త. ఆవశ్యకమైననే తప్ప మాట లాడడు. ఎవ్వరినైన నొప్పించునట్లు మాటాడుటను ఆతని నాలుకయాడదు. మొదటి యుపాధ్యాయునివలన బాలురకు కలిగినభయము బొత్తిగ నశించినది. రెండవ యయ్యవారి కారుణ్యము గుర్తెరిగి యొక్కొక విద్యార్థియు నొక్కొక దయ్యముగ పరిణమించెను.

ఆతని మెత్తందనమువలన బడిపిల్లలు చదువుసంధ్యలు మాని వీలైనపుడెల్ల ఆటపాటల ప్రొద్దుపుచ్చుచు, వ్రాత పూర్తికాక పూర్వమే పలకలను ఒకరితలపైననొకరు పగులగొట్టుకొనుచు రచ్చారావడి చేయుచుండిరి.

గురువుమెత్తనయైన గొంకుజంకెడలి
బాలురు వీథి గోలీల నాడెదరు.

రెండువారములు గడచినవెనుక నేనా మసీదునకు పోయినయప్పుడు మరల నచ్చట మొదటి యుపాధ్యాయుని చూచితిని. బడిపిల్లల తండ్రులు ఆతనినెట్లో సంతోషపెట్టి తీసుకొనివచ్చి మరల నుపాధ్యాయపదవి నొసంగిరి. ఇందుకు నేను నొచ్చుకొని యిట్లంటిని: "ఈ సైతానును దేవదూతలకు చదువు చెప్పుటకేల నియమించిరి."

లోకమెరింగిన యొకవృద్ధుడు నా మాటలువిని నవ్వుచు నిట్లనియెను:

పాదుషాహి కుమారుని బడికిబంపె
వెండి పలక వాని మెడకు వ్రేలగట్టి;
"నాన్న దయకన్న గురువుదండనము మేలు"
అనెడు పలుకందు స్వర్ణాక్షరాంకితంబు.

## 5

ఒక పుణ్యాత్ముని కుమారునికి మితిమీరిన ద్రవ్యము పినతండ్రి మూలమున చేపడెను. అతడు ముండలముతాకోరయి హద్దు మీరి చరించుచుండెను. అతడొనరింపని పాప కార్యములుగాని, రుచి చూడని లాహిరివస్తువులుగాని లేవని చెప్పవచ్చును. ఒకతూరి యిట్లు హితముబోధించితిని: "కుమారా, ఆదాయము పారుచున్న నీరమువంటిది. వ్యయము తిరుగుచున్న తిరుగలిరాయివంటిది. అనగా నమ్మకమైన రాబడియున్నవాడె యెక్కువగ వెచ్చించుట వలన ఆపదనొందడు."

నీకుదగనైన రాబడి లేకయున్న
నొడలెరుంగక వెచ్చింప నిడుమలొదవు;
కొండపట్టుల వర్షంబు గురియకున్న
నింకు 'దిజ్లా' జలంబొక్క యేటియందె.

తెలివి తెచ్చుకొని మంచినడవడిక యలవరచుకొనుము. ఆట పాటల కొంటెతనము వదలుము. నీ యాస్తియడుగంటి నపుడు కష్టములపాలయి అనుతాపము నొందెదవు." నా మాటలు భోగలాలసుడైన ఆ యువకుని చెవినిదూరక హితమును తిరస్కరించుచు నిట్లనియెను: "క్షణికమైన నేటి

సంతోషమును మరణానంతర కష్టభావనచే అనను భోగ్యము గావించుకొనుట ప్రాజ్ఞసమ్మతముగాదు.

భాగ్యవంతులు భోగేచ్ఛపరగువారు
భావి దుఃఖభయంబున వనరనేల?
ప్రాణమిత్రుడ, సంతోషమనఃభవింపు,
వగవకుమునేడె రేపటి వ్యధలుదలచి.

ఔదార్య పట్టభద్రుడనయి దానదీక్షవహించిన నా కీర్తి సర్వజన సన్నుతి పాత్రమయి లోకమున వ్యాపించి యుండ నాకు నీ హితమెట్లు సరిపడును.

జనుల దయజూచి, దాన ధ్వజంబునెత్తి
ధనము నంచులు బిగియింప ధర్మమగునె?
పేరును ప్రతిష్ఠయును బయల్వెడలినంత
దలుపుమూయంగ నెవ్వరి.తరముచెపుమ.

నా హితబోధ నాతడంగీకరింప లేదనియు నా వేడి యూర్పులకు ఆతని చల్లని యినుమూ ఒత్తుడు పడలేదనియు శెరింగి, బుద్ధిచెప్పుట మాని, ఆతని సాంగత్యము వీడి తత్త్వవేత్తల యుపదేశము ననుసరించితిని: "నీ విధి ప్రకారము నీతిబోధించుము. వారు వినరేని నీ దోషము కాదు."

ఎన్నినీతులు ధర్మంబు లెరిగియున్న
విననివానికి జెప్పకు; వేగమతడు
ఆర్యుల హితోక్తి వినవైతి నయ్యో యనుచు
బద్ధుడై నీపదంబుల బడగలండు.

కొంతకాలము గడచిన వెనుక, నేను పూర్వము తలంచినట్లె యాతనికి దుర్దశ తలచూపెను. తన కుట్లబొంతకు పేలికలపై పేలికలువేసి కట్టుకొనుచు అన్నకబళము నకై యిల్లిల్లు తిరుగుచున్న ఆ యువకుని దురవస్థచూచి చింతించితిని. ఇట్టి స్థితిలో ఆతని నిందించి, పుండిని చెలరేపి యుప్పుచల్లుట అమానుషముగనుండును గావున, నాలో నేనిట్లనుకొంటిని :

తుచ్ఛభోగు డదృష్టమత్తుండు తలప
డెపుడు లేమిడిదినములయిక్కటులను;
ఎండకాలంబున ఫలంబు లిచ్చునతన
ఆకురాల్చును జలికాలమందు జెట్లు.

## 6

"నీ బిడ్డలలో నొకనినిగా చూచుకొని వీనికి విద్యాబుద్ధులు నేర్పుము" అని పాదుషా తన కుమారుని ఒకపండితుని కప్పగించెను. ఒక సంవత్సరము ప్రయత్నపూర్వకముగ చదువుచెప్పినను ప్రయోజనము లేకుండెను అయినను పండితుని పుత్రులు శాస్త్రములందు తీక్ష్ణులయిరి

పాదుషా పండితుని తూలనాడి "నీవుచేసిన వాగ్దానమునకు వ్యతిరేకముగ ప్రవర్తించితివి. నీయందుంచిన నమ్మకము వ్యర్థము చేసితివి" అని నిందించెను. అంతట పండితుడిట్లు విన్నవించెను: "దేవరవారిబుద్ధికి గోచరింపని

దేదియులేదు. అందరకు శిక్షణ మేకవిధముగ నుండినది. కాని ప్రకృతులు వేరు."

రాళ్లలో వెండి బంగారు ప్రభవమయ్యు
అవి లభించునె ప్రతిరాతియందు మనకు?
స్వాతిచినుకులు పలుచోట్లబడియు శుక్తి
గర్భమునయందె ముత్యమావిర్భవించు

# 7

ఒక వృద్ధాచార్యుడు శిష్యునితో నిట్లు చెప్పుచుండ వింటిని: మానవుడు దినబత్తెముపై ఆధారపడియుండునటులు దేవునిపై నాధార పడియుండునేని అతడు దేవదూతలకంటె ఉన్నత పదము నలంకరించును.

మాతృగర్భంబున మతిలేని విత్తువై
పడినయప్పుడు నిన్ను విడువలేదు;
ఆత్మప్రసాదించె; నతులస్వభావంబు
గ్రహణశక్తియు, బుద్ధిగరిమనిచ్చె;
ఒడలికట్టడ, యుంగు, నడుము, నాలె, మెడంద
తలపు, వివేకంబు ధైర్యమొసగె;
రెండు భుజంబుల రెండు బాహులగూర్చె
రెండుచేతుల బదిప్రేళ్ళ నదికె;

ఇట్టి కరుణామయుండగు నీశ్వరుండు
అఖిలజీవుల కాధారమైనవాడు
నీదు దినబత్తెమును నేల నేడుమరచు
నోయి యవివేకచిత్తుడా, యూహసల్పు.

# 8

ఒక యరబ్బి తన కుమారునికిట్లు చెప్పుచుండ వింటిని; "ఈ జీవితమున నీవేమి సత్కార్యము లొనర్చితివని అంత్య దినమున నిన్నడుగుదురుగాని నీతల్లిదండ్రులెవరని ప్రశ్నింపరు."

పావనంబైన 'కాబా'కు బైనిగప్పు
పట్టుపుట్టము సత్కీర్తి, పట్టుపురుగు
వల వచ్చుటగాదు; తాభవ్యమిత్రు
సంగతిని గొన్నినాళ్ళుంట సమతగాంచె.

# 9

తత్త్వవేత్తల గ్రంథములందిట్లు చెప్పబడియున్నది: "తేలు ఇతర జంతువులవలె పుట్టక తల్లిప్రేవులను భక్షించి పొట్టను చీల్చుకొని బయలువెడలి యెడారి దారిపట్టును. తేలుబొరియలలోనున్న చర్మములే యందుకు నిదర్శనము.

ఒకప్పుడు ఈవిచిత్ర విషయమును ఒక పెద్దమనుష్యునికి చెప్పితిని. ఆతడిట్లనియెను: "ఈవాక్యములోని సత్యమును నిరూపించుటకు నాహృదయమే సాక్ష్యము. ఇంతకన్న వేరు విధముగనుండదు. బాల్యమున తల్లిదండ్రులయెడ నెట్లు ప్రవర్తింతురో అట్లే పెద్దతనమున వారంగీకరింపబడుదురు."

ఇట్టి నీతిని మరవకు మెప్పుడనుచు
మరణదశబల్కె తండ్రి యాత్మజునితోడ;

బంధుమిత్రుల నమ్మని పామరుండు
పండితుల స్నేహదృష్టికి బాహ్యుడగును.

"చలికాలమున నీవేల బయటికిరావు" అని తేలు నడిగిరి. "ఎండకాలమున నేనేమి కీర్తిని గడించితినిగనుక చలికాలమునగూడ బయటికి రావలయును," అని అది జవాబు చెప్పెను.

# 10

ఒక దరిబేసి భార్య గర్భవతిగనుండెను. నెలలునిండి కాన్పు సమయము దాపురించెను. దరిబేసికి తన జీవితమునం దెప్పుడును కొడుకు పుట్టియుండలేదు. కావున ఆతడిట్లని యెను: "సర్వశక్తి సంపన్నుడగు భగవంతుడు నాకొక కుమారుని ప్రసాదించుకేని నాయొడలిమీది కట్టబొంత తప్ప మిగిలియున్న నాసర్వస్వమును బీదలకు దానముచేయుదును."

దైవవశమున ఆతనికి కుమారుడు జన్మించెను. అంతట ఆతడు వాగ్దాన ప్రకారము దరిబేసులకు విందుచేసెను. కొన్ని సంవత్సరములు కడచిన వెనుక నేను శ్యామ దేశయాత్రనుండి తిరిగివచ్చి ఆ నా స్నేహితుడు కాపురముండిన యూరు చేరితిని. ఆతని స్థితిగతులను గురించి విచారింపగా వారిట్లు చెప్పిరి: "ఆయన జిల్లా జైలులో బంధింపబడి యున్నాడు."

"కారణమేమి?"

"ఆతని కుమారుడు సారాయిత్రాగి కొట్లాడి యొకని ప్రాణముతీసి కాలికి బుద్ధిచెప్పెను. ఆ కారణముచేత (మరల కుమారుడు వచ్చువరకు) ఆతని మెడకు గొలుసును, కాళ్ళకు సంకెళ్లను తగిలించి బధించియున్నారు."

"ఈ దురవస్థ దేవుని ప్రార్థించి తానే తెచ్చుకొనెను" అని నే నంటిని.

"గర్భవతియైన గృహిణి ముష్కరులు దుష్టు
లైన పుత్రుల ప్రసవించునంతకంటె
గరము మేలగు బాముల గాంచునేని"
యనెడు పెద్దల నీతివాక్యంబు వినుము.

## 11

నేను బాలుడనుగా నుండినపుడు "యుక్తవయస్సు వచ్చినదని తెలుసుకొనుటకు గుర్తులేవి?" అని యొక పెద్ద వాని నడిగితిని. ఆతడిట్లనియెను: మూడు గుర్తులుగలవని శాస్త్రప్రమాణములు గలవు. మొదటిది: పదునైదు సంవత్సరముల ప్రాయము. రెండవది: స్వప్నస్ఖలన ప్రారంభము. మూడవది: బాలతృణావిర్భావము. వీని యన్నింటికంటె నిజమైన గుర్తు మరియొకటి కలదు. అదియేదన, ఇంద్రియ చాపల్యబంధమున చిక్కుటకంటె, మున్నటికన్న మిన్నగా దేవదేవుని సంతోషపరచుటయందె మనస్సు లగ్నమైయుండుట. ఈయొక్క గుణము లేనియెడల యుక్తవయస్సు వచ్చినదని మతవిశ్వాసముగలవారు తలంపరు."

సద్వ్యరేతస్సు నలువది నాళ్ళవరకు
గర్భమునసుండి పిండంబు కరువుగట్టు;
నలువదేండ్లకు సద్వ్ర్తనంబు తెలివి
లేని మూఢుని నరుడనలేము మనము.

మనుజుండు కేవల మాంసపిండంబు
భౌతిక ప్రతిమయంగా భావంబు విడుము;
దయయు దాక్షిణ్యంబు దాతృత్వమగును
మానవత్వమునకు మహిత చిహ్నములు;
సద్గుణసంపత్తి సతతంబు వలయు;
చిలుమద్దళము మసి సింధూరములను
గూర్చి, వ్రాయును శిల్పి గోడపైబొమ్మ;
గుణములులేకున్న గోడబొమ్మకును
నరునకు భేదంబు నరయంగరాదు;
లోకంబు బలిమిమై లోగొనుకంటె
నిన్ను యత్నంబున నీవె లోగొనుము.

# 12

ఒక సంవత్సరమున మక్కా-యాత్రికులమధ్య వివాదముప్పతిల్లినది. నేనుకూడ ఆ యాత్రయందొక బాటసారిగనుంటిని. ఒకరిపై నొకరు తలపడి హీనమానము లడిగి కొంటిమి.

ఒంటె యంబారితొట్లు గూర్చుండియున్న యొక పెద్ద మనుష్యుడు ప్రక్క-తొట్టెలోనున్న వానితో నిట్లనుచుండ వింటిని: "చదరంగమను ఎడారి కొసకెక్కిన దంతపు పియాదరాణి యామెను. అనగా, మున్నటికన్న పదవి

హెచ్చెను. మక్కాయాత్రసేయు పియాదాలు (బాటసారులు) ఎడారికోసకెక్కి పదభ్రష్టులగుట చిత్రముగదా!"

యాత్రికులబట్టి బాధించు నధమపథిక,
నీవు హాజీవిగా; వెంట నిక్కమైన
హాజియనవచ్చు; నేలన, నాకలెత్త
ముండ్లజెముడునుమేయును, మోతమోయు.

## 13

ఒక హిందువు (హిందూదేశస్థుడు) బాణసంచులు ఎగురవేయుట నేర్పించుచుండెను. ఒక ప్రాజ్ఞుడుచూచి యిట్లనియెను: "పూరియింటిలోనుండు నీకు ఇట్టియాట తగదు."

నరియని నీబుద్ధి స్ఫురియించుదాక
మాటలాడకు మెట్టి మాటలనైన;
ప్రతికూలపు జవాబు రానున్న దెలిసి
ప్రశ్నింపకుము; దానబరువు నశించు.

## 14

పామరుడొకడు కంటిజబ్బుతో బాధపడుచుండెను. ఆతడు గుఱ్ఱపు వైద్యునియొద్దకుబోయి "కంటికి మందు వేయుము" అని యడిగెను. ఆ వైద్యుడు నాలుగు కాళ్ళ జంతువుల కన్నులకు వేయు కాటుకను వాని కన్నులకు చరిమెను. కన్నులు గుడ్డుగారిపోయినవి. అంతట వాడు

న్యాయాధిపతి యొద్దకుపోయి తన దుఃస్థితిని గురించి మొర పెట్టుకొనెను. న్యాయాధిపతి వానిని యిట్లు ఓదార్చెను: "ఆతని దేమియు తప్పు లేదు. నీవు గాడిదవు కాకుండిన యెడల గుర్రపు వైద్యుని యొద్దకు పోయియుండవు."

ఈ కథలోని నీతి యేమనగా, ఎవ్వడైనను గొప్ప కార్యములందు అనుభవ జ్ఞానము లేనివానిని నియమించునేని తుదకు ఆతడు పశ్చాత్తాపపడుటయే గాక, ప్రాజ్ఞులట్టి వానిని లఘుచిత్తుడని తలంతురు.

జ్ఞానవంతుడు ముఖ్యమౌ కార్యములను
వదలిపెట్టును కొరగానివానిచేత;
నేతగాడయ్యు జాపల నేయువాని
పట్టుపనిశాల ముగ్గాన బెట్టబోరు.

# 15

పెద్దగురువులవారి పుత్రుడు మరణించెను. "ఆయన గోరీరాతిపై నేమి వ్రాయమనియెదరు?" అని యడిగిరి. "ఖురాను శ్రీసూక్తులు గౌరవయుక్తములుగావున ఇటువంటి చోటుల వ్రాయదగదు. ఏలన, కాలక్రమమున అక్షరములు మాసిపోవును. జనులు త్రొక్కుదురు. కుక్కలు మూత్రవిసర్జనము చేయును. ఏదైన నొకటి వ్రాయవలసిన యవసరమున్న యెడల ఈ పద్యము చాలును."

పచ్చికలు నాకలంబులు పట్టెదోట;
ఎంతయానంద మొదవెడు హృదయమునకు !

విరులకారు వచ్చెడుదాక వేచియుండు,
పచ్చగిల్లును నా మిట్టి ప్రాణమిత్ర.

## 16

భాగ్యవంతుడొకడు బానిసను కాలుసేతులు బంధించి దండించుచున్నపుడు పుణ్యాత్ముడొకడు ఆ దారిని పోవుచు నిట్లనియెను: "సర్వశక్తి సంపన్నుడగు దేవుడు, నీవంటి మానవుని, నీ యాజ్ఞకు లోంగియుండు నట్లొనరించి, ఆతని కంటెను నీకు శ్రేష్ఠత్వము ప్రసాదించెను. ఇందుకై దేవునికి నీవు కృతజ్ఞుడవై యుండుము. ఆ బానిస నిట్లు దారుణముగ శిక్షించుట సమ్మతముగాదు. ఏలయన అంత్యదినమున వాడు నీకన్న శ్రేష్ఠుడుగను, నీవు వానినిచూచి సిగ్గుపడి తలవంచుకొనవలసిన వాడవుగను తటస్థించుచు."

బానిసపై గోపపడకు మెక్కుడుగ,
తంపానగోయకు, నొంపకు మెడద;
పదిదేరములకు నవ్వానివిల్చితివి;
నీశక్తిచేవాని నిర్మింపలేదు;
ఇట్టినీ కరినాజ్ఞ యెందాకసాగు?
నీకంటెమించిన నృపుడుగలండు,
బానిసలకు నీవు ప్రభువువైయున్న
ప్రభువు నీకుండుట భావింపుమోయి!

పూజ్యుడైన మహామద్ ప్రవక్త యిట్లు శెల విచ్చెను: "అంత్యదినమున విశ్వాసపాత్రుడగు మంచి బానిస

స్వర్గమునకు కొనిపోబడుటయు దుర్వినీతుడగు నొడయడు నరకమున ద్రోయబడుటయు శోచనీయము.”

అడ్డుచెప్పక సేవించునట్టి దాను
హద్దుమీరి కోపించుట యర్హమగునె?
కడపినంబున బాసిన విడుపుగాంచ
స్వామి నంకెళ్లబడుట విచారకరము.

# 17

ఒకానొక సంవత్సరమున శ్యామదేశస్థులతో కలసి బల్ఖపట్టణమునుండి పయనించితిని. దోపిడిగాండ్రవలన దారి అపాయకరముగ నుండెను. ఒక యువకుడు దారితోడుగ మాతోడ వచ్చుచుండెను. అతడు బాణప్రయోగమునందు దక్షుడు. ఆయుధముల నుపయోగించుటయందు నేర్పరి. అతడెంత బలవంతుడనగా, దిట్టలైన పదుగురు మనుష్యులు ఆతని వింటిని ఎక్కుపెట్ట లేకుండిరి. దేశములోని యెట్టి మల్లురైనను ఆతనితో పెనగి నేలపై పడద్రోయ లేకుండిరి.

అయినను, అతడు భాగ్యవంతుడు; నీడపట్టున పెరిగినవాడు. యాత్రలు కష్టములు ఎరిగినవాడు కాడు. శౌర్యము పురికొల్పు యుద్ధభేరీ గర్జనములు వాని చెవులలో గింగురుమన లేదు. అశ్వికభటుల ఖడ్గములు తళతళ శంపాద్యుతులు ఆతని కన్నుల మిరుమిట్లు కొల్ప లేదు.

పరులచేతుల బట్టుపడియుండ లేదు,
వాని చుట్టును బాణవర్షంబు పడదు.

నేనును ఆ యువకుడును ప్రక్క ప్రక్కన పరుగెత్తుచుండుట తటస్థించెను. దారిలో ప్రాతగోడ లెక్కడ కనబడినను ఆతడు బాహుబలమున వానిని విరుగద్రోయుచుండెను. ఆతని కంటికగపడిన ప్రతిచెట్టును పెకలించుచు నిట్లు జంబాలుకొట్టెను:

వీరుని భుజశక్తి గోరు కరియేది?
తరుణుని పంజాకు దాళు హరియేది?

మేమీ స్థితిలోనుండగా, ఇద్దరుదొంగలు రాతిబండ వెనుకనుండి తలవెడలబెట్టి మమ్ము వధించుటకు ఆలోచించుచుండిరి. ఒకని చేత లాటీకర్రయు మరియొకని చంకలో కొయ్యసమ్మెటయు నుండెను.

"విరోధులు వచ్చిరి. నీ వేల యూరక నిల్చితివి?" అని యువకుని హెచ్చరించితిని.

బలశౌర్యములు నీకు గలయంతచూపు
వైరి నీచేజావ వచ్చియున్నాడు.

నేను చూచునప్పటికి, యువకుని మోకాళ్లు మోచేతులు గడగడ వడకుచుండినవి. చేతినుండి విల్లునంబులు జారిపడినవి.

బొందఁళముదూయు బాణంపుమొనను నేతక
జీల్చు ప్రతివాదు, యుద్ధంబు చేపడంగ,
నెనసిమొనసిన వీరుల కెదురునిల్చి
పోరగల్గునె వెన్నిచ్చి పారిపోక!

వే రుపాయము లేనందున మా మూటాముల్లెలు ఆయుధములు కట్టుపుట్టములు ఆ దొంగలకు సమర్పించి యెట్టులనో ప్రాణములతో తప్పించుకొని బయటబడితిమి.

గర్జించి దిగ్భ్రమింగ గడగు సింహమునైన
నుచ్చులబంధించు సుదుటుగల్గు
కార్యజ్ఞుడును శక్తిగలయట్టి మనుజుని
అతిముఖ్యకార్యములందు బనుపు;
కడుబాహు బలమున్న గజశరీరంబున్న,
యుద్ధభూమినినిల్వ యుపకునికిని
జడుపుతవడకెను సంధిబంధంబులు,
బంకచెమ్మటమేన బట్టిదొరగె;

స్మృతులగల గూఢసూక్ష్మంబు లెత్తిచెప్ప
ధర్మశాస్త్రప్రవీణులే తగిన యట్టు,
లనుభవజ్ఞులె సంగరమందునిలిచి
వైరినెదిరించి పోరంగవలతువెపుడు.

# 18

భాగ్యవంతుని కుమారుడొకడు తన తండ్రి గోరీ ముందు కూర్చుండి యొక బీదవానికొడుకుతో వాదించుచుండ నేను చూచితిని:

ధనికుని కుమారుడు: మా తండ్రిగోరి తెల్లరాతితో కట్టబడియున్నది. అక్షరములు రంగులతో వ్రాయబడి యున్నవి. క్రింద చలువరాతి పలకలు పరువబడి, యందందు పచ్చలయిటికలు పొదుగబడియున్నవి. మీ తండ్రిగోరి

యెట్లున్నది ? — ఒక యిటికిరాయిపెట్టి రెండు పిడికెళ్ల మట్టి చల్లబడియున్నది !

బీదవానికొడుకు : మీ తండ్రి యీ బరువైన రాళ్ల క్రిందబడి తన్నుకలాడి తప్పించుకొని బయటబడుటకుముందే మాతండ్రి స్వర్గముచేరియుండును.

బరువు కొద్దిగ వేయబడినగార్దభము
చల్లగా దశలు నిస్పందేహముగను.

వస్తులయిక్కట్లు పడుదరిద్రుండు
మరణయాత్రకు కొద్దిబరువుతో దరలు;
భోగభాగ్యంబుల భూరిసౌఖ్యముల
బెరిగినమనుజుండు మరణించునపుడు
వానివిడలేక వనటపాల్పడును;
చెరసాల విడుపుగాంచిన యట్టిఖైదీ,
సంకెళ్ళబడిన పాచ్చాకంటె మిగుల
నానందమునుబొందు ననియెంచుకొమ్ము.

# 19

“నీయం దిరవు గొనియున్న యింద్రియతృష్ణయే నీకు బలవత్తమవిరోధి” అను హదీసులోని యీసూక్తి భావమేమని నేనొక పెద్దనడిగితిని. “నీవు మంచిచేసి స్నేహముతో వర్తింతువేని ఎట్టి విరోధియు మిత్రుడగును. కాని యింద్రియతృష్ణ అట్టిదికాదు. దానిని మన్నించుకొలది విషమించి యెదురుతిరుగును.” అని ఆయన వివరించెను.

మితభుక్తిచేకూర్చు మేలైన ప్రకృతి;
జంతువువలెదిన్న జడిమనొందెదవు;
ఇతరులకోర్కెల నీడేర్చినంత
వారునీయిష్టాను వర్తులైయుంద్రు;
ఇంద్రియోద్ధత తృష్ణ యిట్టిదిగాదు,
దానికోర్కెలుదీర్ప దలపైకినెక్కు.

# 20

కలిమి లేములను గురించి సాదీకిని ఆతని ప్రతిపక్షు నకును జరిగిన వాద ప్రతివాదములు.

బయటికి దరిద్రేసివలె నగపడినను దరిద్రేసుల సద్గుణ ములు లేని యొకడు, గోష్ఠియందు కూర్చుండియుండ నేను చూచితిని. ఆతడు భాగ్యవంతులను నిందించుచు వారి యక్రమములను తూర్పారబట్టుచు తన చెడ్డతనమును ప్రక టించుచుండెను. ఆతనిమాటలు "సిరుపేదలకు శక్తి లేదు, భాగ్యవంతులకు ఇచ్చ లేదు," అనునంతవరకు వచ్చినవి.

దయగల్గువానికి ధనము శూన్యంబు
ధనమున్నవారికి దయ బండినున్న.

నేను గొప్పవారి ద్రవ్యముతో పోషింపబడిన వాడను గాన, అతనిమాటలు కర్ణకఠోరములయి నన్ను బాధింప నిట్లంటిని: "ఓయి మిత్రుడా, భాగ్యవంతుడు బీదలరాబడికి మూలము. యతులకు సన్న్యాసులకు ధాన్యపుపాతర. అభ్యాగతులకు ఆశావలంబనము. బాటసారులకు ఆశ్ర

యము. ధనికులు ఇతరులకు సంతోషము చేకూర్చుటకు తాము భారమువహింతురు. సేవకులును దీనులును అన్నము ముట్టనిదే వారు భుజింపరు. వారి భుక్త శేషములగు భక్ష్య భోజ్యములు అనాధలకు ముదుసలులకు ఆశ్రితులకు ఇరుగు పొరుగువారికి పంచిపెట్టబడును.

విత్తవంతులు ధర్మకార్యములకు శాశ్వతాదాయము వచ్చు దానములు చేయుదురు. మ్రొక్కుబడుల చెల్లింతురు. అతిధులను సత్కరింతురు. భిక్షము పెట్టుదురు. పస్తున్న వాని యాకటిమంట దీర్తురు. ఖైదీలను బంధవిముక్తుల గావింతురు. జంతుబలులతో దేవుని తృప్తిపరతురు. అట్టివారి ప్రాభవము నీకెట్లు లభ్యమగును? దినమునకు రెండుమారులు నమాజుచేయుటతప్ప నీ వేమియు నొనర్ప లేవు. దానికిని నూరు గండములు.

ధనవంతులకు మంచిసేయు శక్తిగలదు. వారి ప్రార్థనములను భగవంతు డంగీకరించును. ఏలయన, వారిధనము దానములకు వినియోగ పడును. వారికీర్తి నిష్కళంకము; హృదయము శాంతము. కష్టాని భోజనముపై భక్తి బలమాధారపడి యుండును. పుణ్యశీలత పరిశుభ్రమైన యుడుపుల వల నకలగును. పస్తుపడి కడుపువెన్నె ముక కంటుకొని యున్నవానికి స్థిరమైన భక్తి యెట్లుకుదురును? రిక్తహస్తునకు ఎట్టి మానుషత్వముండును? బద్ధపాదు డెట్లు విహరింపగలడు? ఆకలిగొన్నవాడు ఏమిమంచి చేయగలడు?

రేపటికి దిండిలేని దరిద్రుడెపుడు
కలత చెందని నిద్దుర గనడు రాత్రి;
సీతు కారున సుఖియింప చీమ లెరను
గొరత లేకుండ వేనవి గూడబెట్టు.

విశ్రాంతికిని దినపస్తులకును పొత్తుకుదురదు. చిత్త శాంతికిని రిక్తహస్తతకును సంబంధముపొసగదు. శాంత హృదయుడు సాయంకాలము నమాజుకు కూర్చుండ, ఆకలి గొన్నవాడు మాపటి పూట అన్నమునకై నిరీక్షించుచు కూరుచుండును. ఎప్పటికైన వీరిద్దరకు ఏమి పోలికయుండును ?

దేవతత్పరుడౌను దినమున్నవాడు ?
బత్తెము లేకున్న జిత్తమల్లాడు.

భాగ్యవంతుల పూజాపురస్కారములు దేవునకంగీకార పాత్రములగును. ఏలయన, వారిహృదయము వేదనా చలితముగాక, శాంతముగను, ఏకాగ్రముగను ఉండును. జీవయాత్ర సుఖముగ గడపుటకు తగిన సౌకర్యములు సిద్ధమైయున్నవిగాన, ప్రతిదినము వారు పూజలందు నిమగ్నులు కాగలరు. ఒక యరబ్బి యిట్లు చెప్పెను: "నిర్భర దారిద్ర్యము నుండియు, నేనిష్టపడని వాని సహవాసము నుండియు భగవంతుడు నన్ను రక్షించుగాక!"

"ఇహపరముల యందును దారిద్ర్యము నింద్యము" అను శ్రీసూక్తి 'ఖబరు' నందుకలదు. ఈమాటలువిని నా

ప్రతివాది యిట్లనియెను : "ఈసూక్తినే నీవువింటివిగాని "దారిద్ర్యమే నాకు యశస్కరము" అను మహమ్మదుప్రవక్త వచనమును నీవు మరచితివి.

వాది :— ఊరకొండుము. సుఖదుఃఖముల నేకరీతిగ ప్రవర్తించుచు విధి బాణములకు గురియైన దైవతత్పరుల దారిద్ర్యమును గురించి మహమ్మదు ప్రవక్త అట్లు సెలవిచ్చెనుగాని, ధర్మ కబళము సంపాదించుకొనుటకు పవిత్రమైన కుట్లబొంతను దొడుగుకొని, నీచ జీవనము చేయు వేషధారులకు ఆసూక్తి యన్వయింపదు.

> పెద్దపెద్దగనినదించు భేరి, నీదు
> పటిమ యెందాక, శూన్యగర్భంబవీవు!
> దారిజత్తెంబులేక నీతాత తవమె
> యుద్ధ యాత్రల గష్టాల కోర్చి మోగ?
> మనుజుండవైతేని మాను యాచనము,
> వేయిపూనలమాల ప్రేళ్ళద్రిప్పకుము

గాఢమైన మతవిశ్వాసములేని దరిద్రస్థితి లేమిడి అతని పతితుని చేయునంతవరకు వదలదు. నిరుపేదయైనవాడు మతభ్రష్టుడగును. ద్రవ్యముండిననే తప్ప దిగంబరులకు కప్పడముల నిచ్చుటకును, బద్ధులైనవాని చెర విడిపించుటకును సాధ్యముకాదు. మనబోటి నిరుపేదలకు అట్టిధనికుల యౌన్నత్యమెట్లు కలుగును? ఇచ్చునప్పుడు మీదైన యుదారహస్తమునకును, తీసుకొనునప్పుడు క్రిందైన దీనహస్తమునకును ఏమి సంబంధము గలదు! "ఈ తెగవారికి,

అనగా యథార్థమైన ముసల్మానులకు దినబత్తె మేర్పాటు కాబడియున్నది. ” అని పవిత్రమైన ఖురానునందు సర్వో న్నతుడైన భగవంతుడు స్వర్గవాసుల భోగములను గురించి సెలవిచ్చియున్నాడు.

దగగొన్నవానికి నగపట్టు, గలను;
జగమెల్లసెలయూట బొగడ చందమున.

నేనిట్లు వచించినంతనే ఆదరిబేసికి ఓర్పుసడలి, నోటికి అడ్డము ఆపు లేక, సిగ్గువిడిచి యిట్లుపదరెను.

ప్రతివాది:— నీవు మితిమీర అత్యుక్తులతో ధనవం తులను పొగడుటయు, మనసు నొచ్చునట్లు మాటాడు టయు చూడ, ప్రతి ధనికుడును దారిద్ర్యవిషమును హరిం చుటకు సజీవనౌషధమువంటి వాడనియో లేక ధర్మశాల తలుపులు తెరచు తాళముచెవివంటి వాడనియో యూహిం చినట్లున్నది.

ధనవంతులు మదమత్తులు; గర్వితులు; అహంభా వులు;అసహ్యావర్తనులు,ఐహికధనభోగాసక్తులు; సంపద్గౌరవ తృష్ణాతప్తులు; బతిమాలి భంగపడిననేగాని ఇతరులతో మాటలాడరు. అలక్ష్యతిరస్కారదృష్టులతో తప్ప ప్రసన్న వదనులై చూడరు. పండితులను బిచ్చగాండ్రని తలంతురు. ఫకీరులను తలకు మొలకు లేని దరిద్రులని నిందింతురు. గట్టి రొక్కమున్నదన్న కావరముచేతను, ఉన్నత పదస్థులమన్న తలంపుచేతను, అందరకన్న మాదిపైచేయియని యుద్ధతులై

ప్రవర్తింతురు. ఎవరితట్టైన తలయెత్తి చూడవలయునని తలంపరు. "వినయమునందు ఇతరులకంటె తక్కువగను, సంపదలయందు హెచ్చుగను ఉన్నవాడు బయటికి ధనవంతుడుగ నగపడినను యథార్థముగ అతడు దరిద్రుడే" నని తత్త్వవేత్తలు చెప్పినమాటలు వారెరుగరు.

ధనమదంబున మూర్ఖుండు తత్త్వవిదుల
బండితావళి నవమానపరచునేని,
అట్టి నాడంబరాటోపితే యైనగాని
మొరటుగా వాని గాడిదముద్దియనుము.

సాధ:—భాగ్యవంతులను నిందింపకుము. వారు కరుణామయ హృదయులు.

ప్రతివాది:—నీవు అబద్ధము చెప్పుచున్నావు. వారు రూపాయలకు దాసులు. ధనికులు శ్రావణ నీలమేఘములే యగుదురుగాక, వర్షింపకుండిన నేమిలాభము? కాంతిప్రవాహము లయ్యును ఎవరిమీదను ప్రకాశింపకుండిన ప్రయోజనమేమి? సామర్థ్యమను గుర్రముపై నెక్కియు పరుగెత్తింపకున్న నేమిఫలము? వారు దేవుని కొరకైనను అడుగెత్తి యట్లపెట్టరు స్వప్రయోజనము నాశింపక చిల్లిగవ్వయైన నొకరికియ్యరు ఎంతయో శ్రమపడి ద్రవ్యమార్జింతురు. నీచాతినీచముగ దానిని పదిలము చేయుదురు. తుట్టతుదకు బాధపడుచు, విధిలేక, అంతయు వదలిపెట్టి పోయెదరు. "లోభికళేబరము భూమిలోనికి పోయినప్పుడు వాని ద్రవ్యము భూమిలోనుండి పైకి వెడలును," అని పెద్దలు చెప్పియుండిరి.

ఒక్కఁడు నిరతము శ్రమలకు
జిక్కి ప్రయత్నించి నిలువ చేసిననిధి వే
రొక్కఁడు శ్రమ యత్నంబుల
నొక్కటియునులేక దానినూరకగొనియుఁ.

సాది:— భాగ్యవంతుల లోభిత్వమును యాచనా మూలమున తప్ప ఇంకేవిధమున నీవెరిగియుండవు. ఆశాపాశ బద్ధులు కానివారికి కరుణామయులును లోభులును ఒకే విధముగ కనిపింతురు. బంగారు ఏదియైనది యొరపు రాయి కను గొనును. లోభి యెవడైనది బిచ్చగాడు కనుగొనును.

ప్రతివాది:— నేను అనుభవ పూర్వకముగ చెప్పు చున్నాను. భాగ్యవంతులు ద్వారము యొద్ద సేవకులను కాపుదారి యుంతురు. ప్రియస్నేహితుల నైనను రానీయక అడ్డగించుటకు బలిష్ఠకాయులైన మొరకిలను నియోగింతురు. వారు సజ్జనులయు పండితులయు మెడపట్టల నొడిసి పట్టుకొని "ఇచ్చట ఎవ్వరును లేరని" చెప్పుదురు. నిజముగా సత్యమే చెప్పబడినది.

తెలివితేటలు, యోచన, తెంపుదనము
స్వామికిని లేవటన్న భావము ధ్వనింప
"నిటనెవ్వరు లేరు, పొండెచటికైన"
ననుచు యుక్తంబుగా బణిహారిపల్కు.

సాది:— ఏలయన, యాచకుల పీడింపులకును, బిచ్చ గాండ్ర యాచనా లేఖలకును తట్టుకొనలేక ప్రాణమువిసిగి

వారట్లు చేయుచుందురు. ఎడారిలోని యిసుకయంతయు ముత్యములైనను, బిచ్చగాండ్ర కన్నులు నిండునని తలంచుట తెలియని తనము.

నూతులు నిండునె సీతువ
రాతిరి బడు మంచు నీటి వవలు తొరంగన్?
అతత ధన ధాన్యాశా
చేతస్కుల కనులునిండి చెందునె తృప్తిన్?

కష్టపరంపరల ననుభవించి జీవితముపై విసుగుపుట్టిన మనుష్యుడు బుద్ధిపూర్వకముగ ఘోరకృత్యములందు తన్నుతానే పడద్రోసికొనును. భగవంతుని శిక్షకాతడు భయపడడు. "ఇది శాస్త్రసమ్మతమైనది," "అది శాస్త్ర నిషిద్ధమైనది," అను జ్ఞానము వానికుండదు.

కుక్క నొక మంటి పెళ్ళతో గొట్టినంత
నెముక యని నంతసంబున నెగిరి దూకు;
ప్రోల శవపేటి నిరువురు మోయగాంచి
అన్న భాజనమని యెంచు నధముడాన.

అయినను, ధనవంతుడు దైవానుగ్రహమునకు పాత్రుడగుటవలన శాస్త్రసమ్మతి కార్యములనే తలపోయును. అందువలన శాస్త్రనిషిద్ధ కార్యములనుండి రక్షింపబడును. నేను నాపక్షము స్థాపించుకొనుటకు కావలసిన యన్నివాదములను ఉజ్జాయింపుగా సూచించితినేగాని ప్రమాణీకరించి వివరింపలేదు. అయినను మీ న్యాయ నిర్ణయముపై నాధారపడియుండెదను.

మోసగాడు పెడరెక్కలు విరిచి కట్టబడుట, అప్పు చెల్లింపనివాడు చెరసాలబడుట, అమాయకత్వము ముసుగు చింపబడుట, దొంగతనము చేసినందులకు చేయి తెగగొట్టబడుట, మొదలగు ఈదుఃస్థితులకు మూలకారణము దారిద్ర్యమేగదా! అట్లుకానిచో ఎప్పుడైన నీవు చూచియున్నావా? సింహములవంటి మనుష్యులుకూడ, అక్కరవలన ఇండ్లకు కన్నములు వేసి పట్టుబడుదురు. చీలమండలకు నెనుప్రక్క బొందలుపొడిచి వారిని తలక్రిందుగా వ్రేలగట్టుదురు.

ఒకవేళ యొక దరిద్రునికి దుర్దమమైన కామము చెలరేగినపుడు మనస్సును చిక్కబట్టుశక్తి చాలక, పాప కార్యము సల్పుట తటస్థింపవచ్చును..................
సామాన్యముగ నమాయికులయ్యును రిక్తహస్తులగుదురేని క్రమక్రమముగ వారు పాపపంకిల చిత్తులగుదురు. ఆకలి గొన్నవాడు రొట్టెను దొంగిలించును.

క్షుత్పీడితంబైన శునకంబు మాంస
శకలంబు గాంచ, విచారింపబోదు
'సాలహు' నొంటె మాంసంబొ 'దజ్జాలు'
ఖరము మాంసమొ యంచు, క్షణముసేపైన.

ఎందరు పరిశుద్ధ హృదయులు లేమిడిమూలమున దుర్నీతిపరులయి అమూల్యమైన వారికీర్తిని అపయశోమారుతమున తూర్పారబట్టు చున్నారు!

ఇహ భోగ విముఖత యెరియునాటను,
శీలంబు పుణ్యంబు చెడను లేమిడిని.

ధనికులు బీదలను చేరరానీయక తలుపులు మూసుకొందురని యింతకుముందు చెప్పియుంటివి. ఎడారులలో నివసించుచున్న హాతింతాయి పట్టణవాసియయ్యేనేని బిచ్చగాండ్ర యొరపిడికి తట్టుకొనలేక ఉక్కడోపకయుండును. వారు అతని చొక్కాయిని చీలికలు పేలికలుచేసి యొడలినుండి యూడబెరికియుందురు.

హెచ్చరింతు నోయి, యొకరైన నాపంక
జూచినట్లు నన్ను జూచిలేదు;
బిచ్చగాండ్రచూపు టుచ్చుల జిక్కిన
నరుడు కెట్టిమంచి జరుగబోదు.

ప్రతివాది:—వారిదుఃస్థితికి నాకు జాలికలుగుచున్నది.

వాది:— వారి సంపదలపై నీకు అసూయ పుట్టుచున్నది.

మేమిద్దరమిట్లు పరస్పరము వాదించుకొనుచు కాయకు కాయ యెదురొడ్డుచుంటిమి. ఆతడు రాజును తోసి రాజన్న నేను రాణిని అడ్డముపెట్టుచుంటిని. తుదకు ఆతని జతనపుసంచిలోని రొక్కము అడుగంటినది. వాదపుదొనలోని బాణములన్నియు ప్రయోగింపబడినవి.

వాగ్వాదమున నీవు వక్తతోబోర
శస్త్రసన్న్యాసంబు సరికాదు నీకు;
ఎరువు దెచ్చినమాట హరువు డాబులును
అత్యుక్తులును దప్ప నాతడేమెరుగు?
మతశాస్త్రములలోని మర్మముల్దెలిసి,

జ్ఞానంబుకొరలేక కాన్పించుమోయి,
యమకంబు గమకంబు లలరువాయాళి,
ద్వారంబుకడ నాయుఘంబులవెల్వె
కోటలో నొకఖంటుగూడ గన్పడదు.

కడపటికి ఆతనికొక్క వాదముకూడ లేకుండెను. నేనాతనిక్రిందుచేసితిని. ఇందుకాతడు సహింపలేక, దౌర్జన్యము పూని తెలివి తక్కువప్రసంగము చేయనారంభించెను. సాధారణముగ అజ్ఞానుల పద్ధతియిట్టిదియె. వారు ప్రత్యర్థి వాదములకు బదులు చెప్పలేక యోడిపోయినప్పుడు ద్వేషము ప్రకటింతురు విగ్రహాశిల్పియైన 'ఆజరు' కుమారునితో (అబ్రహాము) వాదింపలేక తగవుపెట్టుకొనెను. ఖురానులో నిట్లు చెప్పబడియున్నది: " నీ వీవాదమున కొప్పుకొనని యెడల రాళ్లు రువ్వి నొప్పించెదను."

నన్నాతడు దూషించెను. నేనాతని నిందించితిని. అతడు నా మెడపట్టను ఒడిసిపట్టుకొని చింపివేసెను. నేనాతడి గడ్డముపట్టుకొని తెగగుంజితిని. మేము ఒకరిపై నొకరు తలపడితిమి. ప్రజలు పొట్టలుబ్బ నవ్వుచు, వేడుకచూచుటకు మా వెంట పరుగెత్తుచుండిరి. మా యీ చేష్టల వినికిడి వలన లోకము ఆశ్చర్యముతో ప్రేలు కరచెను.

కడకు మా వివాదమును న్యాయాధిపతికి విన్నవించి ధనికులకును, దరిద్రులకును గల తారతమ్యము న్యాయ్యముగా నిర్ణయింప వలయుననియు ఆ తీర్పునకు మేము బద్ధులమై యుందుమనియు తెల్పితిమి.

న్యాయాధిపతి మా స్థితిగతుల నరసి, మా వాద ప్రతివాదముల విని, తలవంచుకొని, ముందు వెనుక లాలోచించి కొంతసేపైన వెనుక తలయెత్తి నాతట్టుచూచి యిట్లనియెను: "ఓయీ, నీవు భాగ్యవంతులను ప్రశంసించి బీదలను నిష్ఠురముగ మాటాడితివి. గులాబియుండుచోట ముల్లుకూడ నుండుననని తెలిసికొమ్ము. సారాయితోడ మత్తుండును. పెన్నిధియున్నచోట పాముండును. ఆణిముత్యములుండుచోట మనుష్యులను దిగమింగు మకరములు, 'చోర' చేపలుండును ఐహికభోగ మకరందమునకు మృత్యువు కాటు వెన్నంటియుండును. స్వర్గసౌఖ్యములకు ముందు సైతాను గోడవలె నిలిచియుండును.

ఇంపులనెలంత ప్రియుని హింసింపకున్న
నేమిసేయును ప్రత్యర్థి యీను గోను?
ముల్లుపన్నీరుపూవు, నమ్మదముఖేవ,
మహియు బెన్నిధి, యన్యోన్యమనుసరించు.

తోటయందు కస్తూరితుంగలున్నచోట ఎండిన చెట్ల మోడులుండుట నీవు చూచుటలేదా? ధనికులయందు గూడ నట్లే కొందరు కృతజ్ఞులు, కొందరు కృతఘ్నులు నుందురు. అట్లే నిరుపేదలందును సహనముగలవారు, దుడుకు పడువారు నుందురు.

మంచుతుంపురులెల్ల మంచిముత్తెంబు
లైన, గవ్వలయట్టు లంగళ్లనిండు.

దరిద్రేసి స్వభావముగల భాగ్యవంతులు, భాగ్యవంత మైన హృదయముగల దరిద్రేసులు, భగవంతునికి సమీప వర్తులగుదురు. దరిద్రేసుల సుఖదుఃఖములతో సహానుభూతి గలవాడే భాగ్యవంతులలో నుత్తముడు. చాల యరుదుగా భాగ్యవంతుల సాంగత్యము కోరువాడె దరిద్రేసులలో శ్రేష్ఠుడు. దేవునియందు విస్వాసము గలవానికి ఆయన విశ్వ దాత యగును."

అంతట నన్ను మందలించుట చాలించి, దరిద్రేసితట్టు తిరిగి న్యాయాధిపతి యిట్లనియెను "ఓయీ, ధనవంతులు నిషిద్ధకార్యము లొనరించుచుందురనియు భోగమత్తులనియు నిందించితివి. నీవు వివరించినట్టి గుణములుగల సంకల్ప శూన్యులు కృతఘ్నులు వారిలో నున్నారు. వారు సంపాదించి కూడబెట్టుదురు; తామనుభవింపరు; ఇతరులకు పెట్టరు అనావృష్టివలన కరువు వచ్చినను, అతివృష్టి వలన వెల్లువ పెట్టినను తాము క్షేమముగానుందురన్న నమ్మకము చేత దరిద్రేసుల కష్టముల విచారింపరు. దేవునికైనను భయపడరు.

తిండలేకయొక్క దీనుండు మరణింప
"అంతనాకుగలదు, చింతయేల?
బ్రతుకేమి భయము పల్లె వెల్లువపెట్ట"
ననుచు నధమ ధనికు డెపుడుదృప్తి.

ఒంటె యంబారితొట్లలో సుఖముగా కూర్చుండి పయనించువారికి ఎడారి యిసుకలోపడి చచ్చు బాటసారిపై నేమి కనికరము ?

తన చింపి గొంగడిని చ
య్యన బయటికిదెచ్చుకొన్న యధమాత్ముడు లో
ననుకొనును "లోకమెల్లను
మనినను మాడినను నాకుమాత్రము సుఖమౌ."

నీ విప్పుడు వినినట్టి ప్రవర్తనము గలవారు కొంద రున్నారు. కాని మరికొందరు బీదాబిక్కలకు ధనధాన్యములు పంచిపెట్టు కరుణామయ హృదయులు, కీర్తికాములు, క్షమాపరులు, ఇహపరసుఖాసక్తులుకూడ నున్నారు.

సకల సామ్రాజ్య పట్టాభిషిక్తుడు, న్యాయవర్తనుడు, మత విశ్వాసపూర్ణుడు, విజయధ్వజుడు, రాజాధిరాజు, ఇస్లాం మత దుర్గసంరక్షకుడు, సులేమాన్ రాజ్యమునకు వారసు, సమకాలీన నృపులలో న్యాయవంతుడు ముజఫరుద్దీన్ వలద్దీన్ అతబక్ అబుబకర్ బిన్ సాద్ జంగీ (దేవుడాయనకు చిరాయువు నొసగి ఆయన ధ్వజములకు విజయము చేకూర్చు గాక!) వారి దాసులు గూడ భాగ్యవంతులలో పైని చెప్పబడిన యుత్తమ వర్గమునకు చెందినవారు.

కరుణమెయి మీరు ప్రజలను గాచునటుల
దండ్రి బిడ్డల సైతము దనుపలేడు;
సృష్టికర్త యిలకు మేలుసేయు కోర్కి
సకల సామ్రాట్టుగా మిమ్ము నలిపినాడు.

న్యాయాధిపతి యీ విధముగ మా యూహ కతీత మగునట్లు ఉపన్యసింప విని, ఆయన తీర్పును శిరసావహించితిమి. ఇదివరకు జరిగిపోయిన దానికి పరస్పర క్షమార్పణము

వేడుకొని, కలహము మాని, సమాధానము చేసుకొని దోషపరిహారముగ ఒకని పాదములందొకడు తలమోపి, మోములు ముద్దిడుకొని, మా వితర్కమును ఈ పద్యముతో ఉపసంహరించుకొంటిమి.

కటిక నిరుపేద, వసరకు కాలగతికి,
అట్టియూహల మరణించు టార్తికరము;
ధనికుడా, యిచ్ఛాశక్తియు దనరునీకు;
ఇమ్ము, కుడుపుము, గాంచెద విహము పరము.



# అష్టమాధ్యాయము

# సాంఘికధర్మ నిర్వర్తనవిధులు

## 1

ధనము జీవిత సౌకర్యము కొరకేర్పడినది. కాని, జీవితము ధనమును ప్రోగుసేయుటకు కాదు.

"అదృష్టవంతుడెవడు? దురదృష్టవంతుడెవడు?" అని యొక ప్రాజ్ఞుని ప్రశ్నించిరి. "తానను భవించి వెదచల్లు వాడు అదృష్టవంతుడు. తాను చచ్చి మిగిలించువాడు దుర దృష్టవంతుడు." అని ఆయన బదులు చెప్పెను.

జీవితంబెల్ల ధనరాశి చేర్చికూర్చి
తాను గుడువక యొరులకు దానమిడక,
యేమిసేయక చచ్చిన హీనుగూర్చి
దేవదేవుని నీవు ప్రార్థింప వలదు.

## 2

మూసా ప్రవక్త (ఆయన ఆత్మకు శాంతిగలుగు గాక! ఖారూన్ అను కోటీశ్వరునకు "నీకు దేవుడు మేలు చేసినట్లె నీవును ఇతరులకు మేలుచేయుము." అని యుప

దేశించెను. ఆతడు ఆ సలహాను చెవినిపెట్టకయుండెను. వాని యంత్యదశ యెట్లయినదియు మీరు వినియున్నారు కదా.

తన ధనముతోడ మేలుచేయని నరుండు
పతనుఖంబుల బసిడికి బలియొసంగు;
గలిమిగల లాభమునుగాంచ దలతువేని
ప్రజల గరుణింపు, నిను లోకభర్తయట్లు.

"దానము చేయుము. కాని, దాని ప్రతిఫలమును మరల నీవు పొందనుద్దేశించి చేయకుము," అని అరబ్బులు చెప్పుదురు.

పృథ్విపైనెట దానవృక్షంబు వేరునాటు
దాని పొదవును, గొమ్మలు దాకునభము;
తత్ఫలంబును భుజియింప దలతువేని,
కుజము మొదలంట రంపాన గోయబోకు.
తనదయకు నీవు వెలిగాక మనిచిపెట్టి
దేవునికి నీ కృతజ్ఞత దెల్ప మ్రొక్కు;
కలదు సుల్తాను కొలువని గర్వపడకు;
దైవకృపచేతనే యది దక్కెనోయి.

# 3

ఇద్దరు మనుష్యులు నిరర్థక పరిశ్రమయు, లాభము లేని ప్రయత్నమును చేసినవారని చెప్పవచ్చును. మొదటి వాడు, ధనమార్జించి యనుభవింపనివాడు. రెండవవాడు, శాస్త్రములు నేర్చుకొని అభ్యాసములో నుంచనివాడు.

శాస్త్రములు క్రిందిమీదికి జదువనేమి,
వేత్త గాఁజాల డభ్యాస విభుతలేక;
ప్రాజ్ఞుడును మతివిశ్వాస పరుడుగాడు,
పాత్రములుమోయు నాచతుష్పాత్తుగాని.

తాను మోయుచున్న తలమీది భారంబు
కట్టెమోపొ, పుస్తకములకట్టొ,
అని యెఱుంగలేని యపము నిర్మ్మగను
నకును శాస్త్రమేఱ? జ్ఞానమేడ?

## 4

శాస్త్రజ్ఞానము మతాభివృద్ధికొఱ కేర్పడినదిగాని లౌకిక విషయవాంఛ లనుభవింపజేయుటకుగాదు.

మనుజుడెవడు విరక్తిని మహితభక్తి
నాత్మవిజ్ఞానమును వెలకమ్ముకొనునొ,
అట్టినీచుండు పరిపంట గుట్టవెట్టి
యగ్గిరగిలించిన నికృష్టుడగఁజెల్లు.

## 5

వైరాగ్యములేని విద్వాంసుడు కాగడా చేతపట్టుకొనిపోవుచున్న గ్రుడ్డివానివంటివాడు. అతడు ఇతరులకు దారిచూపునేగాని, తాను చూడలేడు.

అప్రయోజకముగా నరిగెజీవితము
కొనినదేదియులేదు; ధనమెల్లదరిగె.

## 6

రాజ్యము వివేకవంతులగు పండితుల మూలమున శోభించును. మతము విరాగులగు సత్పురుషుల మూలమున దోషరహితమగును. పండితులకు పాదుషాల ఆశ్రయము అక్కరమైన దానికంటె పాదుషాలకు పండితుల హితోపదేశము ఆవశ్యకమగును.

ఓయిపాదుష, విను దేవి యొక్క నీతి,
ఇంతకంటెను మేలైనదెందు లేదు;
పనులయందు నియోగించు పండితులను,
కనగ, వారలపని యదిగాకయున్న.

## 7

మూడువస్తువులు మూడింటితోగూడనిదే చిరకాల ముండవు: వాణిజ్యముతో గూడని ధనము, వాదప్రతివాదములతోగూడని శాస్త్రజ్ఞానము, దండనీతితోగూడని రాజ్యము.

## 8

చెడ్డవారిని కరుణించుట, మంచివారిని శిక్షించినట్లగును. బలాత్కరించువారిని మన్నించుట పేదవారిని బలాత్కరించినట్లగును.

అతిదుష్టువరిజేర్చి యాదరింపంగ
కడకు నీయాస్తికే కష్టగండ్లుదెచ్చు.

# 9

పాదుపాల చెలికారమునందును, బాలుర మధుర కంఠస్వరమునందును నమ్మకముంచరాదు. అది క్షణములో మారిపోవును. ఇది కలవలె అదృశ్యమగును.

వేయి తగులాటకాండ్రున్న వెలదియందు
జిత్తమెన్నడు లగ్నంబు సేయబోకు;
వలచుటొకవేళ నీ కనివార్యమైన
ఎడద యెడబాటునకు సిద్ధపడుటమేలు.

# 10

నీకుండిన ప్రతిరహస్యమును స్నేహితునికి చెప్పకుము. ఒకవేళ ఆతడు ఎదురుతిరిగెనేని ఒకానొకప్పుడు, విరోధి కాడని యెవరు చెప్పగలరు? నీకుండిన శక్తినంతయు శత్రువుపై ప్రయోగించి యాతని నొంపకుము. ఏలయన, ఆతడొకవేళ మిత్రుడుగా మారిన మారవచ్చును.

నీవు దాచియుంచుకొనతలచిన రహస్యమును స్నేహితుడైనను ఎవనితో చెప్పకుము. ఏలయన ఆ స్నేహితునకును స్నేహితులుందురు, వారికిని అట్లె.

తనరహస్యము నొకనితోననియు, మరల
నితరులకు జెప్పవలదని హెచ్చరించు
కంటె, జెప్పకయుండుట కరముమేలు;
నాల్కదాటినమాటలు నగరుదాటు.

సెలయేటి మొగదల నలవియౌ గట్ట,
బలిసి పెన్నేరైన బంధింపగలమె?

బహిరంగముగ జెప్ప భయపడుమాట
గూఢంబుగా జెప్పగూడదెవ్వనికి.

# 11

శక్తితరిగిన విరోధి వినయముతో వచ్చి చెలిమి పాటించునేని, బలమైన శత్రువును కాగలనను ఉద్దేశ్యమే తప్ప వేరొకటియుండదు. "మిత్రుల మైత్రినే నమ్ముటకు వీలులేదనగా ఇక శత్రువుల ముఖస్తుతులతో నేమి ప్రయోజనము" అని పెద్దలు చెప్పిరి.

అల్పుడని శత్రువును వదలిపెట్టినవాడు అజాగరూకతతో నిర్పురవను ఆర్పక విడిచినవాని బోలును.

నేడె వీలున్నయపుడార్పు నిప్పురవను,
అదియె దావాగ్నియై లోకమంతగాల్చు;
శరపరంపర గురిపించు శక్తియుంద
నెదిరి విల్లెక్కుపెట్టుట కెడమునిడకు.

# 12

పరస్పరము విరోధమున్నవారిలో ఒకనిని గురించి మరియొకనితో మాటాడునపుడు, ఒకవేళ వారు మిత్రులై కలబలుకుకొందురేని, నీవు సిగ్గుపడవలసిన యావశ్యకము లేనట్లుగా మాటాడుము.

పగవారలిరువురి తగవగ్నికిల;
కొండెగాడందిడు నెండుకట్టెలను;
వారివీరికి మిత్రభావంబు గుదుర,
నడిమి చాడీకోరు కడుగర్వ్యుడగును;
అరుల యిద్దరిమధ్య నగ్నిరగిల్చి
యందులో బొగ్గౌట యదియేమితెలివి?
చిన్నగామాటాడు చెలికాంద్రతోడ
పతిమిశ్రతుఁ చెవి బడకుండునట్లు;
గోడకు మునుప్రక్క గూడిమాటాడు
వేళజాగ్రత! చెవుల్ వెనుప్రక్కనుండు.

# 13

విరోధులతో చెలిమి పాటించువాడు స్నేహితులను కష్టముల పాలుసేయును.

పగవారితో మిత్రభావంబునెరపు
వానిసంబంధంబు వదలు పండితుడ.

# 14

కార్యనిర్వహణము నందు "ఇట్లు చేయవచ్చునా, చేయకూడదా" అని నిశ్చయించుకొనలేనప్పుడు ఏ మార్గమవలంబించిన నీకు కష్టములు గలుగవో ఆ మార్గమునే కోరుకొనుము.

చల్లగామాటాడు నతసాత్ముతోడ,
గరినోక్తులాడకు గద్దించినట్లు;

నీ తల్పుదట్టి శాంతిని గోరువాని
చివ్వకుగాల్దువ్వి నొవ్వాడబోకు.

# 15

ధనముతో నొకకార్యమును సాధించుటకు వీలున్న యపుడు, దానికొఱకు ప్రాణమును అపాయమున కగ్గము సేయకూడదు.

అన్నియుపాయముల్ వ్యర్థమైనపుడు
ఖడ్గంబుచేపట్ట గడున్యాయమగును.

# 16

బలహీనుడైన విరోధిపై దయచూపకుము. ఏలయన, ఆతడు మరల బలవంతుడయ్యెనేని నిన్ను మన్నింపడు.

పగవాడశక్తుడై పడెనంచుజూచి
మీసాలువడద్రిప్పి మిట్టాడబోకు;
ప్రతియెమ్ములోనుండు బలమైనమజ్జ;
ఒక్కొక చొక్కాయినుండు నరుండు.

# 17

దుష్టుని కడ తేర్చువాడు ప్రజలను వాని దౌర్జన్యము నుండి విడుదల సేయును. తానును దేవుని దండనమునుండి విడుదలయగును.

క్షమయు ప్రియమౌనుగాని, ప్రజావిరోధి
పుండునార్ప మలామును బూయబోకు;
పాముగరుణించి విడిచినవాడెరుంగ
డది మనుజసంతతికి వైరియన్ననిజము.

## 18

విరోధిసలహా నంగీకరించుట తప్పయినను, వినుట న్యాయ్యమె. ఏలయన, దానికి విరుద్ధముగ నీవు నడచుకోన వచ్చును. ఇదెంతయు ఉచితము.

శత్రువేమిపల్కినను హెచ్చరికవలయు,
కడకు జింతిలపనట్లుగా నడచుకొమ్ము;
నేరుగా కుడిప్రక్కకు దారిచూప
నెడమప్రక్కకు దిరిగి నీవేగవలయు.

## 19

మితమీరినకోపము జనులకు భయము పుట్టించును సమయానుకూలముగాని కారుణ్యము లాఘవము దెచ్చును. జనులు నిన్నుచూచి తిరిగిపోకుండునంత గట్టితనమును, నీతో ఎక్కువ చనవుగా నుండకుండునంత మెత్తదనమును చూపుము.

వైద్యుడెట్లుదుర్మాంసము ప్రక్కలించి
కురుపుమాన్పమొలామును జరుము, నట్లె
కఠినతయును గారుణ్యము గలసియున్న
గార్యనిర్వహణంబున గలుగుమేలు.

పండితుడు మేరవిడు కఠినుండు గాడు,
పెత్తనము క్రిందుపడునట్లు మెత్తపడడు;
ఉన్నతుడనంచు మితిమీరి యుబ్బిపడడు,
తానునీచతనెపుడేని తగ్గిపోడు.

గొల్లనిగాంచియిట్లనె కొడుకు: "తండ్రి,
నేర్పునాకుబురాతననీతి" యనిన,
"గరకుకోరలతేడేలు కరవరాని
యంతసౌజన్యముంబూను" మనుచుబల్కె.

## 20

ఇద్దరు మనుష్యులు రాజ్యమునకును మతమునకును విరోధులనవచ్చును. వారెవరనగా:— క్షమా గుణము లేని పాదుషాయొకడు. శాస్త్రజ్ఞానము లేని భక్తుడు మరియొకడు.

దైవాజ్ఞనెరవేర్ప దాసుండుగాని
ప్రభువు, రాజ్యమునకు రాకుండుగాక!

## 21

మిత్రులకు తనపైగల నమ్మకము తొలగునట్లు పాదుషా విరోధులపై కోపగించుకొనరాదు. మొట్టమొదట కోపాగ్ని కోపగించు వానిపై బడును. తరువాత దానికీలలు విరోధిని తాకవచ్చును లేక తాకకపోవచ్చును.

మట్టిలో బుట్టిన మనుజులకింత
యుద్ధతిగర్వంబు నొప్పుగాదెందు;

ఇంతటితలనిక్కు నింతటిదుడుకు
గలవాడుపుట్టిలో గలిగెనా కంటె
నగ్నిలోజనియించెనని నే దలంతు;
మును బలిఖాౕ పట్నమునకు నెనేగి
యొకమహాత్మునిగాంచి "యోపుణ్యపురుష
యజ్ఞానము నశించునట్లు బోధించు"
మన నాతడిట్లనె: "అపనియట్లీవు
నహసంబు వహియించు; నహయింపవేని
నేల బూడిచిపెట్టు నీ శాస్త్రములను."

# 22

దుఃస్వభావుడు (తన దుఃస్వభావమును) వైరిచేతిలో పట్టువడియున్నాడు. ఏచోటికేగినను దండనము పట్టునుండి తప్పించుకొన జాలకున్నాడు.

తాను నిహలోకకష్టముల్ దాటిపోయి
పరమునొందియు నిజదుఃస్వభావ శృంఖ
లానిబద్ధుడయి విముక్తిగానలేడు;
అనుసరించును దననీడయందు గూడ.

# 23

విరోధి సిపాయిలలో అన్యోన్యవిభేదములు పుట్టెనని తెలిసినయెడల నీవు నిర్వ్యాపారముగ నుండుము. వారు ఒకటిగా కలసిమెలసి యుందురేని నీ దుఃస్థితిని గురించి యాలోచింపుము.

శత్రువులలోన సమరంబు జరుగ, నీవు
సుఖముగా మిత్రులకడ గూర్చుండవచ్చు;
అరులునొకట్రైన, దుర్గవుద్యానములపైకి
పెద్దరాళ్లెత్తి విల్లెక్కు పెట్టుమోయి.

# 24

విరోధి తన మాయోపాయములన్నియు నిరర్థకము లయినపుడు స్నేహము ప్రారంభించును. ఏలయన విరోధముతో నెరవేర్పలేని కార్యములను మైత్రిమూలమున కొనసాగింప వచ్చును.

పాముతలను విరోధిచేతితో కొట్టుము. ఏలయన, రెండు ప్రయోజనములలో నేదైన నొకటి వ్యర్థముకాదు: విరోధి నెగ్గిన పాముచచ్చును. పాము నెగ్గిన విరోధిచచ్చును.

సమరదినమున బలహీనశత్రువనుచు
దలచి యేమరియుండుట తగవుగాదు;
బ్రతుకుపై నాసవీడినవాడు భయము
వదలి సింగపుదల జీల్చి మెదడుపెరుకు.

# 25

ఒకవార్త హృదయము నొప్పించునని నీకు తెలిసినప్పుడు నీవు చెప్పక యూరకుండుము. దానిని మరియొకడు తెలుపనిమ్ము.

ఓసి బుల్బులి, యామని డాసెనన్న
మంచివార్తను జనులకు పంచరమ్మ;
చిత్తదాతకమైనట్టి చెడ్డకబురు
పరమపాపిష్టి గూబకు వదలిపొమ్మ.

# 26

నీవు చెప్పుమాటలు పరిపూర్ణముగా అంగీకరింపబడునను నమ్మకము లేనిదే సాదుసాను ఇతరుని ద్రోహమును తెలుపకుము. అట్లుకాదేని నీ మరణమునకు నీవే ప్రయత్నించినట్లగును.

పలుక నంగవించు, పలుకులంగీకృతి
నొందగలవటంచు నూహయున్న;
మనుజజీవితమున మాటముఖ్యంబగు;
తప్పులాడి ఘనత తరుగనీకు.

# 27

స్వాభిప్రాయ గర్వితునకు సలహా చెప్పువానికి, సలహా చెప్పుటకు మరియొక నీతిబోధకుడు కావలసి యుండును.

# 28

వైరిమోసములకు లోబడకుము. ముఖస్తుతి చేయువారి పొగడ్తలకు ఉబ్బి తబ్బిబ్బుగాకుము. వారు మోసపు

టుచ్చులు పన్నియున్నారు. వీరు నీ యత్నాశను పెర
రేపినారు.

## 29

క్షణమునే పుట్టిన పీనుగు కాలిమడమవలె తెలివి
తక్కువవాడు ముఖస్తుతులకు సంతోషించి యుబ్బును.

మాటకారి పొగడ్తల మాటవినకు;
కొద్ది మూలధనంబుతో గోరుపెద్ద
లాభ; మొకవేళ వానితలంపుమేర
కాశదీర్పవయేని, వాడంటిగట్టు
నీకు సిన్నూరుతప్పులు నిశ్చయముగ.

## 30

ఎవ్వరైనను తప్పులెత్తి చూపించువరకు వక్త యుప
న్యాసము నిర్దోషముగ నుండదు.

తెలివితక్కువవారు తలలూపిరనుచు,
నీతలంపున నీవె నిపుణుండవనుచు
మాటల సొగసులో సాటిలేరనుచు
గర్వింపబోకుము; గలదులోకంబు.

## 31

ప్రతివానికి తన తెలివి నిర్దోషమనియు, తనబిడ్డ యంద
గాడనియు తోచును.

ఒకయూదునకు మరియొక్క మునల్మాను
నకుగల్గె వాగ్వాద మొకదినంబు;
వాదవస్తువు విన్న వచ్చె నాకను నవ్వు,
మునలిమానిట్లనె మోదకించి:
విక్రయపత్రంబు నక్రమమైనదే,
కాదేని నే జత్తు యూదుడనుగ;
అనవిని యూదుండు నాగ్రహంబున "తౌరి
యతు" పై నొట్టిసి యనియెనిట్లు:
నే నబద్ధము లాడిన, నీపిధాన
మునలిమానుకనయి ప్రాణములను విడుతు;
తెలివి లోకమునందు నదృశ్యమైన,
నమ్మ దొకడును దాను నజ్ఞానియంచు.

# 32

పదిమంది మనుష్యులొక పళ్లెరమున భుజింతురు. రెండు కుక్కలు ఒక కళేబరము కొరకు కీచులాడును. ఆశబోతునకు ప్రపంచములోని వస్తువులెల్ల తన యెదుట నుండినను సంతృప్తిగలుగదు. తృప్తిగలవాడు ఒకరొట్టెతో తనివిచెందును.

వ్యాపార సామాగ్రిగల భాగ్యవంతునికంటె తృప్తి గల దరిద్రుడే మేలని పెద్దలు చెప్పిరి.

ఒక్క రొట్టెతోడ నుదరంబు నిండును;
అవనియందుగలుగు నఖిలధనము
ఆశబోతువాని యాకటికన్నుల
నింపలేదు, కోర్కె జంపలేదు.

అంత్యకాలము తన కానన్నమౌట
దండ్రి నాకీనీతి దయచేసిపోయె:
"అగ్నియోగామంబు; త్యజియించు దాని,
నరకకీలలు లోన బెతరేపబోకు;
ఆ నిప్పులో గాలు నంతటిశక్తి
నీకులే; దోర్పను నీటి నీవాడె
చల్లి, చల్లార్పుము పెల్లుమంటలను."

# 33

తనకు శక్తి యున్నపుడే మేలుచేయని యతడు శక్తి తరిగినకాలమున కష్టములకు పాల్పడును.

ప్రజల బాధించెడు పాపాత్మకంటె
దురదృష్టవంతుండు ధరణిలేడెందు;
కష్టకాలమువచ్చి కడగండ్లుగుడువ
సాయంబుసేయనే సఖులుండబోరు.

# 34

తొందరగ చేయబడిన వస్తువు తొందరగ నశించును.

నలువదేడులు మాగ గలిపిమర్దించి
తూర్పుదేశపు మట్టితో చీనిగిన్నె
చేయుటవినియుంటి; చిరకాలముండు;
బాగదాదున నూరు పాత్రలు దినము
నలుపుచుందురు; వాని విలువయుండెలియు;
కోడిగ్రుడ్డు పెకల్చుకొనివచ్చు పిల్ల
అప్పుడే తిరుగాడి యాహారమరయు;

మనుజుని శిశువన్న జననమౌ వెనుక
తెలివి వివేచన గలుగకయుండు;
అటుహాత్తుగా వచ్చునది యేమిలెక్క?
క్రమముగా వికసించి, గౌరవమందు
ఉత్తమత్వమునందు, యోగ్యతయందు
నితరజీవులకంటె హెచ్చుగానుండు.
మానవనంతాన మహితమేదస్సు;
అన్నిచోట్లనుజికుక్క నద్దంపుముక్క
కాన, మూల్యములేదు కాథగ్గువౌట;
అరుదుగాజేపడు ననలైనకెంపు
అందుచేదానికి నధికంబు విలువ.

# 35

ఓర్పువలన కార్యములు చక్కబడును. తొందర పాటు వలన మొదలు చెడును.

ఇసుక యెడారిలో పయనించుచుండ నా కన్నులతో దీనిని చూచితిని:

శీఘ్రగామికన్న జేరెముందుగ నంచె,
మందగామి శ్రమము నొందకుండ;
గాలియడుగు తేజి దూలెనుబరుగెత్తి,
యొంటెవాడు మెల్ల నూరుచేరె.

# 36

అపండితునకు మౌనము శ్రేష్ఠము. ఈ హితోపదేశ మును అతడు గమనించునేని అపండితుడు కానేరడు.

నీకు రసవాక్సమత్కృతి నెగడదేని
నాలుకను నోటఁజెరపెట్ట మేలుగలుగు;
నాల్కదప్పిన దప్పను నరునిఘనత;
పప్పు పాలైన గింజకు బరువులేదు.

మతిలేని మూఢాత్ము డతియత్నమునను
చదువునంధ్యలు నేర్వపొగె గాడిదకు;
అదిగాంచి పండితుండనియె; "నో చెనటి,
యేమిసాధించెద వీ వెరిసేత?
ప్రజలయాడికలకు భయపడుమోయి,
నీవల్ల జంతువు నేర్చునేమాట?
జంతువుకడ నీవు చదువు మౌనంబు.
ప్రత్యుత్తరమునిచ్చు పట్టునవెవడు
తలపోయడో వాడు తగనిమాటాడు;
మాటలాడిన వాడు మతిమంతునట్లు;
లేక, జంతువురీతి మూకత్వమూను."

# 37

తాను తెలిసిన వాడని ఇతరులు మెచ్చుకొనుటకుగా, తనకన్న దెలిసినవానితో తర్కించువాడు, తాను తెలియని వాడని తెలుపుకొనును.

నిన్నుమించిన వేత్త నిలిచివాదింప
ఎరిగియుండియును నీవెదిరింపబోకు.

# 38

దుష్టులతో సహవాసము చేయువాడు మంచిని చూడ లేడు.

సైతానుతో దేవదూత స్నేహింప
అభ్యసించును ద్రోహ మధమవంచనము;
పెద్దవారలయొద్ద పెద్దనేర్పెదవు;
తోడేటిపనిగాదు తోలుకుట్టడము.

## 39

మనుష్యుల రహస్యదోషములను వెల్లడిచేయకుము. వారిని అవమాన పరతువు. నీవును నమ్మకము చెరచుకొందువు.

## 40

శాస్త్రములు చదివి, అభ్యసింపనివాడు, పొలము దున్ని వి_త్తనములు చల్లని వానినిపోలును.

## 41

హృదయములేని వానియందు (దేవునియెడ) వినయము పుట్టదు. పప్పులేని డొల్లగింజ వ్యాపారమునకు పనికిరాదు. వాదించుటలో చురుకుతనముగల ప్రతివాడును వ్యాపారములో గట్టివాడని చెప్పరాదు.

అందచందముగల యాకృతుల్చాల
నవగుంఠనములలో నలరుచుండు;
మునుగెత్తనందులో మునలవ్వతోచు.

## 42

రాత్రులన్నియు "శక్తిమంతమగు రాత్రు" లయ్యోనేని శక్తి మంతమగురాత్రి (షబెఖదర్) అశక్తిమంతమగును.

రాయిరప్పలు పద్మరాగంబులైన
రెండింటివెలలలో నుండదువాసి;

## 43

చక్కని రూపముగల ప్రతివానికిని చక్కని నడవడిక యుండదు. గుణము హృదయగతముగాని, చర్మగతము గాదు.

ఒకనిపాండిత్య సోపాన మొక్కవాట
దెలిసికొనవచ్చు; నంతస్సుదెలియలేము;
కానజాగ్రత్త! పెక్కేండ్లు గడచుఎరకు
వానిదుష్టస్వభావంబు బయలుపడదు.

## 44

గొప్పవారితో పోరాటము పెట్టుకొన్నవాడు తన శత్రురును తానే యొలికించుకొనును.

పెద్దవాడవటంచు గర్వింతువీవు.
"కాంచునొకటి రెండుగ మెల్లకంటివాడు,"
అనుచు సత్యంబుపల్కిరి జనులువినుము;
తగరుతోడి పోట్లాట నీతలకుజేటు.

# 45

సింహముతో పంజాపట్టుటయు, కరవాలు వాదరను పిడికిట గ్రుద్దుటయు బుద్ధిమంతుల కార్యముగాదు.

శక్తిమత్తులబోర నసమర్థుబోక;
చేతులు జంకలో జేర్చిమాటాడు.

# 46

బలవంతునితో ధైర్యముగ పోరాడిన బలహీనుడు తన చావుమూలమున విరోధులకు స్నేహితుడగును.

నీడసుఖముగ బెరిగిన వాడగుట,
సమరవీరులతో బోరశక్తిగలదె?
బలము చాలని బాహువు;— తెలివిమాలి
యినుపముష్టి మనుష్యుని నెదురుకొనెదు!

# 47

హితబోధవిననివాడు నిందావాక్యములు వినవలసి యుండును.

చేసిన హితబోధ చెవిదూరకున్న
నేను నిందించిన బూను మౌనంబు.

# 48

గుణహీనులు గుణవంతులను చూచి యోర్చుకొనలేరు. ఎట్లనగా, బజారుకుక్క వేటకుక్కలను చూచి యరచునేగాని ముందుకు చొరబోదు. నీచుడు గుణములందును

నైపుణ్యమునందును ఇతరులతో సరిరానియప్పుడు వారిని నిందింప సాగును.

హీనుడు సశక్తి దుర్గను డీకుబోతు
అధికుల నెక్కైన నవమానింపలాడు కుండు;
ఎదురుపడినప్పు, నీమని వణకిపోతు
నాలుకయు, గట్టినటు మాటగోలుపోవు.

# 49

ఆకటి తొందరలేనిదే యేపక్షియైనను వేటకాని వలలో పట్టుపడదు. ఒకవేళ వేటకాడు సైతము వలయొద్ద యుండడు.

కాలికి సంకెళ్ళు, కేలికిం గట్లు
పొట్టియూరింబున వానికుముకుండు;
ఊపరవాసుఁడవై ప్రబడిబడి వెచ్చింపవ,
దైవచింతన సేయ నెరవౌనె నీకు?

# 50

తత్వజ్ఞులు అకాలభోజనము చేయుదురు. భక్తులు సగము కడుపునకు తిని తృప్తిపడుదురు. సన్యాసులు ప్రాణము చిక్కబట్టుట కెంతమాత్రము వలయునో అంత మాత్రమే భుజింతురు. యువకులు పళ్లెములోని యన్నమును అడుగంటనూడ్చి తిందురు. అయితే దేశదిమ్మరులైన ఫకీరులు శ్వాసమునకైన సందు లేనియట్లు పొట్టలో

నన్నము కూరుదురు. వారు తిన్న వెనుక ఎవనికిని ఒక మెతు కైన నుండదు.

తిండిపోతుకు నిద్ర రెండు రేల్ లేదు,
తిన్న రేయియు దినకున్నట్టి రేయి.

# 51

ఆడువారితో ఆలోచించిన చేటుమూడును. ద్రోహిని శరణించిన నేరము వచ్చును.

చిరుతపులిని నీవు శరణించి విడుట
గొర్రెమందకు గోడుగుచిపికట్లగును.

# 52

విరోధి యందు కారుణ్యము నూన్నపుడు చంపనియతడు తనకు తానే విరోధియగును.

చేత రాయియు, బాము చేసూటినుండ,
మొత్తక విడువాడు మొద్దురాయుండు.

దీనికి వ్యతిరేకముగ ప్రవర్తించుటయె న్యాయ్యమని కొందరు చెప్పిరి. ఎట్లనగా, అపరాధి మరణదండనము నిర్వహించుటయందు ఆలస్యము మేలు. వలన వానిని చంపు టకును లేక వదలిపెట్టుటకును తగిన యవకాశముండును. అట్లుగాక, అతడు తొందరగ చంపబడునేని, మన్నింప వలయునన్న మంచిసలహా, ఒకవేళ నిష్ప్రయోజన మగును. ఇట్టి సందర్భమున తొందరపాటునకు పరిహారము అసంభ వము.

ప్రాణములుదీయుపని సులభంబెగాని
మృతునికెవడైన బ్రాణంబులియగలడె?
త్వరపడక యోర్పువహియించి శరము విడు;
విల్లువదలిన బాణంబు మళ్ళిరాదు.

# 53

అవివేకులతో వాదమునకుదిగు తత్త్వవేత్త గౌరవము వలయి ఆసపెట్టుకొనరాదు. వివేకశూన్యహృదయులను వాచాలత్వమున తత్త్వజ్ఞుని క్రిందుచేసిన ఆశ్చర్యమేమియు లేదు. వలయన, రాయి రత్నమును పగులగొట్టును.

వాయసము కోకిలము నొక్క పంజరమున
నుంచ, కోయిల యుత్సాహముడుగుటరుడె!
పండితుడు, దుండగీడులు బాధపెట్ట
కోప పడబోడు, మదిలోన కుందబోడు.

పనికిరానిరాయి బంగారుగిన్నెను
జితుకమొత్తినంత శ్రేష్ఠమగునె?
పైడివిలువతగ్గి పాడయిపోయెనే
రాతివిలువహెచ్చి ఖ్యాతిగనునె?

# 54

ఆటకూటాయగారి సమాజమున, విద్వాంసుని సూక్తులు వన్నెకెక్కకుండుటలో ఆశ్చర్యమేమియు లేదు. వలయన, వీణానాదము యుద్ధభేరీ గర్జనములలో మునిగి పోవును అంబరు సువాసన వెల్లుల్లిపాయల కంపులో మరుగు పడిపోవును.

సిగ్గిడితనాన, విద్వాంసు జెనకితినని
పెద్దగొంతుమూఢుఁడు చిక్కబెట్టుమెదను;
తెలియుదేమొ "హుజ్జాజి" మంజులరవంబు
నమరిదుందుభి రవళిలో నణఁగిలుట.

# 55

రత్నము బురదలో పడినను పూర్వయోగ్యతకు భంగము కలుగదు. దుమ్ము ఆకసమున కెగసినను తననీచత్వమును కోలుపోదు.

# 56

విద్యాభ్యాసము లేనివాని శక్తి శోచనీయము. శక్తి లేని వాని విద్యాభ్యాసము వ్యర్థము. బూడిద యుత్తమ సంబంధము గలదయ్యును (అగ్ని యుత్తమ ప్రకృతి గలది గావున) తనయందు యోగ్యత లేనందున దుమ్ముతో సమమయ్యెను. చక్కెరవిలువ చెరకు గడపైగాక, తన యంతః సారముపై ఆధారపడియుండును.

పతితుఁడు "కనాను" దుర్గుణవంతుడగుట
దా బ్రవక్తకు బుట్టియు దరిగె ఘనత;
సద్గుణంబున్న జూపుము; జాతియేల?
పొలుపగు గులాబి ముండ్లలో బుట్టలేదె?

# 57

తనంతతాను వాసన గొట్టుటవలన కస్తూరియని తెలిసికొందుముగాని, సుగంధము లమ్మువాడు చెప్పుటవలన

గాదు. పండితుడు సుగంధ భారపేటిక వంటివాడు; మౌనము వహించియు తన గుణ సౌరభ్యము నాసింప జేయును.

మూఢసభనున్న విజ్ఞానభూషణుండు,
అంధమధ్యగత మనోహరాంగి యువతి,
మతవిరోధి నాస్తిక హస్తగత ఖురాను
బోలునని చెప్పియుండిరి పుణ్యమతులు.

## 58

ఏండ్లపూండ్లు యత్నించి సంపాదించిన స్నేహితుని నొప్పించి యొక్క క్షణములో విడనాడుట తగదు.

రాయికొన్నేండ్లకు రత్నమైదనరు,
రాతితో దానిని వ్రక్కలింపకుము.

## 59

దుర్బలహృదయుడు గయ్యాళియాడి జనరాలిచేతిలో చిక్కుపడియున్నట్లు, వివేకము కాముకు చేతిలో పట్టుపడియున్నది.

ఏయింట నాడుది యెలుగెత్తి యరుచు
ఆయింట సంతోష మానంపబోను.

## 60

శక్తితో గూడని తెలివి వంచన మనవచ్చును. తెలివితో గూడని శక్తి మూఢత్వమును వెర్రితనమును గలిగించును.

తొలుతన్యాయజ్ఞతయు, బుద్ధి, తెలివితేట
వలయు, సకల సామ్రాజ్యవైభవము;
అజ్ఞమతిప్రాభవము రాజ్యవర్ధచయము
దైవ ధిక్కార యుద్ధ సాధనములగును.

## 61

తాను పస్తుపడి కూడబెట్టు భక్తునికంటె, తానుదిని యితరులకు పెట్టు గృహస్థు యుత్తముడు.

## 62

లోకులమెప్పు పడయుట కొరకు కామమును వర్జించు నతడు, క్రమమైన కామమును వీడి అక్రమమైన కామమునకు లోనగును.

దైవచింతనమున దత్తచిత్తుడుగాక
పర నిషిద్ధుడై మాయఁగప్పు
డయ్యో పాప! మేమియరయు జీకటియట్లు
మురికిపట్టియున్న ముకురమందు?

## 63

కొద్దికొద్దిగా చేరిన అనేకమగును. బొట్లుబొట్లుగా చేరినజలము వెల్లువయగును.

అంతంతగా జేర నధికమై తోచు;
అన్నిగింజలు చేర నగుధాన్యరాశి.

## 64

విరోధిచేత రాయిదెబ్బ తిన్నవాడు బాహుబలము లేనందున, అనుకూలసమయము వచ్చువరకు వేచియుండి వానిని పుటమార్చును.

## 65

సామాన్యుడు తనయెడ తప్పిదమొనరింప, పండితుడు సౌజన్యము వహించి వదలిపెట్టరాదు. ఏలయన, ఇరువురకును నష్టముగలుగును. పండితునకు గౌరవము తగ్గును. వాని మూఢత్వము సాపించినట్లగును.

నీచునితో నీవు నెమ్మిమైబలుక
అతని గర్వము నిక్కి నభివృద్ధిచెందు.

## 66

పాప మెవ్వడు చేసినను అది యంగీకృతము కాదు. పండితులు చేసిన మరింత గర్హ్యమగును. ఏలన, సైతానుతోడి పోరాటమునందు జ్ఞానమే యుద్ధసామగ్రి. అట్టి యుద్ధపరికరములు గలవాడే చెరబడునేని మిక్కిలి లజ్జాకరమగును.

వాంఛలుడుగని పాండిత్యపశువుకంటె
జ్ఞానహీనుడు సామాన్య మానవుండె
మాన్యుడగు; నీతడంధుడై మార్గమెడయు;
అతడు కనులుండియును గూపమందు బడును.

# 67

ప్రాణము ఒక యూపిరిపై నాధారపడి యున్నది. లోకస్థితి రెండు అస్థితులమధ్య నున్నది. మతమును లౌకిక సంపదకొఱకు అమ్మువాడు గార్దభ మనిపించుకొనును. యూసబును అమ్మినవారు మరల ఏమికొందురు?

వైరిమాటనమ్మి పరమైత్రి బంధంబు
త్రెంపినాడవీవు తెలిపిమాలి;
ఎవని విడినావె, యెవ్వనిగూడితో
యూహసేయుమోయి, యొక్కక్షణము.

# 68

సైతాను పరమభక్తులను, సుల్తాను దరిద్రులను లోఁగదీయలేడు.

ప్రార్థనము సేయకుండెడు వాని కప్పు
నీయకుము పస్తుపడువాడు వాయిదెరవ;
దైవవిధుల నిర్వర్తింప చప్పునతడు
అప్పుచెల్లించునని యేమి యూనగలదు?

# 69

తన జీవితకాలమున తనయన్నము తిననివారు తాను మరణించిన వెనుక పేరును జ్ఞప్తిపెట్టుకొనరు. ద్రాక్షపండ్లరుచి విధవరాలెరుంగునేగాని, తోఁట సొంతదారు ఎరుంగడు.

ఆకలిగొన్న వారిని మరవకుండుటకయి మతవిశ్వాసము గల యూదుఁడు, కరవు కాలమున సగమాకలి తీరునట్లు భుజించుచుండెను.

భోగభాగ్యంబుల సుఖించు పురుషుడెట్లు
కటికయాఁకటి బీదలగతి గ్రహించు?
దీనజన కష్టముల నెట్లు దెలియువాఁడు,
దనకు నిక్కట్టు లొంతయారి దగులకున్న?
వాజిపై స్వారి వెడలిన వన్నెకాఁడు,
కట్టెలబ్బి గాడిద చూడు కష్టపడెడు;
నీవు పొరుగింట నిరుపేద నిప్పుడుగను;
పొయ్యి వెడలునది యెతంప బుట్టు బొగయె!

# 70

వానిపుండునకు మొగాము చరిమి, యొకపూట తినబెట్ట లేకుండువేని, కరవు కాలమున దుఃస్థితిఁ గొనున్న దరి చేసిని "నివెట్లున్నావు" అని యడుగకుము.

బరువుతో నూబి వెగబడ్డ ఖరముగాంచి
కనికరింపుము; లేవేని, చకుకుపరిక;
"పడినదెట్లని" యోవాఁడు వచ్చియుండ
పూనుకొని తేఁబట్టుము పురుషునట్లు.

# 71

నిర్ణీతమైన దానికంటె ఎక్కుడుగ ననుభవించుట, నిర్ణీత కాలమునకంటె ముందుగ మరణించుట అను నీరెండు విషయములు తెలివికి సాధ్యము కావు.

వేడినిట్టూర్పులును మొరల్ వేనవేలు
నుతులు నిందలు మాన్పవు నొసటివ్రాత;
అనిఁ భాండారపతికేమి కని-డంబు
ఇంటమునలమ్మ దీపంబు గెంటియూర.

# 72

ఓయీ, ఆహారమన్వేషించువాడా, కూర్చుండుము, నీవు భుజింపగలవు. ఓయీ, మృత్యువుచే నన్వేషింపబడు వాడా, కదలకుము. నీవు ప్రాణమును రక్షించుకొనలేవు.

యత్నపడినను బడకున్న నన్నమబ్బ
దెవదేవుని కరుణార్ద్ర దృష్టివలన;
పెద్దపులినోట వలదూర్చి పెట్టబడియు
మృత్యువాసన్నమగుదాక మ్రింగబోదు.

# 73

కామతత్పరుడగు భాగ్యవంతుడు బంగారు జలపోత పోసిన మంటిగడ్డ. పుణ్యాత్ముడగు నిరుపేద, దుమ్మమునురు కొని యందము మాసిన ప్రియురాలు. ఈతడు మూసా ప్రవక్త కట్లబొంత. ఆతడు ఫరోను చక్రవర్తి రత్నఖచిత మైనయంగి. సజ్జనులకు దుర్దశ సంభవించినను నగుమో ముతోనుందురు. దుర్జనులకు ప్రాభవము కలిగినను మొగము వ్రేలాడ వేసుకొని యుందురు.

ప్రాభవము గౌరవముగల భాగ్యశాలి
దగ్ధహృదయుల యిక్కట్లు దలపడేని
ప్రాభవము గౌరవంబు పరంబు కందు
జేకుతవటంచు నతనితో జెప్పుమోయి.

# 74

ఈర్ష్యాళువు, దేవు డితరులకు కనుఁగొంచిన భాగ్యము నెడ లోభిత్వముచూపును. నిర్దోషులపయి వైరమూనును.

మెదడుచచ్చిన మనుజుండు, వదరుబోతు
గౌరవస్థుని నిందింప గని యిటంటి:
మందభాగ్యుఁడవై నీవు గుండెవేని,
యది యదృష్టవంతుని దోసమౌనటోయి.

ఈనుబోతువాని కిక్కట్లు గోరకు
తనకు దానెయౌను దగినశిక్ష;
వానిపై విరోధమూన నక్కరలేదు
పదములంటితిరుగ బరమవైరి.

# 75

ఇచ్ఛలేని విద్యార్థి, మాటలులేని ప్రేమసుడు. జ్ఞానములేని యాత్రికుడు రెక్కలులేని పక్షి. అభ్యాసహీనుఁడగు శాస్త్రవేత్త ఫలములు లేని వృక్షము. శాస్త్రజ్ఞతలేని భక్తుడు ద్వారములేని గృహము.

# 76

ఖురాను అవతరించిన యుద్దేశము ప్రజలు సత్ప్రవర్తనము నేర్చుకొనుటకేగాని, కేవల మధ్యాయములు వల్లించుటకు కాదు.

విద్యావంతుడు-కాని సామాన్యభక్తుఁడు, కాలినడకఁబోవు బాటసారి. సోమరిశాస్త్రజ్ఞుఁడు, నిద్రపోవుచు స్వారి

చేయువాడు. ప్రార్థించుటకు చేతులెత్తు పాపి, గర్వముతో తలయెత్తు భక్తునికన్న మేలైన వాడు.

కరుణా స్వభావంబుగల పైనికుండు
క్రూరతాత్త్వికు కంటె గుణతరుండగును.

# 77

అభ్యాసము లేని శాస్త్రజ్ఞుడు తాలూనివంటివాడని యొకనితో చెప్పిరి. "తేనె కూర్పలేని తేనెటీగ" అని అతడు చెప్పెను.

తేనె కూర్పవుగాన తెగకట్టబోకు
మని చెప్పు నరఘుకు నదిక్రూరచిత్త.

# 78

పౌరుషము లేని మనుష్యుడు స్త్రీ సముడు. అత్యాశా పూరితుడగు భక్తుడు దారిదోపిడీకాడు.

తివిరి ప్రజమెప్పుపడయగ దెల్లయంగి
దొడిగితివిగాని, చరితంబు దోషయుతము.
అంగరేకు చేతులు పొట్టివైన బొడగు
వైన, లౌకికవృత్తిని మానుమోయి.

# 79

రెండు తెరగుల మనుష్యులకు దుఃఖము హృదయమును వదలదు; పాదము ఆశాభంగ పంకము నుండి బయట పడదు. వారెవరనగా, ఒకడు నౌవ్యసన విపన్నుడగు

వణిజుడు. మరియొకడు, దేశద్రిమ్మరి ఫకీరులతో సహవాసము చేయు వారసు.

ఆస్తి దరిచేసి మూఢకు నర్పణంబు
సేయుచుండిన నిన్నెతు దీయగలరు;
వారిసంగతి వదలుము; వదలవేని
యున్నమట్టుకు వారికి నూడ్చిపెట్టు.
దంతి మావటి చెల్మి దలపకు, లేక
యేన్గు పట్టునట్టు ఇల్లు గట్టింపుము.

# 80

సుల్తాను ప్రసాదించిన యంగి ప్రియమైనదయ్యును, దాని కన్న సొంత ప్రాతచొక్కాయె శ్రేష్ఠమగును. గొప్పవారి యింటి విందు రుచికరమైనను, దానికన్న సొంత సంచిలోనున్న రొట్టెముక్కయె మరింత యింపుగా నుండును.

చేతికష్టపు ప్రాప్తి దినుగూర, కాని,
గ్రామాధిపతి విందుకంటె మేలౌను.

# 81

సందేహముతో ఔషధము సేవించుటయు, ఇదివరకు చూచి యెరుగని మార్గమున సార్థవాహముతోడగాక యొంటరిగ నడచుటయు సమంజసము కాదు. మరియు ప్రాజ్ఞసమ్మతమునుగాదు.

"శాస్త్రవిజ్ఞానమునందు ఇంతటియున్నతపదవి నెట్లు పొందితిరి." అని ఇమాంమహమ్మదుగజవీని ప్రశ్నించిరి.

"ఎట్లనగా నాకు తెలియని విషయమును ఇతరుల నడిగి తెలుసుకొనుటకు సిగ్గుపడినది లేదు." అని ఆయన జవాబుచెప్పెను.

వైద్య నిపుణుని నీ నాడి పట్టనిమ్ము
అనయుంటు నారోగ్యము నందెదంచు;
అడిగి కన గొమ్ము; నీచపౌ నడు గుటన్న,
నడియెపథనూచి పాం.తీ యశముల కుసు.

# 82

ఎట్లయిన నొక విషయము నీకు తప్పక తెలియబడు నని తెలిసికొందువేని, దానిని గురించి తొందరపడి యడుగకుము. ఏలయన నీ ప్రాభవమునకును, గౌరవమునకును హాని కలుగును.

మహిమ, దావీదు చేతిలో మైనమట్టు
లినుము మారుట లక మాను గనెను గాని,
అడుగ డెటుమారెనంచుః దానడుగకుండ
దెలియబడునను నమ్మిక గలదుగాన.

# 83

చెడ్డవారితో సహవాసము చేయువానిని, ఒకవేళ వారి దుఃస్వభావము అలవడకపోయినను, వారి మార్గ మవ లంబించు వాడని, యితరులు సందేహింతురు. ఎట్లనగా,

పానశాలకు నమాజు చేయుటకు పోయినను, ద్రాక్షసారాయి త్రాగుటకు పోయెనని చెప్పుదురు.

మూఢుల సహవాసమున మూఢబుద్ధి
వైరిపక్ష దుర్యశ మార్జించినావు;
పెద్దలనొకనీతి వేసి నిల్పినిరి:
"అజ్ఞుల గూడకు, మరి యేలయన్న,
జ్ఞానముండినను, గొన్ని నాళ్ళకు నీవు
ఖలతుల్యుడౌదువు; కడు మొప్పువైన
నంతకంటెను మొద్దువౌదు వెవ్వరికి!

# 84

ఒంటె బుద్ధికౌశలమును సౌజన్యమును ఈ కథ వలన తెలిసికొనవచ్చును.

ఒక బాలుడు ఒంటె ముక్కుత్రాటిని పట్టుకొని నూరు ఫర్లాంగులు తీసికొనిపోయినను మెసలక నటునిటు త్రిప్పక వాని ననుసరించును. అయినను అపాయకరమైన లోయ ముందుండి మరణశంక గలిగినపుడు, బాలుడు తెలియనితనమువలన ఆ దారినే నడువగోరినపుడు, వాని చేతిలోనున్న కళ్లెమును వదలించుకొని, వాని యిష్టప్రకారము నడచుకొనదు. ఏలయన, ఆపన్నుడయినను మొత్తె దనమూనుట నింద్యమగును. విరోధ మెత్తిన యప్పుడు స్నేహితుడు కాక పోవుట యట్లుండ వాని వైరితృష్ణ మరింత హెచ్చునని పెద్దలు చెప్పుదురు.

కరుణమన్నించువానికి కాలిధూళి
గమ్మ, వైరింప గన్నుల దుమ్ముచల్లు;
కరిని మెత్తగబతిమాల కార్యమున్నె?
అకురాయి వినా శోధ్యమౌనెత్రుప్పు?

# 85

ఇతరులు సంభాషించుచుండ, తన తెలివితేటల భాండారము బయలుపడుటకుగా, నడుమసందుకొని మాటాడునతడు తన యజ్ఞానమును ప్రకటించుకొనును.

పదిగ ప్రశ్నింపబడనిదే ప్రాజ్ఞుడెపుడు
నొనగడు తనంతతానె ప్రత్యుత్తరంబు;
వెరసి యొప్పయ్యు వాచాటు విపదగుంబు,
వాద సారాంశమును నమ్మ వలనుపడదు.

# 86

నాకు మరుగు తలమున నొక కురుపు లేచియుండెను. మా గురువుగారు ప్రతిదినమును 'ఎట్లున్నది,' అని యడుగుచుండిరేగాని, "ఎక్కడ కురుపు లేచినది" అని యడుగకుండిరి. అవయవములను ప్రత్యేకముగ పేర్కొనుట అసభ్యమని మానుకొనినట్లు నేను గ్రహించితిని.

ఆలోచింపక ప్రశ్నించువారు ప్రత్యుత్తరము వలన కష్టపడుదురు.

మాట నాటిదనము మది జక్కదలపక
నోరుదెరచియెడియు నుడువరాదు;

దబ్బరాడి చెరను దప్పించుకొనుకంటె,
సత్యమాడి చెరకు జనుటమేలు.

# 87

అబద్ధము చెప్పుట కత్తిగంటివంటిది. ఎట్లన, గాయము మానినను మచ్చ నిలచియుండును, అబద్ధములాడు నరన్న దుష్కీర్తి గాంచిన యూసబు సోదరులు నిజము చెప్పినను జనులు నమ్మకుండినది నీ వెరుగవా?

సహజముగ సత్యమాడెడు సజ్జనుండు
ఒకటి బొంకిన మన్నించి యూరకుంద్రు;
అనిశము నసత్యమాడు దుర్యశముగన్న
నరుడు నిజమాడినను వాని నమ్మబోరు.

# 88

ఎట్లుచూచినను సృష్టియందలి ప్రాణికోటులలో మానవుడే యుత్తముడు. జంతువులలో కుక్క నీచమైనది. అయినను పెద్దల యభిప్రాయ ప్రకారము, చేసిన మేలు మరచు మనుష్యునికంటె మేలుమరువని కుక్కయే శ్రేష్ఠమగును.

ఒక్కకడియన్న మొకపరి కుక్కకిడిన
మరవదవ్వల రాళ్ళతో దరుముకొనిన;
అధము జిరకాలమాదట నాదరింప
స్వల్పవిషయంబు కొరకు ద్వేషము వహించు.

# 89

ఇంద్రియలోలుడు సద్గుణములను పెంపుచేయలేడు. సమర్థుడు కానివాడు నాయకత్వమునకు తగడు,

దండి తిండికాని దయనాదరింపకు
దండి తిండి మొద్దుతనము దెచ్చు;
ఎదుపొల్కి బలియనిచ్చగించెదవేని
ఖరమురీతిదినుము కర్రపెట్లు.

# 90

అంజీలులో నిట్లు చెప్పబడియున్నది. "ఆదాము సంతానములారా, నేను మీకు భాగ్యము నొసంగుదునేని, నన్ను మరచి దానియందే మునిగి తేలుచుందురు. అట్లుగాక, పేదరికము నిత్తునేని దుఃఖపీడితులయి నిరుత్సాహముతో కూలబడియుందురు. అట్టి మీరు నన్నెట్లు మధుర స్తుతుల సేవింపగలరు? ఎట్లు నన్ను పూజించుట కాతురపడుదురు?"

కలిమియున్న నలక్ష్యము కావతంబు,
కలిమిలేకున్న హృదయార్తి కష్టభరము;
ఇందునందును నీ స్థితి యిట్టులుండ,
దైవనక్తుండవైయుండు తరుణమేది?

# 91

సమానరహితుడగు జగదీశ్వరుడు తన యిష్టప్రకారము ఒకనిని సింహాసన భ్రష్టుఁగావించును. ఇంకొకనిని మత్స్యగర్భము నందైన కాపాడును.

నిను నుతించెడువాని కొనరు సంతుష్టి
యఘాసురువలె జేప యుదరస్థుడైన

# 92

భగవంతుడు రౌద్రముఖ్యాని ఖడ్గమును ఒరనుండి బయటికి లాగిన, ప్రవక్తలు ఏలీలు వెనుకకు తగ్గుదురు. కరుణార్ద్ర దృష్టి పరపుచేని పుణ్యాత్ములపైనను దుష్టులపైనను సమానముగ ప్రసరించును.

అంత్యాదినము జనా ఖిన్నులరవి మాత
నీ క్షమా హేతువు ప్రవక్త లియుగలరు?
"ఈశ, కరుణించు, పాపులకాశగలదు
తమరి క్షమయందు"నని ప్రార్థనము దప్ప.

# 93

ప్రాపంచిక కష్టముల ననుభవించియు సన్మార్గము నవలంబింపని మనుష్యుడు అంత్యమున నిరంతర శిక్ష ననుభవించును.

శ్రేష్ఠులైనవారు శిక్షించుచునున్న
బుద్ధిచెప్పి వెనుక బద్ధుచేయు
దలతు; రట్లునీవు తమనీతి వినకున్న
గడకు బందిగమున నిడుదురోయి.

# 94

భావిసంతతులు తమ చరిత్రను (చెష్టను) ఉదాహరణముగ గ్రహింపకుండునట్లు అదృష్టవంతులు పూర్వచరిత్రలనుండియు, సాదృశ్యములనుండియు నీతిని గ్రహింతురు.

వలనఁ జల్లిన ధాన్యంబువంక జనదు
పక్షి, మున్నందు నొకపక్షి పట్టువడిన;
పరులయిక్కట్లుగని నీతి బడయుమోయి,
ఒరులు నినుగాంచి నీతిని బొరయునట్లు.

# 95

పుట్టు చెవిటివాడు వినవలయుననిన ఎట్లు వినగలడు? అదృష్టము తన యుచ్చులలో నొకనిని చిక్కించుకొని లాగుకొనిపోవ, పోకుండ వాడెట్లు తప్పించుకొనగలడు.

భక్తకోటి తమిస్రలు వరలు నంతు
తిగ్మతేజోవిరాజిత దినములట్లు;
బాహుబలమున గలుగ దీభాగ్యగరిమ,
దేవుడు దయార్ద్రమతి ప్రసాదింపకున్న.

నీపైని నెవరితో నేమొఱలిడుదు,
నినుమించుతీర్పరి గనము వేఱొకని;
నీచేయికంటె మించినచేయిలేదు;
విరికైనను నీవు దారిచూపింప
దప్పగొట్టుట కేరితరం; మొకవేళ
తప్పుదారినిమాపి త్రిప్పుటపెట్టు
నరి త్రోవజూపించు శక్తుడెవ్వండు?

# 96

కడపటి దశలో కష్టమనుభవించు పాదుషాకంటె అంత్యమున సుఖమనుభవించు బిచ్చగాడు మేలు.

దుఃఖంబునకు వెనుక దొడరు సుఖంబు
సౌఖ్యంబు వెన్నాడు క్షతికంటె మేలు.

# 97

ఆకాశము భూమిపయి వాన కురిపించును. భూమి ఆకాశముపయి దుమ్ము చల్లును.

నాన్యభావము నీకు నచ్చకయున్న
విడువబోకుము నీదు విమలవర్తనము.

# 98

సర్వేశ్వరుడు మన దోషములను మూచి కప్పిపెట్టును. పొరుగింటివాడు చూడకపోయినను పెద్దగొంతుతో ప్రకటించును.

గుప్తవస్తువుగాంచు గుణమున్న ప్రజకు
ఒకనిచే నొకనికి నుండదు శాంతి.

# 99

బంగారమును గనినుండి త్రవ్వి బయటికి తీయుదురు. లోభిచేతిలోని బంగారము వానిని చంపనిదే బయటపడదు.

నీచులర్థంబు గుడువక నేలనిడుదు;
రసుభవము కంటె నానయే యధికమంద్రు;
అయ్యో! నిధియట్టులేయుండ; నధములోభి
చచ్చు నొకనాడు శత్రులు సంతసింప.

# 100

దీనుల పోషింపనివాడు నిరంకుశుని బలాత్కృతికి పాల్పడును.

బలము చలముగల్గు ప్రతిబాహువు నశక్త
జనులకరము విరువజాలకుండు;
పేదయెడల గాయపెట్టకు; మొకవాడు
బల్లిదుండు నిన్ను భంగపరచు.

## 101

ఒక దర్వేసి యిట్లు ప్రార్థించెను: "కరుణామయా, దుర్జనులను కరుణింపుము. సజ్జనులను సద్గుణములతో పుట్టించి వారిపట్ల తమరంతటతామె దయచూపియున్నారు."

## 102

ప్రాజ్ఞుడు పోరాటమువచ్చు నెడల ప్రక్కకు తొలగును. శాంతి చేకూరునేని యచ్చట లంగరు వేయును. ఏలయన ఆ సమయమున నొడ్డునుండుట క్షేమకరము. ఈ సమయమున మధ్యనుండుట సౌఖ్యకరము.

## 103

జూదగానికి మూడు ఆరులు కావలసియుండెను. కాని మూడు ఆసులు చేతికి వచ్చెను.

బయలుకంటెను మేలు పచ్చనిబీడు,
ఆయిన, గళ్ళెములేదు హయముహస్తమున.

## 104

అంగీయంచులకు జలతారు కట్టించి యెడమచేతి వ్రేలికి ఉంగరము పెట్టుకొన్నవారిలో మొట్టమొదటివాడు

జంషీడుచక్రవర్తి. "కుడిచేయి శ్రేష్ఠమైయుండగా ఎడమచేతి నేల యలంకరించితిరి?" అని ఆయనను ప్రశ్నించిరి.

"కుడిచేతికి తాను కుడిచేయియైన ఘనతయే చాలును," అని ఆయన జవాబు చెప్పెను.

> చిత్రశిల్పుల ఓల్చి చెప్పిన రీతి
> షాహిఫరిదూను: "హస్తమే కనుము
> నందు నీ వాక్యము లెల్ల గుట్టుండు:
> ప్రాజ్ఞుడా, దుష్టుని పయి జాగ్రత్తయుండుము,
> తక్కొరుల్ తమయంతవారె యెఱుగుదురు"

# 105

"కుడిచేయి యంతటి శ్రేష్ఠమైయుండగా యెడమచేయి నేల యుంగరము ధరించెదరు" అని యొక పెద్ద మనుష్యుని అడిగిరి.

"పండితులెల్లప్పుడు అలక్ష్యము చేయబడుదురని నీ వెరుగవా" అని యాయన ప్రత్యుత్తరమిచ్చెను.

> కలిమిలేముల సృష్టి వెలయించుధాత,
> భాగ్యమేనియు గుణభాగ్యమేనిచ్చు.

# 106

తల తెగునను భయమునుగాని, ధనమునకు ఆశగాని లేనివారు పాదుషాలకు సలహా చెప్పుటకు తగియుందురు.

మెడను ఖడ్గంబుపెట్టిన, నడుగులపయి
పసిడి చల్లిన, వెరపునంబరములేదు
ద్వైతమును విశ్వసించు తత్వజ్ఞమతికి;
ఇదియె యేకత్వపు బునాది; యిదియెచాలు.

# 107

పాదుషా నిరంకుశుల నడగద్రొక్కుటకును, రక్షక భటాధిపతి హంతకుల శిక్షించుటకును, ఖాజి దొంగలను విచారించి తీర్పుచెప్పుటకును ఏర్పడియున్నారు. కేవలము న్యాయముతోడనే సంతృప్తిపడు వాది ప్రతివాదు లిరువురు ఎప్పుడును ఖాజీదగ్గరకు పోరు.

న్యాయమును దెల్లముగఁగాంచి యనఁజెప్ప
వలసియుండిన మృదువుగా బలుకమేలు;
ఇష్టముగ నీవు పన్నుల నీయకున్న
కష్టపెట్టఁగఁగొను గరగ్రాహుబంటు.

# 108

అందరి దంతములు పులుసు తినుటవలన మొద్దుబారును. కాని ఖాజీకి మాత్రము తీపు (లంచము) తినుట వలన కరకు చెడును.

ఖాజీకి నొక దోసకాయ నర్పింప
పది పుచ్చుమడులు నీ పరముగా దీర్చు.

# 109

వృద్ధురాలైన వెలయాలు తన వృత్తిని గురించి పశ్చాత్తాప పడును. పదభ్రష్టుడైన రక్షకభటాధిపతి తన క్రూరత్వమునకై అనుతాపము నొందును.

ప్రాయపు నరుండు సన్న్యాసి వ్రతముపూని
దైవపథమున సింహంబు రేవనడచు;
బడుగువృద్ధుండు నన్నియు వదలనేమి,
సొంతముగ లేవలేడు కూర్చున్నమూల.

# 110

ఒక ప్రఖ్యాత పండితుని ఇట్లడిగిరి: "భగవంతుడు సృజించిన వృక్షములలో ఎన్నియో ఫలవంతములైనవి యుండ, వానిలో నొక్కదానికిని గాక "స్వతంత్ర" అను పేరు ఫలశూన్యమైన దేవదారు వృక్షమునకు మాత్రమే వచ్చెను! దీని రహస్యమేమియో తెలుపుడు."

ఆయన యిట్లు చెప్పెను: ఒకొక్కదానికిని నిర్ణీతమైన ఫలము, ఋతువు కలదు. ఆ కాలమువలన ఒకప్పుడు తరువులు శోభించును. మరియొకప్పుడు జీర్ణించి వాడినవై యుండును. దేవదారు వృక్షమునకు ఇట్టి మార్పు లేవియును లేవు. ఎల్లకాలము పచ్చని సంతోషముచే వెదచల్లుచుండును. ముక్తుల తత్త్వముకూడ నిట్టిదే.

స్థిరముగానట్టి దానిపై చిత్తమిడక;
ఘనఖలీఫాలు మృతులైన వెనుగూడ
బాగదాద్ మహాపట్టణ పరిసరోర్వి
జలసమృద్ధిగ బారు 'డిజ్లా' ప్రవహించు.

కలిమియున్న నీవు ఖర్జూరకములట్లు
కనికరించి ప్రజల గాపుమయ్య;
తిండి పేదవైన, దేవదారు మహీజ
మట్లు ముక్త పదవి నందు బ్రతుకు.

# 111

రెండు తెరగుల మనుష్యులు మరణించి వారితోడ దుఃఖమును గొంపోయిరి. వారెవరనగా: ఒకడు ఉండి అనుభవింపనివాడు. మఱియొకడు తెలిసి యాచరింపనివాడు.

పిసినిగొట్టుదోష వినర్గంబు ప్రకటింప
యత్నపడనిమనుజు నరయలేము;
రెండునూర్లు తప్పులుండియు దయయున్న
దయయెవానినెల్ల దాచిపుచ్చు.

# ఉపసంహారము

దేవుని కృపవలన 'గులాబితోట' అను ఈ గ్రంథము పరిసమాప్తమైనది. ఈ గ్రంథమందంతటను పూర్వుల కవిత్వమునుండి ప్రమాణములు గ్రహించు కృతికర్తల యాచారమును నేనవలంబింప లేను. ఏలయన,

పరుల మేలుఁగోరి యొసఁగవెత్తుఁగాక
తన మానికముఁబౌంత తగు బ్రాతమైన.

సాదీ వచనములు చాలవరకు హృదయోల్లాసము వెదచల్లునవిగను, మాధుర్య సమ్మిశ్రితములుగను ఉండును. హ్రస్వదృష్టులైన కొందరు ఈ వచనముల నిట్లు విమర్శింప సాగిరి: "మొదటి సామును నిరర్థకముగ వెచ్చించుటయు, ఏమిలాభమును పొందక దీపపుపొగలో కష్టపడుటయు బుద్ధిమంతుల కార్యము కాదు"

అయినను ఎవరి హృదయములు ప్రకాశింప జేయుటకు ఈ వచనములుద్దేశింపబడియున్నవో అట్టి సహృదయులకును, మహనీయులకును ఈ క్రింది విషయములు గోప్యములు కావు. హితోక్తి మౌక్తికములు మధురరీతి సూత్రమున గ్రుచ్చబడియున్నవి. మనసు విసుగెత్తి మానవులు అంగీకార విముఖులు కాకుండునట్లు హితమను తిక్తౌషధమును చమత్కారమకరందమున మిశ్రితము చేయబడి యున్నది.

జీవితంబెల్లవెచ్చించి సిద్ధపరచి
మంచిహితములు మిముఁబర్పించితివాడ;
వాని బ్రీతిగ గ్రహియించుఁడెల్ల మీరు,
దేవుఁడు ప్రవక్తలంబంపి తెలుపుగాత!

గులాబితోట సర్వము సంపూర్ణము